# అధిక్షేప శతకములు

సంపాదకుడు

**డా॥ కె. గోపాలకృష్ణరావు**




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు 4

ADHIKHSHEPA SATAKAMULU:

This Volume Contains Six Telugu Classical Satakams.

1. Bharga Satakamu by Kuchimanchi Thimma Kavi of 18th cen. A. D.
2. Bhakta Mandara Satakamu by Kuchimanchi Jagga Kavi of 18th cen. A. D.
3. Kavi Choudappa Satakamu by Kavi Choudppa of 17th cen. A. D.
4. Venugopala Satakamu by Polipeddi Venkataraya Kavi of 17th cen. A. D.
5. Kolanka Madana Gopala Satakamu by Venkata Kavi of 19th Cen. A.P.
6. Guvvala Chenna Satakamu by Guvvala Chenniah of 18th Cen. A.P.

Edited by Dr. K. Gopala Krishna Rao, Head of the Department of Telugu, Osmania University, Hyd. A.P.

---

**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి**

హైదరాబాదు - 500 004

ప్రచురణ : **325**

ప్రథమ ముద్రణ : **1982**

ప్రతులు : **2,000**

**వెల : రూ. 4-50**

ప్రతులకు :

**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి**

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004.

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**

హైదర్‌గూడ, హైదరాబాదు-500 001.

---

**Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.**

# విషయానుక్రమణిక

విస్తృతావకాశము కలదు. అధిక్షేప, చారిత్రక, కథాత్మక, శాస్త్ర, తత్త్వ, వర్ణనాత్మక అనువాద శతకము లను వర్గీకరణ ఇట్టిది. దీని యందును ఒక్కొక్క విభాగమున ఉపవిభాగములు చేర్చి శతకములను వర్గీకరింపవచ్చును. భక్తి శతకములలో సగుణ నిర్గుణోపాసనా భక్తి, నానాదేవతా భక్తి శతకములు, దేశ, గురు, రాజ, మంత్రి, అధికార, మహాపురుష, నాయక, స్తుతి పరములుగ రచింపబడిన శతకములు ప్రత్యేకముగ పేర్కొనదగినవి. నీతి శతకములను సామాన్య నీతి, కువారీ కుమార, నీతి, సాంఘిక, రాజనీతి, ఆదిగాగల అంశములుగా వర్గీకరించి పరిశీలింపవచ్చును. శాస్త్ర శతకములలో తత్త్వశాస్త్ర, జ్యోతిష, మంత్ర, వైద్య, ఆర్థిక, భాషాశాస్త్రాది శతకములు ప్రధానములైనవి.

భాష, రచనా విధానము, అలంకారరీతుల ననుసరించి వచన, అచ్చ తెనుగు, శ్లేష, వ్యాజోక్తి, దృష్టాంత, అన్యాపదేశ శతకములు వెలువడి ఈ శాఖను పరిపుష్ట మొనర్చినవి.

ఆరంభదశ నుండి నేటివరకును తెలుగు శతకములలో పండిత పామర రంజకములై నిరంతరాదరాభిమానముల నొంది నిలిచియున్నవి భక్తి, నీతి, శృంగార శతకములే. జాతి సంస్కృతికి, మానవ జీవనవిధానమునకు, మానసిక దృక్పథమునకు ఈ శతకములే ప్రతిబింబములై నిలచినవి.

భక్తి శతకములను నిశితముగను, మరింత సూక్ష్మదృష్టితో పరిశీలించి నపుడు నీతి అను అంశము వీనిలో అంతస్సూత్రముగ నున్నట్లు స్పష్టమగు చున్నది. మానవ జీవనమును సారక మొనర్చుకొనుటకు, పునర్జన్మరాహిత్యము నకు భక్తియే సాధనమని శతక కవులు భగవన్నామ గుణసంకీర్తనము, భగవ ల్లీలాభివర్ణనముల నొనర్చిరి-కామక్రోధాది అరిషడ్వర్గములను జయించుట-హృద యమును నిష్కల్మషముగ నొనర్చుట, ఉన్నత గుణముల నలవరచుకొనుట, సద్భక్తి, సజ్జన లక్షణములు, మున్నగువాని మూలమున వారు నైతిక జీవన పథమును నిర్దేశించిరి. నైతికాంశములను ప్రత్యేకముగ వస్తువుగ గ్రహించి నీతి శతకములు రచించుటకు ఇదియే ప్రాతిపదికయైనది. మూలపదార్థ మొకటై ఆకారములు నా నా విధములుగ నున్నట్లే నీతి బోధనకు మార్గములు కూడ

భిన్నవిభిన్నములైనవి సత్యమే పలుకుము - ధర్మమునే ఆచరింపుము అను సామాన్యోపదేశ విధానము ఆదేశపూర్వకమైనది షడ్విధ నీతులను విశ్లేషించి అలంకారముల నాశ్రయించి చెప్పుట వివరణాత్మకమైన విధానము. వీనినే అలంకారికముగ దృష్టాంత అన్యాపదేశ రూపము లనవచ్చును

నిషేధ, నిరసన విధానములు వీనికంటె భిన్నమైనవి కొన్ని నీతులను సామాన్య రీతులలో నుపదేశించుటకంటె ఉపాలంభన అధిక్షేప రూపమున బోధించినపుడు దాని విలువ, ప్రభావము మరింత అధికమగును శరీరారోగ్యమునకు చేదుమందు తోడ్పడినట్లే వ్యక్తి లేదా సమాజమును సంస్కరించుట కీ మార్గము ఒక్కొక్కసారి శక్తిమంతమై సత్ఫలితముల నొసగును కీలెరిగి వాత పెట్టినట్లు లోపమును గుర్తించి దానిని ఖండితముగా వ్రేలెత్తి చూపుట అవసరము-అధిక్షేప కావ్యముల ధోరణి యిదియే

అధిక్షేపమునకు నిరసనము-విమర్శనము-ఉపాలంభనము-విడంబనము-హేళనము-దూషణము-అనునవి ఛాయామాత్రముగ పర్యాయవాచి పదములు-తెలుగులో చాటువులు, కావ్యములు - లఘు కావ్యములు, శతకముల రూపమున అధిక్షేప రచనలు వెలువడినవి. మొదటి దశలో అనగా పురాణ యుగమున వెలువడిన కావ్యములలో అచ్చటచ్చట కథా సందర్భము ననుసరించి కొన్ని కొన్ని ఘట్టములు అధిక్షేప ప్రధానముగా సంతరింపబడినవి వేములవాడ భీమకవి-మేధావిభట్టు బడబానలభట్టు-మొదలగువారు శాపానుగ్రహశక్తియుక్తులైనకవులు-వీరు ప్రత్యేకముగ అధిక్షేప కావ్యములు రచించలేదు కాని చాటుపద్యములు మాత్రము లభించుచున్నవి. ఇవియే వారికిగల శక్తిని చాటుచున్నవి. అధిక్షేప రచనలకు చక్కని పునాదులు వేసినవి శ్రీనాథుని చాటువులు-పోషకప్రభువులు-అధికారులు-విభిన్నరంగములకు చెందిన వ్యక్తులు-కవిపండితులుఆప్తులు మున్నగు వారిని గూర్చి కవులు ఆశువుగా చెప్పిన పద్యములలో నిరసన దృష్టిగల పద్యము లన్నియు అధిక్షేప ప్రధానములగు చాటువులే నాటినుండి నేటివరకును చాటు పద్యముల రూపమున అధిక్షేప రచనలు వెలువడుచునే ఉన్నవి ప్రాచీన కవి పండితులు రచించిన ఇట్టి చాటువులు చాటుపద్య మణిమంజరి, చాటుపద్య రత్నాకరముల రూపమున సంకలన మొనర్చబడినవి. గ్రంథములందెక్కని చాటువులును కొన్ని కలవు.

అధిక్షేప ప్రధానములైన కావ్యములలో ప్రప్రథముగ పేర్కొనదగినది కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపము - నీలాద్రి రాజునకును జగ్గకవికినిగల సంబంధము - చంద్రరేఖావిలాప కావ్య రచనకు గల పూర్వ రంగము - జగ్గకవి చంద్రరేఖా విలాపమను దూషణ కావ్యమున కుద్యమించిన కథ సాహితీ లోకమున సుప్రసిద్ధము - ఒక విధముగ పరిశీలించినచో చంద్రరేఖావిలాపము ప్రబంధ ప్రక్రియకే "పేరడీ" వంటిది. ఈ శాఖకు చెందిన కావ్యములలో రావణదమ్మీయము - మధురమంగాపుంశ్చలీ విలాసము - ప్రత్యేకముగ పేర్కొనదగినవి. ఇవి అన్నియు ఆయా కవులు వ్యక్తిగతముగ అనుభవించిన పరాభవము కారణముగ అవతరించిన కావ్యములు - ద్వేషపూర్వకములు - వ్యక్తి పట్ల కవులు తమ హృదయమున గల క్రోధద్వేషములను, అక్కసును వ్యక్తీకరించిన రచనలివి. కవులు తమకు అపకార మొనర్చిన వ్యక్తులను పేర్కొని వారిని సూటిగ ప్రత్యక్షముగ దూషించిన కావ్యములు దూషణ కావ్యములుగ పరిగణింపబడు చున్నవి కాని స్వభావము ననుసరించి అధిక్షేపాత్మకములే-వ్యక్తులను పేర్కొనక వారిలోని దుర్గుణములను నిరసించిన సందర్భములు కొన్ని కలవు. ఔదార్య దానగుణశూన్యులైన వ్యక్తులు-కవిపండితులను పోషించని అరసిక ప్రభువులు- అధికారులు మున్నగువారి నుద్దేశించి రచింపబడిన పద్యము లిట్టివి. ఆయా వ్యక్తుల నామములను పేర్కొని వారి దుశ్చర్యల నే కారణముచేతనో బహిరంగ పరచక పరోక్షముగ వారి దుర్నీతిని సామాన్యీకరించి అన్యాపదేశముగ వివరిం చిన సందర్భములు కూడ కొన్ని కలవు.

వ్యక్తుల చిత్తవృత్తినే కాక సమకాల వ్యవస్థను, సమస్యలను వస్తువుగా గ్రహించి ప్రత్యేకముగ చాటు పద్యముల నెందరో రచించిరి- అధిక్షేప ప్రధాన ములైన ఈ చాటు పద్యములు వారి భావములను వ్యక్తీకరించుటకు సాధనము లైనవి. తెలుగులో ఇట్టి రచనకు రాజమార్గమును వేసినవాడు శ్రీనాథమహాకవి. తన దృష్టికి వచ్చిన ప్రతి అంశమును గూర్చి ఈ కవి చాటువులలో ప్రస్తావించుట గమనింపదగినది. ఇవి అధిక్షేప రచనలకు మకుటాయమానములు-అధిక్షేపమును విస్తృత పరిధితో ఉపయోగించిన ఆంధ్రకవులలో ఈతడే ప్రథముడు - ప్రముఖుడు కూడ. విద్వత్కవితారంగము- వాగ్వివాద ప్రౌఢిమ-సాంఘిక వ్యవస్థ లోని వివిధాంశములు-వ్యక్తుల మనస్తత్వము - వైయక్తిక అభిప్రాయము

లీతని కవితకు వస్తువు-వీనిని నిశ్చయముగా స్వేచ్ఛగా వ్యక్తీకరించిన వారిలో శ్రీనాథుడే ప్రముఖుడు. అనంతర కాలమునందలి పండితులు కవులు ఈతని మార్గమునే అనుసరించి ఆశువుగా అధిక్షేప ప్రధానములైన రచనలకు పూను కొనిరి.

లోకములోని వివిధాంశములను నిత్య జీవితములోని అంశములను స్వానుభవ దృష్టితో నిశితదృష్టితో సమగ్రముగ పరిశీలించి విభిన్న ధోరణు లలో వ్యక్తీకరించుటకు శతక ప్రక్రియను వాహికగా స్వీకరించినవారు అధిక్షేప శతకకర్తలు. కొన్ని చాటువులు ముక్తకముల రూపమున నున్నవి. శతక పద్యములు కూడ ముక్తకములే. అధిక్షేప చాటువుల మార్గము ననుసరించి అధిక్షేప శతక ములు కూడ వెలువడినవి.

అధిక్షేప శతక రచనకు బీజము భక్తి నీతి శతకములందే కనిపించును. భక్తి శతక కవులు నైతికోన్నతిని ముక్తిని సాధించుట కుపదేశించిన సందర్భ మున భక్తి స్వరూపమును కూడ నిర్దేశించిరి- దీనిలో నిశ్చల భక్తి చిత్తశుద్ధితో పూర్ణమైనది. బాహ్యాచార ప్రధానమైనది అన్యము-దాన ధర్మములు, వ్రతములు, పుణ్యకార్యములు, యజ్ఞయాగాదులు, తీర్థయాత్రలు, జపతపములు మున్నగువానిని ఆచరించినంత మాత్రమున ముక్తి లభించదనియు ఉపదేశించి, సాధకునకు నిశ్చల భక్తి, భగవంతుని యందు పరిపూర్ణమైన భక్తి అవసరమని శతక కవులు స్పష్టమొనర్చిరి. చిత్తశుద్ధిలేని శివపూజలను వారు నిరసించిరి. పవన పర్ణాంబు భక్షణమే ముక్తి సాధనమగుచో ఆకులెల్ల మెక్కెడు మేకకు, వాయుభక్షణ మొనర్చు సర్పమునకు, జలపానమొనర్చి మాత్రమే జీవించు క్రిమికీటకాదులకు, లభించునా ? అని సూటిగా వారు ప్రశ్నించిరి. ఇవి అన్నియు నిరసన, అధిక్షేపరూపమున వ్యక్తీకరింపబడినవి.

కొందరు శతక కర్తలు కేవలము ఒకటి రెండు అంశములు మాత్రమే అనగా భక్తి, సజ్జన లక్షణములను మాత్రమే ప్రస్తావించిరి. వారి అధిక్షేప ధోరణి దీనికి మాత్రమే పరిమితమై యుండెను. కొందరి సందర్భమున దుర్జన లక్షణములను కలియుగ ధర్మములను నిరసించిరి-భక్తి నీతి శతకములలో క్రమక్రమముగ లోకమునందలి విభిన్నములైన ధోరణులను నిరసించు విధా

నము అధికమైనది-ఇదియే అధిక్షేప రచనకు పూర్వరంగమై మార్గము నేర్పరి చినది. కేవలము భక్తి ప్రధానములుగను, నీతి ప్రధానములుగను రచింపబడిన శతకములలో భక్తి నీతితో పాటు అధిక్షేపములకు సంబంధించిన అంశములు కూడ చేరినవి.

అధిక్షేప శతక కర్తలలో ప్రముఖులుగా నున్నవారు కూచిమంచి కవులు- వీరి శతకములలో భక్తి నీతి అధిక్షేపాంశములు మిశ్రమ రూపమున కనిపించును అధిక్షేప శతక వైఖరి వీరి శతకములలో ప్రస్ఫుటముగా నున్నది. అధిక్షేపమును శతక రూపమున సంతరించిన కీర్తి కూచిమంచి తిమ్మకవికే లభించినది కూచిమంచి కవుల అధిక్షేప రచనలకు వైయక్తిక ద్వేషభావము ప్రాతిపదిక యైనది. శ్రీనాథాదులలో బీజప్రాయమున కనిపించు ఈ గుణము కూచిమంచి కవుల రచనలలో ఒక్కుమ్మడిగా విజృంభించి వ్యక్తిదూషణపరమైన కావ్య రచనకు దోహద మొసగినది. జగ్గకవి చంద్రరేఖావిలాప కావ్యములో తనకు అపకార మొనర్చిన వ్యక్తిని పేర్కొని దూషించెను. కాని శతకమునందెచటను వ్యక్తి దూషణము లేదు కాని కొన్ని అంశములను వివరించునపుడు ఆయా వ్యక్తులు కవుల మనోరంగమున స్ఫురించి యుందురు వారి దుర్వృత్తుల సామాన్యీకరించి రచించుటలో కూచిమంచి కవుల శతకములకు విశిష్ట స్థానమేర్పడినది. అధిక్షేపమున సాంఘికమైన వస్తువు నెన్నుకొనుటలో కూచిమంచి కవులకే అగ్రతాంబూలము లభించుచున్నది. వ్యక్తిగతమైన అధిక్షేపధోరణి సామాజిక రూపము నొందినది. అది క్రమముగా సాంఘిక వ్యవసాయి అయినది ఇది అత్యంత ప్రౌఢ కవితారీతిలో సాగుట ప్రత్యేకముగ గమనింపదగినది. వ్యక్తులను పేర్కొనక వ్యక్తుల దుష్ట స్వభావమును నిర్భయముగ చాటినప్పటికిని వీరు భక్తి శతకముల ధోరణిని విడువలేదు. తమ అనుభూతికి వచ్చిన విశేషములను, చూచిన అంశములను నివేదించుకొనుటకు ఇష్టదైవము నాలంబనముగా గ్రహించినారు-దైవమును స్వేచ్ఛగా, అరమరికలు లేక, ఆత్మనివేదనముగా భావించిన ధోరణి యిది - భక్త భక్తపుంజాత కుక్కుటేశ్వర శతకము ఈ మార్గమున రచింపబడినది ఈ ముద్ర అనంతర కవులపైనను అధునిక కవులపైనను ప్రసరించును విశ్వనాథ వారి మధ్యాక్కరలు, వివిధ దైవముల నుద్దేశించి వ్రాయబడినవి.

తెలుగులో మొదటి అధిక్షేప శతకమేది అని ప్రశ్నించిన వారికి కుక్కుటేశ్వర శతకమే అని సమాధానము. బీజప్రాయముగనున్న ఇదియే వేమన పద్యములలో విస్తృత ప్రాతిపదిక నొందినది. వేమన ప్రజాకవి - బహుముఖ లోకానుభవనిధి - తన దృష్టికి వచ్చిన ప్రతి అంశమును గూర్చి ఆశువుగా అప్పటికప్పుడే ప్రస్తావించినాడు అతని మాటలో నుడికారములో అధిక్షేపము నానా విధములుగ రూపొందినది. ప్రబంధ కావ్యముల స్వర్ణపంజరము నుండి తెలుగు చిలుకను విడిపించి స్వచ్ఛముగా, అతి మధురముగా ముద్దులు మూట కట్టు జిలిబిలి పలుకులు పలికించినది వేమనవాణి - ఎటువంటి నిర్బంధములు కట్టుబాట్లు లేక ఆతని భాష సజీవ స్రవంతివలె తెలుగు పొలమున పారి బంగారు పంటల పండించినది. ఆ రాశిలోనే ముత్యాలవంటివి అధిక్షేపాత్మక పద్యములు సహజ కవితాశైలిని సంతరించుకొనినవి—

భక్తి నీతి శృంగారము తత్త్వము, విభిన్న సాంఘిక సమస్యలు-ఆశయాలు మున్నగు వానిలో దేనిని ప్రస్తావించినను అధిక్షేపము చిత్రవిచిత్ర గతులలో సాగినట్లు స్పష్టమగును. అది సమకాలిక కవులనే కాక అనంతరయుగ కవులను ప్రభావిత మొనర్చినది. నేటివరకు ఆ ముద్ర కొనసాగుచున్నది. తెలుగులో అధిక్షేప హాస్యములకు సమగ్ర విశిష్ట స్వరూపమును సంతరించిన దాతని లేఖినియే. వేమన వేలకొలది పద్యములలో ఈ లక్షణము సువ్యక్తమగుచున్నది. ఇది అంతయు ఆత్మసంబంధిపరముగా సాగుట గమనింపదగిన విశేషము.

దానికి వన్నెచిన్నెలు కూర్చి మరింత పుష్టిని కలిగించినవారు కవిచౌడప్ప, అడిదము సూరకవి మొదలగు శతకకర్తలు. వీరి మార్గములు మరింత విశిష్టములైనవి-నగ్న సత్యమును నగ్నముగా చూపుటలో కవిచౌడప్పకు సాటి రాగలవారు కొందరు మాత్రమే. సాంఘిక వస్తువును వస్తువుగా స్వీకరించినను కవులు కొందరు సజ్జనదుర్జనలక్షణములను వ్యక్తులచిత్తవృత్తులను నిశితదృష్టితో పరిశీలించి అధిక్షేప ధోరణిలో వివరించుట ప్రధానముగా గమనింపదగినది. కవిచౌడప్ప బూతులలో నీతులు చొప్పించి విలక్షణ మార్గము ననుసరించెను. అశ్లీల పద ప్రయోగములతోపాటు సామాన్య పదములవలన అశ్లీల భావములను వ్యక్తీకరించుట ఈయన పద్ధతి. హాస్యము వీనికి ఈడుజోడై నిలిచినది. చమత్కారము అన్నిం

టికి సమగ్ర రూపము నొసగినది-చమత్కారములను నుడికారములలో చక్కగా పొదిగి అల్పాక్షరములలో అనల్పార్థము నిమిడ్చి ఛందస్సున కందచందాలు కూర్చి కంద పద్యమును కదనుతొక్కించిన కవితాశిల్పి కవిచౌడప్ప. ఈయన శైలి అధిక్షేపమునకు సరిక్రొత్త రూపము సంతరింపజేసినది.

కూచిమంచి తిమ్మకవి వేమనలవలె విస్తృత వస్తువును గ్రహించి సాంఘిక రంగములోని అన్ని అంశములను నిశిత దృష్టితో పరిశీలించిన కీర్తి అడిదము సూరకవికి లభించుచున్నది. భీమకవివలె శాపానుగ్రహ శక్తియుక్తు డీతడు. తనకు తోచిన భావములను అభిప్రాయములను ఇష్ట దైవమగు రామలింగేశ్వరుని పేర వ్యక్తీకరించినాడు విద్యలు- విద్వత్పోషణము-కవులు-రసిక ప్రభువుల కర్తవ్యము-దానగుణవిహీనులైన అరసిక ప్రభువులు అల్పప్రభువులు సంఘములోని అస్తవ్యస్తస్థితి-మానవుల చిత్తవృత్తి ఈ కవికి కవితా వస్తువుగా ఉపకరించినది- వస్తువుఒకటియే యైనను వ్యక్తీకరణ విధానమున అందరును తమ తమరచనా శిల్పముతో వైశిష్ట్యమును చూపిరి. వ్యక్తులను పేర్కొనక వారి దుర్గుణములను సామాన్యీకరించి అధిక్షేప శతకములు వ్రాసినవారి సంఖ్య బహుళము - వ్యక్తిని దూషించి వ్రాసిన అధిక్షేప శతకములు రెండు మూడు మాత్రమే కలవు. అవి ఒక విధముగా అధిక్షేప రచనలే అయినను వ్యక్తి దూషణ ప్రధానములైనవి. తెలుగులో విక్కిరాల రంగాచార్యుల శార్దూల శతక మిట్టిది. ఇటువంటి శతకములు తెలుగులో అనేకముగా లేవు.

పదునేడవ శతాబ్ది ఆరంభమునుండి అధిక్షేప శతకములకు నూతనసాంఘిక వ్యవస్థ-మానవుని నైతికస్థాయి, వ్యక్తుల చిత్తవృత్తులు అధికారుల తత్త్వము మున్నగు అంశములు ప్రధాన వస్తువైనది. కవిచౌడప్ప బూతు మార్గము నింకను రెండడుగులు పొడిగించి శతక కవులు కొందరు జుగుప్సాకరముగ నొనర్చిరి. ఈ యుగమున శృంగార రసాత్మకములగు కావ్య, శతకములందు అసభ్యవర్ణన లధికముగా చోటు చేసికొన్నవి. రతిక్రీడలను, రతిబంధములను, స్త్రీ పురుషశరీరాంగములను వర్ణించుట ఈ కవులకు పరిపాటియైనది. అధిక్షేప శతకములలో బూతు ప్రాత్మక వర్ణనలధోరణి వ్యక్తిగతమైన అక్కసును ద్వేషమును వెళ్ళగక్కుటకు తోడ్పడినది.

పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దములలో వెలువడిన శతకముల ధోరణి కొంతవరకు మారినది. పోలిపెద్ది వేంకటరాయకవి వేణుగోపాల శతకమున లుబ్ధులు-అల్పులు-అధికారులు మున్నగువారికి సంబంధించిన అంశములను వివరించుపట్ల ఉపయోగించిన ఉపమానములు జుగుప్సను రోతను గలిగించునట్టివిగా నున్నవి. పశువుల మర్మాంగముల నుపమానములుగ గ్రహించుట ఇట్టిది. లుబ్ధులు మొదలగు వారిని దూషించుపట్ల ద్వేషభావ మింతటి విపరీత స్థితికి దిగజారినది. అశ్లీలముగ వర్ణించుటలో వీరు కవిచౌడప్పను మించిపోయిరి.

అధిక్షేప శతక కర్తలు సంఘములో మార్పునొందిన పరిస్థితులను సమీక్షించినపుడు కొన్ని అంశములను యథాతథముగ చిత్రించుటతో తృప్తినొందిరి. మరి కొన్నింటికి కారణముల నూహించి వివరించి చారిత్రక సాంఘిక పరిణామములను విస్మరించి వారు కేవలము ధార్మికదృక్పథమునే బలపఱిచిరి. కలియుగ ధర్మముల ప్రసక్తి ఇట్టిది. వర్ణాశ్రమాచారములు- వర్ణసాంకర్యము నైతికపతనావస్థ — అల్పుల ప్రాభవస్థితి — మున్నగునవి కలియుగ జన్యములని వారు స్పష్టముగ చాటిరి.

ఈ శతక కవులు తమకు సంబంధించిన కవితా రంగమును విస్మరించలేదు. కవి కవిత్వము కృతి కర్తృత్వము రాజపోషణము విద్వత్సభలు-పండిత ప్రాగల్భ్యము - వివిధ విద్యల స్థితిగతులు - కుకవి, సామాన్యులు అల్పులు కవితా రంగమునేలుట మొదలగు అంశములను వీరు సరసముగ చిత్రించిరి. వేదవిద్యలు పురాణాదుల ప్రాభవము సన్నగిల్లిన స్థితికి, కవితాస్థాయి దిగజారిన స్థితికి, ఈ కవులు తమ ఆవేదనను వ్యక్తీకరించుటలో అధిక్షేపధోరణి సుస్పష్టముగా గోచరించును. అసమర్థులైన వారు కవితా రంగమున ప్రవేశించి సామాన్య కృతులను రచించి అరసిక ప్రభువుల నాశ్రయించి విఱ్ఱవీగిన స్థితిగతులను వీరు నిశితముగ విమర్శించిరి. పాశ్చాత్య నాగరికతను సంస్కృతిని అనుకరించిన యుగమిది. అధిక్షేప శతక కర్తలు పరంపరగా వస్తువు ననుకరించక సమకాలిక వ్యవస్థలోని అన్ని అంశములను పరిశీలించిరి, పాశ్చాత్య నాగరికత తెలుగు దేశముపై తెలుగువారిపై వేసిన ముద్రను వీరు తమ కావ్యములలో స్పష్టముగా చూపిరి. తమకు నచ్చని వానిని విదేశీయ నాగరికతా వ్యామోహమును

వారి ఆచారవ్యవహారములను వీరు నిశితముగ ఖండించిరి. ఈ విధానమును అధునిక అధిక్షేప శతక కర్తలు కూడ అనుసరించిరి. గువ్వలచెన్న శతకము నందీ అంశము ప్రస్ఫుటముగా నున్నది.

అధిక్షేప శతకకర్తల భావవ్యక్తీకరణ విధానము, భాష, శైలి మున్నగునవి ప్రత్యేకముగ పరిశీలింపదగినవి. మహా కావ్య ప్రబంధాదుల శైలి కవి పండితుల నాకర్షించుచుండ మరికొందరు సామాన్య పాఠకులకు, ప్రజలకు సన్నిహితముగా నుండు సజీవ భాషలో శైలిలో రచనకు పూనుకొనుటకు ప్రయత్నించిరి. వీరిలో శతక కవుల పాత్ర గమనింపదగినది. పండిత కవులుగా రాణించిన వారు శతకములను రచించునపుడును కావ్య ప్రబంధాదుల జటిలశైలిని పాటించిరి. కూచిమంచి సోదరకవుల శతకము లిట్టివి. వేమనాదులు సమాజశైలికో రచన లొనర్చిరి. అధిక్షేప శతక కర్తల భాష శైలి పరిశీలించినపుడు ఈ దృష్టి కొందరిలో నున్నట్లు కనిపించును. శతక వస్తువు సాంఘిక వ్యవస్థకు సంబంధించినది. కనుక దానిని వ్యక్తీకరించునపుడు వారు సామాన్యభాషనే ప్రయోగించిరి. శైలిలో విభిన్నమార్గములు గోచరించుచున్నవి. కొందరు సామాన్య భాషలో సామాన్య ధోరణిలో సూటిగా సుపరిచితమైన అలంకార సామగ్రితో రచన సాగించిరి. మరికొందరు కల్పనలకు, అన్యాపదేశాది అలంకారములకు, ఉక్తి వైచిత్ర్యమునకు ప్రౌఢరీతికి ప్రాధాన్యము నొసగిరి. మరికొందరు కావ్యస్థాయికి తగినట్లుగా సుడికారములను పదబంధములను సూక్తులను ప్రయోగించిరి. కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి, పోలిపెద్ది వేంకటరాయ కవి, వేమన, కవిచౌడప్పలలో ఈ ధోరణులు స్పష్టముగా నున్నవి. కొందరు రచనా శిల్పమును ఛందఃశిల్పమును చక్కగా పాటించిరి. కూచిమంచి కవులు వృత్తములలో సీసపద్యములో రచన గావించ కవిచౌడప్ప కందపద్యము లందే అధిక్షేప శతకమును రచించెను. వేమన ఆటవెలదిని గ్రహించిన అంశము జగత్ప్రసిద్ధము. ఈ యుగములందు గల అధిక్షేప శతక కర్తలు బహుళముగ సీసపద్యములనే గ్రహించిరి. విస్తృతపరిచి భావమును విపులముగా వర్ణించుటకీ పద్యములు చక్కగా తోడ్పడినవి. సీసపద్యము నాలుగు పాదములలోను, ఎత్తుగీతిలోను భావములను నానా విధములుగ వ్యక్తీకరించుటకు, సీసపద్యము లందు ఒక విధమైన తూగును పాటించుటకు వీరికి అవకాశము లభించినది.

వస్తువునందును వ్యక్తీకరణ విధానమునందును గల విభిన్న ధోరణులకు ప్రతిబింబము లన దగిన అధిక్షేప శతకములను ఒక సంపుటముగా వెలువరించుటకు చేసిన ప్రయత్న మిది. పందొమ్మిదవ శతాబ్దినాటికి వెలువడిన శతకములకు మాత్రమే పరిమితిని విధించుకొని ఈ సంపుటమున ఆరు శతకములు మాత్రమ గ్రహింపబడినవి. వీనిని చూడగనే అధిక్షేప శతకములకు రాచబాటలు తీర్చిన కుక్కుటేశ్వర రామలింగేశ శతకములు దీనిలో లేని లోపము ప్రస్ఫుటముగా కనిపించును. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఈ శతకముల నింతకు ముందె కొన్ని శతక సంపుటములలో చేర్చి ప్రకటించినారు. ఈ కారణమున వీనిని నేను ఈ శతక సంపుటిలో మరల చేరుటకు సందేహించితిని. అధిక్షేప శతకముల ప్రసక్తి వచ్చినపుడు వేమన పద్యములను విస్మరించుట కష్టమే. సహస్రాధిక సంఖ్యగల ఆతని పద్యములను పరిశీలించి ప్రత్యేకముగ అధిక్షేపాత్మకములగు పద్యములను కూర్చుట శ్రమసాధ్యమైన పని. పరిమిత శతకములతో కూడిన ఈ శతక సంపుటిలో వేమన పద్యములను కొన్నింటిని మాత్రమే చేర్చుట ఆతనికి అన్యాయము చేసినట్లే అగును—ఆతని పద్యములలో అధిక్షేపము జీవగుణము. అది నానా రీతులలో సాగినది. శృంగార, నీతి, భక్తి, తత్త్వ, సాంఘికాంశములను గూర్చిన పద్యములలో అధిక్షేపధర్మము ప్రస్ఫుటముగా నున్నది. ప్రత్యేకముగ విడిగా వేయదగిన పద్యములివి. ఈ దృష్టితో వేమన పద్యములను సంకలన మొనర్చి ఇందులో చేర్చలేదు.

వ్యక్తిని దూషించి వ్రాసిన అధిక్షేప శతకములు దూషణాత్మక శతకములుగ పరిగణింపబడినవి. అధిక్షేపము దానితో ఒక అంశము మాత్రమే. తక్కిన అంశములకు ప్రాతినిధ్యము వహించిన ఆరు మాత్రమే ఈ సంపుటము నకై గ్రహింపబడినవి. పందొమ్మిదవ శతాబ్దినుండి నేటివఱకును ఇంకను ఎన్నియో శతకములు అధిక్షేప ప్రధానములైనవి వెలువడినవి. తెలుగులో వెలువడిన అధిక్షేప శతకముల నన్నింటిని రెండు మూడు సంపుటములలో సంకలన మొనర్చవచ్చును. అట్టి ప్రయత్నమునకు ఈ సంకలనము ఏమాత్రము మార్గదర్శకమైనను నా కృషి ఫలించినదని భావింతును.

అధిక్షేప శతకముల ఆవిర్భావము వికాసదశల సంగ్రహరూపమిది. ఇక ఈ ఆరు శతకములకు సంబంధించిన పీఠికలను గూర్చి ఒకటి రెండు మాటలు- ఈ సంపుటములో చేర్చబడిన శతకములకు మూడు నాల్గు పుటలలో పీఠిక సంతరింపబడినది. కవి, దేశకాలాదులతోపాటు శతకములోని విశిష్ట గుణము లొకటి రెండు మాత్రమే స్థాలీపులాకన్యాయమున వివరింపబడినవి. శతకములకు పరిచయ మాత్రముగ వ్రాసిన మాటలే కాని శతక సమీక్షలు కావు.

ఇటువంటి సదవకాశమును కలిగించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, అందును ప్రత్యేకముగ, కార్యదర్శి బాధ్యతలను నిర్వహించుచున్న డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుచు ఈ సంకలన గ్రంథమును వారి పక్షాన సాహిత్య లోకమున కందించుచున్నాను.

కే. గోపాలకృష్ణారావు.

# కూచిమంచి తిమ్మకవి - భర్గశతకము

కూచిమంచి వారిది విద్వత్కుటుంబము. వారిలో పండిత కవులుగ సత్కావ్య కర్తలుగ ప్రశస్తి వహించిన వారిలో కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి అనువారు సుప్రసిద్ధులు. పాండితీ వైభవము - అనర్గళ కవితాధార మూర్తీభవించినవారు వీరు. కూచిమంచి తిమ్మకవి కౌండిన్యస గోత్రుడు. గంగమంత్రి సుతుడు. కుక్కుటేశ్వర కారుణ్యకటాక్ష కవితా సామ్రాజ్య ధౌరేయుఁడు. దెందులూరి లింగన సద్గురుని శిష్యుడు-ఈతడశేష కవితావిలాస భాసురుడనియు, నవీన శబ్ద శాసనాభిధానుడనియు జగ్గకవి ప్రస్తుతించెను. నీలాద్రి మాధవరాయ నృపతిచే తిమ్మకవి కవిసార్వభౌమ బిరుదము నొందెను. క్రీ.శ. 1700-1760 మధ్యకాలమున జీవించెనని శతక వాఙ్మయ చరిత్రకారుల అభిప్రాయము- రుక్మిణీ పరిణయము - సారంగధర చరిత్ర - రసికజన మనోభిరామము - నీలాసుందరీ పరిణయము - అచ్చతెనుగు రామాయణము అను కావ్యములను కొన్ని శతకములను రచించెను. ఈ కవి రచించిన శతకములలో భర్గ కుక్కుటేశ్వర శతకములు ప్రసిద్ధి నొందినవి. బహుళ ప్రబంధ నిర్మాతగ విద్వత్కవిగ ఈతడు శ్రీనాథాదులను, స్వతంత్రప్రవృత్తిలో పోతనాదులను స్మరింపజేయును. ప్రభువుల ఆదరాభిమానములకు పాత్రుడై, వారిచే సన్మానముల నొందియు వారికి కృతు లంకితమొసగక, పిఠాపురము నందలి కుక్కుటేశ్వరస్వామి పేరనే తన కావ్యములను రచించెను. మానవ మాత్రులకు కావ్యమొసగి తుచ్ఛభోగముల నాసించక వారొసగు ఘనవిభవములన్నియు నస్థిరములని తిమ్మకవి తలచెను. కుక్కుటేశ్వరు నుద్దేశించి వ్రాసినదే కుక్కుటేశ్వర శతకము. ఈ శతక రచనకు ముందే దాదాపు క్రీ.శ. 17౪9 లో తిమ్మకవి భర్గశతకమును రచించెను.

భర్గశతకము భక్తి నీతి అధిక్షేప ప్రధానమైనది. భక్తి ప్రధానమైన పద్యములలో భక్తి శతక సామాన్య లక్షణములు, భగవన్నామ స్తుతిసంకీర్తనాదులు, గుణకీర్తనము-పరమేశ్వర లీలాభివర్ణనము - భక్తప్రశంస - ఆత్మనివేదనము మున్నగునవి కలవు. ఈ పద్యములందే కొన్నిట నీతి అధిక్షేప

విధానము కనపించును. నిశ్చలభక్తి, కపటభక్తి, విగ్రహారాధనము, తీర్థక్షేత్ర సందర్శనాదులు - గృహస్థ ధర్మములు - మూఢాల ప్రవృత్తి - అరసిక పభువుల దుర్వర్తనము - లోభి జననింద - మున్నగునవి ఇట్టివి.

సామాన్య నీతుల నుపదేశించు సందర్భములందును తిమ్మకవి ఒక్కొక సారి అధిక్షేప ధోరణిని అవలంబించెను. కొన్ని అంశములను నిరసించిన సందర్భములం దీ కవి లేఖిని సునిశితమై శక్తిమంతమై సాగినది. ఈ కవి విమర్శన విధానము కూడ బహుముఖమైనది. అవి వివిధ రీతులలో ఉక్తివైచిత్ర్యమును, సరసాలంకారములను సంతరించుకొన్నవి.

నిశ్చలభక్తి లేక పవన పర్ణాంబు భక్షుల మునివృత్తి నవలంబించువారిని 'ఆకులెక్కదె మేక" అని అన్యాపదేశముగ విమర్శించెను. ఆ యుగమున నితర కవులొనర్చిన ప్రభుదూషణముకంటె తిమ్మకవి విధానము భిన్నమైనది. పరకామినీ పరధన ప్రేమాతిరేకముతోపాటు నృపసేవను తనకు కూరగావలదని తిమ్మకవి పరమేశ్వరు నర్థించెను. పరధనమాన్యాపహరణము - ప్రజాపీడనము - కవిపండిత బుధజన తిరస్కారము - పరాక్రమ శూన్యత - మున్నగు దుర్గుణ ములు మూర్తీభవించిన అల్ప, అవివేక, అరసిక, దుష్ట ప్రభువులను నానావిధ ముగ తూలనాడెను. దుర్మదాహంకారాదులచే మత్తిలి కాయమును పెంచుకొనిన రాజుల నీ యుగకవులు కొందరు నిశితముగ విమర్శించియుండిరి. పరాక్రమ శీలురకే మహాప్రబంధాదు లొప్పును కాని అల్పులకు కాదని ఈ కవి భావించెను. బృహత్కాయము కరికే తగునుకాని ఊరపందులకు తగునా? అని అధిక్షేపించుట వారి నుద్దేశించియే.

తిమ్మకవి కేవలము రాజుల నేకపక్షముగ జేసి దూషించుటతో నూర్కొనలేదు - వారి నాశ్రయించిన కవిపండితుల స్థాయిని కూడ వాస్తవిక దృష్టితో పరిశీ లించెను - కవితా సామ్రాజ్యము నేలువారును మహాప్రబంధ నిర్మాణదక్షు లగు విద్వాంసులు దైన్యముచే రాజుల నాశ్రయించుట తగదని "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్మను'' భర్తృహరి సూక్తి నుదహరించి ఉపదేశించెను. షట్చక్రవర్తుల పటలి జిత్తెడు పొట్టకై దుష్కవటు లగు రాజుల నాశ్రయించి వారి ఆస్థానములలో

చరించి, వారిని కీర్తించి కృతులనొసగుట తగదని హెచ్చరించెను. ఈ సంద ర్భమునందే తిమ్మకవి అపండితులు మరియు కుకవుల దుశ్చర్యలను ఖండించెను. కలియుగ వశమున వివిధ వృత్తులవారును, జాతివారును, కవితారచన కుద్యమించి రనియు, కుకవుల దుర్వర్తనమున కవితలు కాసుకు గంపెడయ్యెననియు నాటి దుర్గతిని తిమ్మకవి బాధాపూర్వకముగ విమర్శించెను.

నాడు లోభ గుణము సర్వసాధారణమైన దుర్గుణముగ వ్యక్తుల నాశ్ర యించినట్లు తోచును. నాటి శతక కర్తలలో పలువురు లోభిజన, లోభగుణ నింద నొనర్చి కవుల నాదరించని ప్రభువులను ధనికులను అధికారవర్గమును విమర్శించి యుండిరి. తిమ్మకవి కూడ వితరణ గుణవిహీనులైన వారిని నిశితముగ విమ ర్శించెను. గృహస్థ ధర్మమును విస్మరించి పరదేశస్థులకు సకాలమున కాతిథ్య మొసగని గృహ యజమానులను ఊరలనాడి వారి గృహము లేటి కొంపలని విచా రించెను.

మత సాంఘిక వ్యవస్థలో అస్పృశ్యతకు సంబంధించిన సమస్యను భంగ్యంతరముగ తిమ్మకవి ప్రస్తావించుట గమనింపతగినది. వర్ణాశ్రమ ధర్మములం దాతనికి ఆసక్తి ఉన్నను సాంఘికాచారములపట్ల తిమ్మకవికిగల విశాల దృక్పథము స్పష్టమగుచున్నది. చండాలాదుల డాసినచో పుణ్యము నశించునని చదువులు పలుకగ, పరమేశ్వరుడు బోయని డాసి ఎంగిలి గ్రహించినందులకు ప్రాయశ్చిత్తమేమి అని ప్రశ్నించుటలో ఈ అంశమే ప్రస్తావింపబడినది.

తిమ్మకవి బహుముఖ ప్రజ్ఞానిధి-లోకజ్ఞుడు-వివిధ నీతుల నుల్లేఖించిన సందర్భము లీ అంశమును నిరూపించును. ఎదురాడు సతి, చెడిన సుతుడు, యజమానికి అపకారముకోరు సేవకుడు, కలహశీలియగు బంధువు, కొమ్ములతో పొడవవచ్చు మొదవు మొదలగు వానివలన గృహస్థుని జీవితము దుర్భరమగు నని తిమ్మకవి ఒక పద్యములో వివరించెను. అనేకాంశముల నొకచో చేర్చి ఉప దేశించిన నీతులు ఈ కవికిగల లోకజ్ఞతను సమయమార్గ పరిజ్ఞానమును వ్యక్తీక రించును.

ప్రౌఢరీతిలో సాగిన మత్తేభశార్దూల వృత్త రచన, తిమ్మకవి పాండిత్యమును విద్వత్కవితా ధోరణిని నిరూపించుచున్నది. భావౌన్నత్య గాభీర్యములకు అనుగుణమైన శైలిని సంతరించుకొనిన దీతని కవిత. సంస్కృత సమాసములను దీర్ఘ జటిలముగ కూర్చక తిమ్మకవి వానిని ప్రసన్నముగను లలితముగను నడిపించెను - పదబంధ లోకోక్తి ప్రయోగ కౌశలమతని శైలికి శక్తిని సంతరింపజేసినవి. మన్నెల్లందమ సొమ్మటంచు-భవదీయ పావన కళావిఖ్యాత కావ్య ప్రక్రియాసామీచీన్య హృదంతరాళ కవిరాట్సంక్రందన శ్రేణికిన్-మున్నగు పద్య భాగము లిట్టివి.

భర్తృహరి సుభాషితత్రిశతి, సౌందర్యలహరి మున్నగు సంస్కృత గ్రంథములలోని భావములను, అన్నమయ, పాలకురికిసోమన, పోతన, ధూర్జటి వంటి ఆంధ్ర కవుల కవితా ధోరణిని అనుసరించిన సందర్భము లీ శతకమునకొన్ని కలవు. ప్రసిద్ధ భక్తినీతి శతకముల లోని శైలిని భావములను అనుకరించునపుడును కవి స్వాతంత్ర్యమును వహించెను. బావపుష్టికి దోహద మొనర్చు నుడికారములు జాతీయము లీ శతకమున కొల్లలు-యమ కానుప్రాసాది శబ్దాలంకారములు, సామెతలు, నూత్నోపమానములు సహజరీతిలో శైలికి భావ వ్యక్తీకరణకు వన్నెచిన్నెలు కూర్చినవి - పేదర్కము వంటి ప్రయోగములు ప్రత్యేకముగ గమనింపదగినవి. ఈ ముద్ర ఈయన సోదరుడగు జగ్గకవిపై కూడ పడినది. ''మేనర్కము'' వంటి ప్రయోగమిట్టిదే.

భర్గ శతక రచన మొనర్చు నపుడే తిమ్మకవికి సమకాలిక వ్యవస్థ నింకను సమగ్రముగ చిత్రించుట అవసరమని తోచినది. భర్గశతకమున బీజప్రాయముగ నున్న అంశమే కుక్కుటేశ్వర శతకమునకు ప్రధానేతివృత్తమైనది. ఈ కారణముచేత కుక్కుటేశ్వర శతకమే బహుళ ప్రచారము నొంది అనంతర శతకములపై ముద్ర వేసినది.

# శ్రీ భర్గ శతకము

శ్రీ కైలాస మహీధర శిరఃశృంగాట కాంచన్మణి
ప్రాకారాంతర చంద్రకాంత రజతప్రాసాద శుద్ధాంత సిం
హాకారోన్నత హేమ పీఠమునఁగొల్వైయుండు నిన్నెన్నెదన్
రాకాచంద్ర నిభప్రభాకలిత! భర్గా! పార్వతీవల్లభా! 1

మ. క్షితినంభోనిధి కర్థ్యమిచ్చుక్రియ భక్తి న్బద్మినీ భర్తకా
రతి యర్పించుతెఱంగున న్బహుతర బ్రహ్మాండ సంత్రాతకున్
శతకంబొక్కటి గూర్చి నీ కొసగెద న్సందర్భార్థిఁగైకొమ్ము వా
క్పతి సంస్తుత్యలసద్గుణాభరణ! భర్గా! పార్వతీవల్లభా! 2

మ. శుక శాండిల్య మృకండు జాత్రి కలశీసూనుల్ భరద్వాజ శౌ
నక వాల్మీకి వసిష్ఠ గర్గభృగు మాండవ్యాజ సంభూత కౌ
శిక కణ్వాది మహర్షిశేఖరులు నిన్ జింతింపఁగాలేరు, కొం
కక నేనెంతటివాఁడ నిన్బొగడ భర్గా! పార్వతీవల్లభా! 3

మ. వరకౌండిన్య సగోత్రపౌత్రుని యశోవర్ధిష్ణునిం గుక్కుటే
శ్వర కారుణ్యకటాక్ష లబ్ధ కవితాసామ్రాజ్య ధౌరేయునిన్
స్థిరపుణ్యుండగు గంగమంత్రి సుతునిన్ దిమ్మప్రధానేంద్రునిన్
గరుణన్బ్రోవుము కూచిమంచికులు భర్గా! పార్వతీవల్లభా! 4

మ. ప్రచురత్వంబుగ నెంతునాత్మనెపుడు న్బ్రత్యూహసంశాంతికై
విచలత్కర్ణ సమీరదూరిత మహా విఘ్నాంబు భృఙ్గాలునిన్
రుచిరాస్యాంబురుహ స్రవన్మదజల ప్రోత్సాహలీలాముహుః
ప్రచురత్పృంగకరుం గణాధిపుని భర్గా! పార్వతీవల్లభా. 5

శా. మేమాఱున్ భవదీయ పావనకళావిఖ్యాత కావ్యక్రియా
సామీచీన్యహృదంతరాళ కవిరాట్సంక్రదన శ్రేణికిన్
సామర్థ్యం బొనగూర్చి మంచినుడువుల్ సంప్రీతి పొందించు వా
గ్భామారత్నము లీలమై నిలిచి భర్గా! పార్వతీవల్లభా! 6

మ. చిరభక్తిన్మదిలో భవద్వ్రతముగాఁజింతింతు నశ్రాంతమున్
బరవాది ప్రమథద్విపేంద్రపదవీ పంచానన శ్రేష్ఠ బం
ధుర తేజోనిధి దెందులూరి కులపాథోరాశిరాకానిశా
కరునిన్ లింగయ సద్గురూత్తముని భర్గా! పార్వతీవల్లభా! 7

మ. పులితోల్ముమ్మొనవాలు పాపతొడవుల్ భూత్యంత రాగంబు పు
న్కలపేర్లెక్కుఁడు కన్ను నీలగళమున్ గంగావతంసంబు క్రొ
న్నెల పూవద్రిసుతా సమన్వయము విన్కల్గంటు లేజింకయున్
గలనీమూర్తిఁదలంతు నెప్పుడును భర్గా! పార్వతీవల్లభా! 8

మ. హర! మృత్యుంజయ! చంద్రశేఖర! విరూపాక్షా! మహాదేవ! శం
కర! భూతేశ! మహేశ! రుద్ర! మృడ! గంగాజూట! గౌరీమనో
హర! సర్వజ్ఞ! బిలేశయాభరణ! శర్వా! నీలకంఠా! శివా!
కరిచర్మాంబర! యంచు నెంతు భర్గా! పార్వతీవల్లభా! 9

మ. జగదీశాయ నమోస్తుతే భగవతె చంద్రావతంసాయ ప
న్నగహారాయ శివాయలోకగురవే నానామరు ద్రూపిణే
నిగమాంత ప్రతిపాదితాయ విలసన్నిర్వాణనాథాయధీ
రగుణాఢ్యాయ యటంచు మ్రొక్కెడుదు భర్గా! పార్వతీవల్లభా! 10

మ. వ్రతముల్ దేవగురు ద్విజార్చ్య పదసేవల్ వైశ్వదేవాది స
త్క్రతుహోమాదులు దానధర్మములు వైరాగ్య ప్రచారంబులా
శ్రితరక్షా విధులంచునే నెఱుఁగ నీ చిత్తంబు నా భాగ్యమే!
గతి రక్షించెదొ కాని నన్నికను భర్గా! పార్వతీ వల్లభా! 11

మ. మరుదర్కేందు కృశాను యజ్వగగనాంభఃకుంభినీమూర్తి నం
బరకేశున్ శరణాగతార్తిహరణున్బాలేందు చూడామణిన్
ధరణీభృత్తనయా స్తనద్వయ మిళత్కస్తూరికాపంకసం
కరదోరంతరు నిన్ భజించెదను భర్గా! పార్వతీవల్లభా! 12

మ. మిహిరప్రోద్భవ ఘోరకింకరసమున్మేషోరగశ్రేణికా
విహగోత్తంస మశేషదోషపటలీ వేదండ కంఠీరవం
బహిత క్రూరగణాటవీహుత వహంబైనట్టి పంచాక్షరం
బహహా! కల్గెను నాకు భాగ్యమున భర్గా! పార్వతీవల్లభా! 13

మ. నృపసేవాపర కామినీ పరధన ప్రేమాతిరేకంబులో
క్కపుడుం గూర్పక తావకీన పదపద్మారాధ నేచ్ఛారతుల్
కృపదైవాఱ నొసంగి భక్తవరుగా నేఁబ్రొద్దునన్బ్రోవుమీ
కపటారాతి నిశాట సంహరణ! భర్గా! పార్వతీవల్లభా! 14

మ. అభవున్ శాశ్వతు నాద్యు నక్షయుని నవ్యక్తుం బరేశున్మహా
ప్రభునాద్యంతవిహీను భూతమయు సర్వజ్ఞునిన్ గుణాతీతుఁబ
ద్మభవాండోదరు నాత్మరూపభవు నద్వంద్వుం జిదానందునిన్
రభసంబొప్పఁదలంతు నిన్నెపుడు భర్గా! పార్వతీవల్లభా! 15

మ. తనరన్నిన్మది నెంతు నెప్పుడును నా దైవంబుగా దాతఁగా
జనకుంగాఁ జెలికానిగా గురువుఁగా సద్బంధుగా నన్నఁగా
ఘన నిక్షేపముగా మహాప్రభునిగాఁగల్యాణ సంధాయిగా
గనకోర్వీధరకార్ముకోల్లసిత భర్గా! పార్వతీవల్లభా! 16

మ. ప్రతి వారంబు శివోహమస్మి యనుచున్భావింతు గంగాధర
స్తుతులెల్లప్పుడుఁజేతు శంకరకథల్ సొంపార నాలింతు నా
యత బుద్ధిన్ జగమెల్ల నీశ్వరమయం బంచు న్విచారింతు నే
గతి రక్షించెదొ కాని నీవు నను భర్గా! పార్వతీవల్లభా! 17

మ. పురుహూతాగ్ని పరేతరాట్పలభు గంభో దీశ వాతార్థ పాం
బర కేశాబ్జ భవాచ్యుతాదిక మహాబర్హిర్ముఖానేక భా
స్వరకాంతస్వర విస్ఫురన్మకుట శాశ్వత్పద్మ రాగప్రభో
త్కర నీరాజితపాద పంకరుహ ! భర్గా ! పార్వతీవల్లభా ! 18

శా. వ్యాకీర్ణాచ్ఛ జటాటవీ తటనితాంతాలంబితోద్యత్తమి
స్రాకాంత ప్రథిత ప్రభాసముదయాక్రాంత ప్రఫుల్లన్మహా
నాకద్వీపవతీ వినిర్మల జలాంతర్భాగ భాగ్దివ్యరే
ఖాకాంతోత్పల కైరవ ప్రకర ! భర్గా ! పార్వతీవల్లభా ! 19

మ. సతతానందితసర్గ ! సర్వసుమనస్సంతుత్యసన్మార్గ! యా
ర్జిత కారుణ్యనిసర్గ ! రాజతధరిత్రీ భృన్మహాదుర్గ ! హృ
త్కృతుకాలింగిత దుర్గ ! సంహృత సమిద్ఘోరద్విషద్వర్గ ! సం
యత నీరంధ్ర సుఖాపవర్గ ! జయ ! భర్గా ! పార్వతీవల్లభా ! 20

మ. పుర రక్షః పటుతూల హవ్యవహ ! విస్ఫూర్జద్దురుక్రూరగో
పరిపంథిక్షణ దాచరోరగ మహాపక్షీంద్ర ! ఘోరాంధకా
సురగంధ ద్విరదేంద్ర పంచముఖ ! యక్షుద్ర ప్రభావోల్లస
త్కరిలేఖద్విషదభ్రగంధవహ ! భర్గా ! పార్వతీవల్లభా ! 21

మ. అమరాహార్యము విల్లుగా ఫణికులాధ్యక్షుండు తన్మౌర్విగాఁ
గమలాధీశుఁడు తూపుగా, నిగమముల్ గంధర్వముల్ నాగ స
ర్వమహీ చక్రముఁదేరుఁజేసి విధి సారథ్యంబు మీఱఁబరా
క్రమలీలన్ బగప్రోళ్ళఁ గూల్చితివి భర్గా ! పార్వతీవల్లభా ! 22

శా, కోటీరాంగద మేఖలాఘనతులా కోటీకవాటీ నట
ద్ఘోటీ హాటకపేటికా ఘటఘటాకోటీ నటాంచోళికా
వీటీ నాటక చేటికాంచలతతుల్ వే చేటులు న్నిన్నిరా
ఘాటప్రౌఢి భజించు ధన్యులకు భర్గా ! పార్వతీవల్లభా ! 23

శా. కంఠేకాలుఁడటంచు నిన్నెపుడు లోకవ్రాత మగ్గింప వై
కుంఠేంద్రాంబుజ సంభవ ప్రముఖులం గోలాహల ప్రక్రియం
గుంఠీభూతులఁజేయు దర్భయద కాకోలంబు హేలాగతిన్
గంఠాగ్రంబునఁబూనినాడవట ! భర్గా ! పార్వతీవల్లభా ! 24

మ. నిను డెందంబునఁ జీరికిం గొనక వాణీనాథ జంభ ద్విష
ద్దను జారి ప్రముఖాఖిలామర తతిన్ దట్టంబుగాఁ గూర్చియా
మున జన్నం బొనరించు దక్షుని దురాత్మున్వీరభద్రోగ్రసం
హననం బూని వధించితౌర ! భళి ! భర్గా ! పార్వతీవల్లభా ! 25

మ. కిరిహంసాకృతులూని వెన్నుఁడును బంకేజాతగర్భుండు నీ
చరణంబుల్ శిరము న్గనందలఁచి నిచ్చల్భోగిలోకంబు, పు
ష్కర మార్గంబునురోసి కానక నిరాశంజెందుచో వారలం
గరుణం బ్రోవవె లింగమూర్తివయి ! భర్గా! పార్వతీవల్లభా ! 26

మ. తరమే యేరికిఁదాపకీన ఘననిత్యశ్రీ విలాస క్రియల్
గరిమన్దెల్పఁగ ? దారుకావనిని లోకఖ్యాతిగా పర్ణివై
పరమానంద రసార్ద్రమానసుడవై పద్మాలు గ్రీడించితే
సస హార స్మనిదాపలం గలసి భర్గా ! పార్వతీవల్లభా ! 27

మ. హరిరన్య స్మృతి దైవమెన్నడును లే డంచున్భుజం బెత్తి ని
ర్భర గర్వోద్ధతిఁగాశికానగరిలోఁబల్మాఱు వాదించుని
ష్ఠురవాగ్ఘోషరతుం బరాశరసుతున్ స్రుక్కింపవే భీమవై
ఖరిదోఃస్తంభన మాచరించి మును భర్గా ! పార్వతీవల్లభా ! 28

మ. ధనదారాతి మృదంగమున్నలువకై తాళంబుగోత్రాహితుం
డెనయన్వేణువు వాణివీణయును వాయింపన్ రమాకాంతనే
ర్పున గానం బొనరింప సంఘతతి వేల్పుల్మెచ్చ నాహాళమై
ఘనతన్ దాండవకేళి సేయుదట ! భర్గా ! పార్వతీవల్లభా ! 29

మ. అజినంబుం వృషఘోటియుం బునుకలు న్హాలాహలంబున్మహా
భుజగంబు ల్శవభస్మముల్గొఱలఁగా భూతాళితో నుండియున్
ద్విజగన్మంగళదాయకాకృతిఁ గడున్ దీపించు టబ్రంబహో
రజనీనాథ కళాశిరోభరణ ! భర్గా ! పార్వతీవల్లభా ! 42

శా. భంజించుంగద ! ఘోరదుష్కృతతతిన్ భస్మత్రిపుండ్రంబులం
న్మంజు శ్రీ లలితాక్షమాలికలఁ బ్రేమంబూని సద్భక్తి నీ
క్కుంజేమోడ్చు మహానుభావు డెపుడుం గుక్షిస్థల ప్రోల్లస
త్కంజాతప్రభవాండ భాండచయ ! భర్గా ! పార్వతీవల్లభా ! 43

శా. శ్రీశైలంబును గుంభఘోణమును గాంచీ స్థానకేదారముల్
కాశీద్వారవతీ ప్రయాగములు నీలక్ష్మాధ రావంతికల్
లేశంబున్ ఫలమీవు నిన్నెపుడు హాళిం గొల్వలేకున్నచో
గాశాకాశధునీఘనాభరణ ! భర్గా ! పార్వతీవల్లభా ! 44

శా. కావేరీ సరయూ మహేంద్ర తనయాగంగా కళిందాత్మజా
రేవావేత్రవతీ సరస్వతుల కర్థింబోవఁగానేల నీ
సేవా సంస్మరణార్చనాదు లెపుడున్ సిద్ధించు సత్త్వాళికిన్
గ్రైవీభూత భుజంగమ ప్రవర ! భర్గా ! పార్వతీవల్లభా ! 45

మ. అరిషడ్వర్గముఁ దోలి సర్వహితులై యష్టాంగ యోగక్రియా
పరులై గాడ్పు జయించి ముద్రవెలయన్ బ్రహ్మంబు వీక్షించి వా
విరి సోహమ్మని యెంచుచుండెడి మహావేదాంతులౌ యోగిపే
ఖరులెల్లన్ మిము గాంచుచుండ్రుగద ! భర్గా ! పార్వతీవల్లభా ! 46

మ. తలపోయన్ దిలజాలకాంతర మహాతైలంబువందాసఁబూ
సలలో దారముపోల్కి నాత్మమయతన్ సర్వాంతర స్థాయివై
విలసత్లీలల నిండియుండుకొను ని న్వీక్షింపఁగా నేర్చువా
రలెధన్యుల్ గద మృజ్జగంబులను ! భర్గా ! పార్వతీవల్లభా ! 47

శా. ఏణాంకు డొకఁడై పయోఘటములందెల్ల న్బహుత్వంబుచే
రాణింబొల్చు తెఱంగునం బృథుతర బ్రహ్మాండ భాండాంతర
ప్రాణిశ్రేణులయందు నీవొకడవే రాణింతువౌ సర్వగీ
ర్వాణస్తుత్యచరిత్ర! యాత్మమయ! భర్గా! పార్వతీవల్లభా! 48

శా॥ ఓంకార ప్రముఖాక్షరోచ్చరణ సంయోగంబు గావేన్మఖా
లంకారార్థము, శబ్దబిందుకళలున్ లక్ష్య ప్రయోగక్రియల్
పొంకంబౌ గురుమార్గముల్ యతిగతిం బో దుష్కృతింబోలిసా
హంకారుండయి ప్రాకృతుండు చెడు భర్గా! పార్వతీవల్లభా! 49

మ॥ అకలంకం బతులం బఖండ బానందకందం బనూ
నక మాద్యంత విహీన మక్షర మనంతం బప్రమేయం బరూ
పక మవ్యక్త మచింత్య మద్వయమునౌ బ్రహ్మంబు నీ వంచుఁగొం
కక లోఁగన్గానువారు బల్లిదులు భర్గా! పార్వతీవల్లభా! 50

శా॥ ఆకుల్ మెక్కదె మేక? చెట్టుకొననొయ్యన్ వ్రేలదె పక్షి? పె
న్గాకుల్ గ్రుంకవె నీట? గాలిఁగొనదే నాగంబు? బల్గొందులన్
ఘూకంబుండదె? కోనలం దిరుగదే క్రోడంబు? నిన్గాంచినన్
గాకిన్నింటను ముక్తిచేకురునె? భర్గా! పార్వతీవల్లభా! 51

మ॥ ధర మృద్దారుశిలామయప్రతిమలన్ దైవంబులంచుం బర
స్పర వాదంబులఁ బోరుచున్ నిబిడ సంసారాంధులై మేలు చే
కుఱకే మగ్గములోని కండెలగతిన్ ఘోరార్తులై ప్రాకృతుల్
కరముం జచ్చుచు బుట్టుచుంద్రు గద! భర్గా! పార్వతీవల్లభా! 52

మ॥ జననీగర్భ మహామహోగ్ర నరకస్థాన వ్యథం గొన్నినా
ళ్ళనయన్ బాల్యకుమారతాదశలఁ గొన్నేడుల్ వధూమీనకే
తన భ్రమ గొన్నినాళ్ళు ఘనవృద్ధప్రాప్తిఁ గొన్నేళ్ళుఁబా
యని దుఃఖంబులఁ బ్రాణి గుందుఁగద భర్గా! పార్వతీవల్లభా! 53

శా॥ కేదారాదిక పుణ్యభూములకు శక్తింబోవఁగారాదు; బల్
పేదర్కింబస దానధర్మ విధులోలిం జేయఁగారాదు గా
కేదేనొక్క తఱిన్ సమస్త భువనాధీశున్ నిసుంగొల్వఁగా
రాదో! కానరుగాక దుర్మతులు భర్గా! పార్వతీవల్లభా! 54

మ॥ తరుణీఘంభ దురోజ కుంభములపై ధమ్మిల్ల బంధంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలములపైఁ గందోయిపై మోముపై
నిరతంబున్ విహరించు చిత్తమెపుడున్ నీయందొకప్డైనిఁ జే
ర్పరుగా మూఢు లదేమి దుష్కృతమొ? భర్గా! పార్వతీవల్లభా! 55

మ॥ మిము నొక్కప్పుడుఁ గొల్వనేరక వృథా మిథ్యా ప్రచారంబులం
గములై వాఁగులయందు నెల్ల మునుఁగంగాఁ బుణ్యముల్సేరునే!
తమి నశ్రాంతము నీట గ్రుంకులిడి యే ధర్మంబు లార్జించెనో
కమఠగ్రాహఝులీ కుళీరములు! భర్గా! పార్వతీవల్లభా. 56

మ॥ హరిదైవంబు; విరించి సర్వభువనాధ్యక్షుండు బృందారకే
శ్వరుఁడాఖ్యండు హుతాశనుండు పతిభాస్వంతుండు వేల్పుంద్రులో
నరయన్నేరరుగా శివాత్పరతరం నాస్తీతి వాక్యార్థమే
కరణిం గోవిములైరొ కాని మఱి! భర్గా! పార్వతీవల్లభా! 57

శా॥ వేయేమాఱు పురాణముల్ సదివిసన్ వేదాంతముల్ గన్నినా
మ్నాయంబుల్ పఠికించిసన్ స్మృతులు వేమాఱుల్ విమర్శించిన
న్నీయందాభ్యత దోఁచుపన్న యదివో! నిక్కంబు భావింపఁగా
గాయత్రీపతివై తనర్చుటను భర్గా! పార్వతీవల్లభా! 58

శా॥ ఆఘంటా పథ పద్ధతిన్ శివశివే త్యాలాప సంశీలులై
రేఖన్సంబులు ద్రోచు పుణ్యతము లుర్విన్ బ్రహ్మహత్యాద్యనే
కాఘౌఘంబులు వాసి తాపకపస ప్రాప్తిన్ విడంబింతురా
ద్రాఘిష్ఠ ప్రభుతానుభోగ్లసన! భర్గా! పార్వతీవల్లభా! 59

మ॥ పృథివిన్ మర్త్యుఁ డొకడ్డు నీశిరముపై బిల్వీదళం బొక్కఁట
త్యధికాహ్లాదముతోడ నిడ్డ యది యాహా! ఘోటకాందోళికా
రథనాగాంబర పుత్రపౌత్ర వనితారత్నాదులై యొప్పుఁబో
ప్రథితాదభ్రసితాభ్ర శుభ్రయశ! భర్గా! పార్వతీవల్లభా! 60

మ॥ మిముసేవించుట చేతఁగాదె చిరలక్ష్మీ సంగతుల్ శౌరికిన్
నముచిద్వేషికి శాశ్వతస్థిత నాకాధిపత్యంబు, వా
గ్గమణీభర్త కశేష సృష్టి రచనా ప్రావీణ్యముల్ గల్గె? నీ
క్రమ మజ్ఞుల్గనలేరుగాని భువి భర్గా! పార్వతీవల్లభా! 61

శా॥ వాణీశాంబుజలోచన ప్రముఖ గీర్వాణార్చితాంఘ్రిద్వయున్
క్షోణీభాగ శతాంగునిన్ గజహరున్ శ్రుత్యంత వేద్యున్ నినున్
బాణాది ప్రమథోత్తముల్ గొలిచి మేల్పట్టూనిరొ సంతత
ప్రాణివ్యూహ మనోంబురుడ్భవన! భర్గా! పార్వతీవల్లభా! 62

శా॥ దారిద్ర్యంబు దొలంగు, మృత్యువెడలున్ దవ్వౌ నఘవ్రాతము
ల్ఘోరవ్యాధులు గండదోషము లడంగున్ జారచోర వ్యథల్
దూరంబౌ, నహితానల గ్రహగణార్తుల్ వీడు నిక్కంబు నీ
కారుణ్యంబొకయింత గల్గునెడ భర్గా! పార్వతీవల్లభా! 63

మ॥ సుత, పద్మాకర, దేవతాగృహ, వనక్షోణీ సురోద్వాహ, స
త్కృతి, నిక్షేపములంచు నెంచ నలువౌ నీ సప్తసంతానముల్
హితవారంగ నొనర్చు పుణ్యమెనయున్ హేలాగతిన్మర్త్యుఁడౌ
కృతజిన్ మిమ్ముఁదలంచెనేని మది భర్గా! పార్వతీవల్లభా! 64

మ॥ అమరం ద్వత్పద పంకజాత యుగళధ్యాన క్రియాశాంత సం
భ్రమలీలన్ విలసిల్లు డెంద మొరులం బ్రార్థింపగా నేర్చు నే
సుమనో నిర్ఝరిణీ సువర్ణకమల స్తోమాసవాలంపట
భ్రమరం బేగునె తుమ్మ కొమ్మలకు భర్గా! పార్వతీవల్లభా! 65

మ॥ ద్విపగంధర్వ విభూషణాంబర వధూవీటీ భటాందోళికా
తపనీదేయామలచేత మత్తిలి బుధేంద్ర శ్రేణిఁబీడింతురౌ
పతన ప్రోద్భవ ఘోరకింకరగదా దండోగ్ర దుఃఖంబులొ
క్కపుడుం దుష్ప్రభు లేల యెంచరొకొ? భర్గా! పార్వతీవల్లభా! 66

మ॥ శివుఁజూడం దగదంద్రుఁడు గొంద అఘముల్ చిత్రంబు తారెన్నఁడు
రవి చంద్రాగ్ని గృహిక్షమాపవనీరవ్యోమముల్ నీస్వరూ
పవిశేషంబు లటంచుఁ దెల్పు వినరో భావింప నమ్మూర్ఖపుం
గవు లెల్లం దధీనతన్ మనరొ! భర్గా! పార్వతీవల్లభా! 67

శా॥ నానా ద్వీప ధరాధురావహన మాన్యస్ఫారబాహాబలా
నూనఖ్యాతి సమేతులైన శశిబిందు క్ష్మాతలేశాదిక
క్ష్మా నాధు ల్చనిపోవుట ల్దెలియరో సత్యంబులా దేహముల్
కానంజాలరు గాక దుర్నృపులు భర్గా! పార్వతీవల్లభా! 68

మ॥ చవిలెల్ కాసులు వీసముల్గొని యధేచ్ఛాలీలం బ్రేలు దు
ష్కవుల న్మెచ్చుచు భవ్యకావ్యఘటనా శాలుల్ ప్రసంగించుచో
నవివేక క్షితి నాయకాధమవరుల్ హాస్యోక్తులం బొల్తురౌ
కవితాసార మెఱుంగకుండుటను భర్గా! పార్వతీవల్లభా! 69

మ॥ చెలులన్ బంధుల విప్రులన్ బ్రజల దాసీ భృత్య మిత్త్రాదులం
గలవిత్తంబులు వృత్తులుం గొనికడున్ గారింతు రధ్యక్షతం
దలపంజాల రదేమొ మీదటికథల్ దర్పాంధకారాంధులై
కలనైనన్ మహిభృద్దురాత్మకులు భర్గా! పార్వతీవల్లభా. 70

శా॥ మన్నెల్లం బనసొమ్ముటంచు వసుధా మర్త్యోత్తమ క్షేత్రముల్
కన్నారంగని యోర్వలేక దిగ్భ్రమింగంజూతు రల్పప్రభుల్
వెన్నప్పంబులతో బూరెలో వడలొ భావింపంగ బొబ్బట్లొకో
యన్నా! యెన్నగ వారి పాలి కవి? భర్గా! పార్వతీవల్లభా! 71

మ॥ ప్రజలంగాఱియబెట్టి యలసర్థం బెప్పుడు న్నించుచున్
ద్విజవిద్వత్కవివందిగాయకుల కే దే నొక్క టీలేక య
క్కజమొప్పం బలుమూలలం దిరుగు భూకాంతాళికిం గీర్తిధ
ర్మజయౌద్ధత్యము లే క్రియంగలుగు? భర్గా! పార్వతీవల్లభా ! 72

శా॥ తేజంబొప్పఁ బురాకృతంబున జగద్ధ్యేయ త్వ దంఘ్రిద్వయీ
పూజా పుణ్యఫలంబునం దమరిటుల్ భూపత్వముం గంటకున్
వ్యాజంబూని కడుంజెడంగవలెనా యాలింపరా యీ నృపుల్
రాజాంతేనరకం ప్రజేత్తనుట? భర్గా! పార్వతీవల్లభా! 73

శా. ఆజిన్ వైరివరూధునీ మథనదీక్షా రూఢిఁ గ్రాలన్ వలెన్
భోజుంబోలి సమస్తయాచక తతిం బోషించుచుండన్ వలెన్
తేజంబెప్పుడునుర్విలోఁ బ్రజకుఁజెందింపన్‌వలెన్ గానిచో
రాజావాడు? తరాజుగాక ! భువి భర్గా ! పార్వతీవల్లభా ! 74

మ. కవి విద్వ ద్ధరణీ సుధాశన పరుల్ కార్యార్థులై యొద్దడా
సివదిం జేతులు దోయిలించుకొని యాశీర్వాదముల్సే య నె
క్కువ దర్పంబున నట్టిటుం బొరలకే కొమ్మ్రింగి నట్లుంద్రుగా
రిపశిం దుర్నృపు లేమి యీగల రొ భర్గా ! పార్వతీవల్లభా! 75

శా. గాజుం బూస యనర్ఘ రత్న మగునా ? కాకంబు రాయంచ యౌ
నా ? జోరీఁగ మధువ్రతేంద్రమగునా ? నక్కైనమ్మ పంచాస్య మౌ
నా ? జిల్లేడు సురావనీజ మగునా ? నానా దిగంతంబులన్
రాజౌనా ఘనలోభి దుర్జనుడు ? భర్గా ? పార్వతీవల్లభా ! 76

శా. కోపంబెక్కువ; తాల్మియిల్ల, పరుషోక్తుల్ పెల్లు, సత్యంబు తీల్
కాపట్యంబు ఘనంబు, లోభము న హంకారంబు చట్టంబు హృ
చ్చాపల్యం బధికంబు, ద్రోహమది విస్తారంబు ఛీ! యిట్టి య
ర్వ్యాపార ప్రభులేరిఁ బ్రోతు రెక భర్గా ! పార్వతీవల్లభా ! 77

శా. హృద్వీధిం గనరుం దిరస్కృతియు బట్టేపార నొక్కప్పుడున్
సద్వాక్యంబును దర్శనం బిడని రాజశ్రేణి కాశింతురా
''విద్వ ద్దండ మ గౌరవం'' బను స్మృతుల్ వీక్షింపరా దుర్నృపా
గ్ర ద్వారంబుల వ్రేలు పండితులు ? భర్గా ! పార్వతీవల్లభా ! 78

మ. అప వర్గంబొన గూడుచో చిర సుఖాహ్లాదంబు చేకూరునో
జప హోమా ధ్యయ నార్చనాదిక మహా షట్కర్మముల్డించి దు
ష్కపటోపాయ విజృంభమాణధరణీ కాంతాధమాగార ని
ష్కపట భ్రాంతి జరింత్రు 'రార్య లిల భర్గా! పార్వతీవల్లభా. 79

మ. అకటా! జిత్తెఁడు పొట్టకై కృపణ మర్త్యాధీ శగేహాంగణా
వకర క్షోణీ రజశ్చటావిరతసం వ్యాప్తాంగులై క్రుంగి నె
మ్మొకముల్ వెల్వెలఁ బాఱ వేలుదు రదేమో యెందు లంబోవ నే
రక ధీమజ్జను లెంత బేలలొకో! భర్గా ! పార్వతీవల్లభా ! 80

మ. అతి లోభిన్ రవి సూనుఁడంచుఁ గపటస్వాంతున్ హరిశ్చంద్ర భూ
పతి యంచున్ మిగులం గురూపిని నవప్రద్యుమ్నుఁ డంచు న్మహా
పతితున్ ధర్మజు డంచు సాధ్వస మతిం బార్థుం డటంచున్బుధుల్
ప్రతివేళన్ వినుతింతు రక్కటను భర్గా! పార్వతీ వల్లభా ! 81

మ. జన సంస్తుత్య మహా ప్రబంధ ఘటనా సామర్థ్యముల్ గల్గు స
జ్జను లత్యల్పుల దీనతం బొగడుదుర్ జాత్యంధతంజెంది కా
కను వొప్పం దమరెన్నఁడో [illegible] సుకవితా యద్యస్తి రాజ్యేనకిం''
మ్మను వాక్యంబు వినంగ లేదో ముసు? భర్గా ! పార్వతీవల్లభా! 82

మ. సుగుణోద్దామ మహా కవీంద్ర ఘటితాక్షుద్ర ప్రబంధావళుల్
జగదుద్దండ పరాక్రమ క్రమ విరాజద్భూమి భృన్మౌళికిన్
దగుఁగా కప్పుడ కొప్పునే! [illegible] కాయమానం[illegible]
పగు గా కొప్పునె యూరఁ [illegible] భర్గా ! పార్వతీవల్లభా! 83

మ. పటులోభాత్మన కెవ్వరైనఁ గడకం బద్యాదు లర్పించినం
గుటిలుండై యవి యెల్ల నిల్పుకొనఁగా గోరండు నిక్కం బహా!
దిట మొప్పారగ నిల్పుకో గలదె ధాత్రిన్ గొంత సేపైన మ
ర్కట పోతం బురురత్న హారములు? భర్గా! పార్వతీవల్లభా! 84

మ. భువిలో మేదర సెట్టి చివ్వ తడకల్ పొంకంబుగా నల్లి పె
న్నవళిన్ సంతల నెల్లఁ ద్రిప్పు క్రియ దైన్యం బెచ్చఁగా దుష్కవుల్
తివుటొప్పం జెడు కబ్బపుం దడక లోలిం ద్రిప్పగా నద్దిరా!
కవితల్ కాసుకు గంపెఁ డయ్యెగద భర్గా! పార్వతీవల్లభా! 85

మ. అవివేక క్షితినాయకాధమ సభా భ్యాస ప్రదేశంబులన్
బవళు ల్లేలును జుట్టఁ బెట్టుకొని దుష్పాండిత్యము ల్చూపు చుం
గవి ముఖ్యుం బొడగాంచి జాఱుదురు వేగం; బుండ విల్గన్నకా
కవు లట్లే నిలఁబోక కా కవులు భర్గా! పార్వతీవల్లభా! 86

మ. భువిలో నిక్కలిదోష హేతుకమునం బొల్పారి గోసంగులున్
బవినాలు న్బలు మోట కాపు దొరలుం బాషండులున్ దాసరుల్
సివ సత్తుల్ నెఱబోయ పెద్దలును దాసేయ ప్రభుల్ దుష్టకా
కవులు న్మీఱి రిఁకేమి చెప్పనగు భర్గా! పార్వతీవల్లభా. 87

మ. కలుముల్నిక్క మటంచు నమ్మి తులవ ల్గర్వాంధులై యెన్నఁడున్
బలి భిక్షంబులు పెట్టకుంద్రు పిదపం బ్రాణంబులంబాసి యా
ఖలులేమౌదురొ, వాండ్రు గూరిచిన రొక్కంబెల్ల నే మౌనొకో
కలుషోద్ఘాతతమస్సహస్రకర! భర్గా! పార్వతీవల్లభా! 88

మ. తులువ ల్పుట్టి భుజింపలేక ధనమెంతో నెమ్మదింగూర్చి మూ
లల దట్టంబుగ బాతుకొన్న నృపతుల్వాలెంబు నిర్మోహులై
పలు చందంబులఁ గట్టికొట్టి మిగుల న్బాధించి రోషించు చుం
గల సొమ్మెల్ల హరించుచుంద్రు గద! భర్గా! పార్వతీవల్లభా! 89

మ. చెనటల్లూర్చు ధనంబు ముచ్చులకు దాసీవార యోషాహుతా
శన దుష్ట క్షితిపాలక ప్రతతికిన్ సంరూఢిఁ జేకూరు గా
కనవద్య ప్రతిభావిభాసిత బుధేంద్రానీకముం జేరునే
కన దుద్దామ పరాక్రమ ప్రథిత! భర్గా పార్వతీవల్లభా! 90

మ. ధరణిన్ సద్గురు చెంత నెందఱు ఖలుల్ దార్కొన్న నచ్చోటికే
కరమర్థిన్ బుధులేగు చుండుదురు నిక్కం బారయన్ గంటకా
వరణోజ్జృంభిత కేతకీవని కళుల్ వాలెంబుగాఁ జేరవే
కరుణాదభ్రప యోనిలయ! భర్గా! పార్వతీవల్లభా! 91

శా. లోకానీకమునందు దుర్గుణులు కల్మల్ గల్గి యున్నప్డు ప
ల్గాకుల్ దార్కొని మెల్ల మెల్లనె దురాలాపంబులం గేరుచుం
గ్గై కొం డెల్లఁ పదార్థముల్ని జ మహాకార్యాఁ తలం గోల్పు చు
న్గాకుల్వేములఁ జేరుచందమున భర్గా! పార్వతీవల్లభా ! 92

మ. చదువు ల్వేద పురాండముల్గ యితలున్నబ్బెండు విద్దెల్ గతల్
మొదలెన్నేనిగ విద్దుమాంసు లదేమో తెల్ప 'గావింటిఁగా
నదిగో చౌలకు మాలదాసరి శటాలై గారి జ్ఞానమ్మలెన్
గదియంజాల వటంచ్రు ముష్కరులు భర్గా! పార్వతీవల్లభా ! 93

శా. హో! హో! బాపడ దోసె డూద లిడిసం బోరేక పేరాసలన్
వావోఁ జాగితి వేమి? నీ సదువు తిర్నామంబులో! సుద్దులో
భూపాళంబులొ లంకస త్తైలో బలా బొల్లాయ్యావు హోట్లాటలో
కా! పాటింప నటంచ్రు బాలిశులు భర్గా! పార్వతీవల్లభా! 94

మ. అదిగో బాఁపన యల్లు భొట్లయకు ముందప్పుయ్యఁ దీర్తంబులో
సదనం ''గిద్దెడు కొట్టి నూకలిడితిన్ అబ్బబ్బ దిర్నామముల్
సదువం జాగిన మాలదాసరియుఁ సంతోసనాల్ సేసిరిం
గద'' యటంచుఁ బలు మోటు లాడుదురు భర్గా! పార్వతీవల్లభా! 95

శా. రాలన్ దైలము తీయవచ్చు భుజగ వ్రాతమ్ముల న్బేర్లఁగా
లీలన్ జూడగ వచ్చు నంబునిధి హేళిం దాటగా వచ్చు దా
కేలన్ బెబ్బులిఁ బట్టవచ్చు విపినాగ్ని న్నిల్పఁగావచ్చు మూ
ర్ఖాళిం దెల్పఁ దరంబె యెవ్వరికిని? భర్గా! పార్వతీవల్లభా! 96

శా. ఆఁ కొన్నప్పుడు పంటకంబయిన నొయ్యంబైన జావైనఁ గూ
రాకైనన్ ఫలమైన నీరమయినన్ హేళిం గల ట్టిచ్చుచున్
జేకోనౌఁ బరదేశులం గృహులకు న్సిద్ధంబు గావింప ఛీ
కాకున్న న్మతి యేఁటి కొంపలవి? భర్గా! పార్వతీవల్లభా! 97

మ. మదతల్వాల్కు న్నృపాలుతోఁ బలుసటు న్మిత్రాడు పెండ్లాముతో
జెడు జాడం బ్రచరించు నాత్మజునితోఁ జేట్పాటు గోర్లెంకతో
బొడపం జూడగ వచ్చు కార్మెపవుతోఁ బోరాడు చుట్టంబుతోఁ
గడ తేరం దరమా గృహస్థునకు భర్గా! పార్వతీవల్లభా! 98

శా. కాకి న్శాశ్వత జీవిగా నునిచి చిల్కన్ వేగ పోకార్చి సు
శ్లోకుం గొంచెపు దేండ్లలోఁ గెడపి దుష్టుం బెక్కు నాళ్ళుంచి యు
స్తోకత్యాగి దరిద్రుఁ జేసి పతినాత్మన్ శ్రీయుతుం జేయు నా
హా! కొంకేదిక నల్వ చెయ్వులకు? భర్గా! పార్వతీవల్లభా! 99

మ. ధరలో నెన్నఁగ శాలివాహన శకాబ్దంబు ల్గనన్యా మిని
కరబాణాంగశశాంక సంఖ్యఁ జెలువై కన్పట్టు (సౌమ్యా) హ్వయ
స్ఫురదబ్దంబున నిమ్మహాశతక మే పూర్ణంబు గావించి శ్రీ
కరలీల న్బుధు లెన్న నే కిడితి భర్గా! పార్వతీవల్లభా! 100

మ. ధన ధాన్యాంబర పుత్ర పౌత్ర మహాగోదాసీభటాందోళికా
వనితా బంధుర సింధు రాశ్వ (మహా తైశ్వర్యంబు) దీర్ఘాయువు
ష్షన భాగ్యంబును గల్గి వర్ధిలుదు రెవ్వారింటఁ జేట్పాటు లే
క నరు ల్దీని బఠించిరేని భువి భర్గా! పార్వతీవల్లభా! 101

# కూచిమంచి జగ్గకవి - భక్తమందార శతకము

కూచిమంచి తిమ్మకవి సోదరులలో ప్రముఖ కవిపండితుడుగా ప్రశస్తి వహించినవాడు జగ్గకవి-అధిక్షేప ప్రబంధమునకు శ్రీకారము చుట్టిన చంద్రరేఖా విలాప కర్తగ మాత్రమే తెలుగు సాహిత్య చరిత్ర కీకవి సుపరిచితుడు. ఈతడు రాజాస్థానములలో వాదవివాద ప్రతిభచే నిరాఘాటనటచ్చాటు కవితా శక్తిచే విద్వాంసుల మన్ననల నొంది విద్వత్కవిగా రాణించినాడు. అగ్రజుడగు కూచి మంచి తిమ్మకవిచే సుప్రశంసితుడు. తిమ్మభూపాలుండవరేశ్వరునిచే నొందిన జేబుదల్ అను బిరుదము అతనికిని ఆతని కవితకును సార్థకమైనది - అటువంటి బిరుదము నొందిన గౌరవ మీతనికే లభించినది. జగ్గకవి క్రీ.శ. 1700–ల మధ్యలో జీవించియుండెనని శతకవాఙ్మయ చరిత్రకారుల అభిప్రాయము. జానకీ పరిణయము-ద్విపద రాధాకృష్ణ చరితము - సుభద్రా వివాహము - శతకములు - చాటుప్రబంధములు కొన్ని రచించినట్లుగా ఈతడు చంద్రరేఖావిలాప కావ్యమున పేర్కొనెను. ఏవి శతకములు రచించెనో స్పష్టముగ పేర్కొనలేదు భక్తమందార శతక మొకటి మాత్రమే లభించుచున్నది. బహుళ ప్రశస్తి నొందిన శతక మిది :- భక్తి, నీతి, అధిక్షేప ప్రధానమైన శతకము - భక్తి శతకములలో సామాన్య నీతిబోధన మొనర్చుట పరిపాటి - ఈ సంప్రదాయమును కొందరు అధిక్షేప ధోరణిలో భక్తి నీతి భావములను వ్యక్తీకరించి సమకాలీన వ్యవస్థను, మానవ నైజమును విమర్శించిరి.

భక్తి శతక ధోరణిలో నిరత సాగిన సంప్రదాయమునకు చాలు సగుణస్తుతి నిర్గుణోపాసనాత్మక భావములు ప్రాశస్త్యంలో వ్యక్తమైనవి. ప్రాపంచిక - కపటభక్తి, కలియుగ ధర్మములు-పుణ్యపాపములు- సప్త సంతానములు దాన ధర్మములు-సజ్జన దుర్జన లక్షణములు మొదలగువానిని గూర్చి వివరించిన సందర్భ

ద్యములు కొన్ని వివరణాత్మకములుగను, ఉపదేశాత్మకములుగను, అధిక్షేపవ్యంగ్య చమత్కృతులతోను నున్నవి. నిశ్చల భక్తిలేని దానధర్మ వ్రతములు తీర్థ యాత్రాది విధానములు నిరర్థకములని నిరసించిన సందర్భములందు అధిక్షేప చ్ఛాయలు ప్రస్ఫుటముగ నున్నవి. ఈ సందర్భములందు సంస్కృతము నందలి ప్రసిద్ధ భక్తి స్తోత్ర శతకానుకరణములు, ధర్మశాస్త్ర నీతిశాస్త్ర శ్లోకానుకరణములు పెక్కు కనిపించును. మానవ జన్మమే సర్వోత్కృష్టమైనదనియు నట్టి జన్మము కలిగినందులకు భగవంతుని చిత్తశుద్ధితో భజించి జన్మమును సార్థకమొనర్చుకొని పునర్జన్మ రాహిత్యము నభిలషించవలయునని ఉద్బోధించిన సందర్భము లన్నియు భక్తిశతక సామాన్య లక్షణములతో పూర్ణములైనవి. మానవునిలోని భగవదంశను గుర్తించి మానవుని గూర్చి మానవత్వమును గూర్చి వీరు వెలువరించిన అభిప్రాయములు మానవతావాద సిద్ధాంతములకు చేరువగా నున్నవి. పరమాత్ముని భక్తిచే భజించువాడు, గురుసేవా నిరతుడు, ధనవంతు డయ్యు గర్వవిదూరుడై ధర్మ తత్పరుడైన వాడు "జనతా మోచక" పద్ధతిని మెలగిన వాడు, జారుడు కానివాడు... ఇట్టి లక్షణములు కల మానవుడు జగ్గకవి దృష్టిలో దేవుడే. ఇట్టి సందర్భములందో మానవునకు గల ఉత్కృష్టమైన స్థితిని జగ్గకవి స్పష్టముగా చాటినాడు. స్త్రీలు-కవులు-మూర్ఖ ప్రభువులు - వితరణ గుణము వర్ణ సాంకర్యమును గూర్చియే జగ్గకవి సునిశిత ధోరణి నవలంబించి అధిక్షేప ప్రధానముగ రచన సాగించినాడు. వనితలను గూర్చి వచించిన రీతి ప్రాచీన నీతి శతక కర్తల ధోరణిలో నున్నది. కొన్ని సందర్భములందు వచించిన నీతులు పరస్పర విరుద్ధములైనవి. అంగనల నమ్మరాదని భాస్కర శతక కర్త వచించి నట్లుగా జగ్గకవి తలపై చేయిడి బాస చేసినను పువ్వుబోడుల నమ్మరాదని ఉపదేశించెను. సుదతీపీనపయోధరములపై కపోలములపై మధ్య ప్రదేశంబుపై రాజిల్లు ఖలుచిత్తవృత్తిని, అట్టి మధ్యయైన సతి నాసి వాసికం పోం వాసెంమనాని విమర్శించిన ధోరణి మతిమాలిన విధముగ నున్నది-కవియుగ ధర్మములను వివరించుపట్ల పాపకులు-జారులు తొత్తుకొడుకులు-మున్నగు వారితోపాటు కుకవులను కూడ చేర్చుట గమనింపవలెను. ప్రభువుల దుర్నీతిని సుకవుల పట్ల

వారికి గల నిరాదరణ దృష్టిని, లోభగుణమును నిరసించి దయాదాన గుణ విహీనులును అరసికులును అగు ప్రభువులు సత్కవులను చేరదీయక కుకవులకు ధనము ధారవోయు చిత్తవృత్తిని ఖండించెను. ప్రౌఢ సత్కావ్యము లర్పించిన కవులకు కానైన నీయకుండుట, రేపు మాపు అని సుకవులను పలుమారు త్రిప్పించుట-సాధుజనసన్మానేచ్ఛ లోపించుట-ప్రజలను బాధించి బలవంతముగ ధనము [illegible] - [illegible]గునవి తామసము మూర్తీభవించిన దుర్నరేంద్రుల దుష్ట గుణములని జగ్గకవి తూలనాడెను. ఇట్టి ప్రభువులను పొట్టకూటికై సన్నుతించుట మన సొప్పదనియు సంపులకే దైవాకింతముగ కృతిని రచించుటను పూను కొనినట్లుగ స్పష్ట మొనర్చెను.

దుర్నీతిపరులైన ప్రభువుల దుర్గతిని గూర్చి వివరించి కొన్ని కొన్ని సందర్భములలో జగ్గకవి శాప దృష్టితో వారి చర్యలను ఖండించెను. భూసురుల నవమానించినవారు నశింతురనియు, కవీంద్రుల నాదరించనివారు వైభవమును గోల్పోవుదురని, శపించి జగ్గకవి వారి పట్లగల అనాదరణ, ఆగ్రహ దృష్టిని వ్యక్తీకరించెను. పచ్చంబేల పిసిండికి ముకురంబేటికి గ్రుడ్డివానికి అను పద్యము లందు లోభిజనులను అన్యాపదేశ పూర్వకముగ నిందించిన విధము గమనింపదగి నది. చంద్రరేఖావిలాప కృతికి సంబంధించిన అవమాన రేఖలు జగ్గకవి మనో రంగమున చిత్రవిచిత్ర గతులతో సాగినట్లున్నవి. ఆవేశపూరితమైన దూషణ విధానము కవి చౌడప్ప అడిదము సూరకవి శతకములందును కనిపించుచున్నవి.

జగ్గకవి కవితా పాండిత్య ప్రాగల్భ్య సంపన్నుడయ్యు దుర్భరదారిద్ర్యము ననుభవించినట్లు శతకాంత పద్యములవలన ననుమానింప నగును. నాటి పరిస్థితులే కవికి నిర్వేదస్థితియు కలిగించియుండును.

భక్తమందార శతకము కొన్ని సాంఘికాంశముల వివరణకు ఆధార గ్రంథముగా నున్నది - వృత్తిహీనులైన [illegible] నిద్రను పని సేవించుట - సామాన్యులు, శాస్త్రోపపత్తిజ్ఞానహీనులు వైద్య వృత్తి నవలంబించుట - వివిధ

వృత్తులవారు ధరించు ఆభరణముల ప్రసక్తి - వివిధ వృత్తులవారి ప్రసక్తి మొదలగు అంశములు సాంఘిక విశేషములు గ్రహించుటకు తోడ్పడుచున్నవి.

జగ్గకవి ప్రౌఢకావ్య నిర్మాణ దక్షుడు - శతక రచనము కూడ అట్లే సాగినది - భావములను - అవి సామాన్యములైనను, గంభీరోదాత్తములైనను, భక్తి నీతి జ్ఞాన వైరాగ్య భావములైనను, ప్రౌఢోక్తులతో వ్యక్తీకరించుట ఈ శతకము నందలి విశేషము. ఈతని శైలిపై అగ్రజుడగు తిమ్మకవి ముద్ర ప్రస్ఫుటముగా నున్నది. అధిక్షేప ధోరణిలో రచన సాగినపుడు ఈ విధానమే అవలంబింపబడినది. దారుణాఖండల శస్త్రతుల్యములైన అధిక్షేపోక్తులీతని లేఖినికి సాటిలేని శక్తిని చేకూర్చినవి. జనవ్యవహారమునందలి సామాన్య లోకోక్తులు జటిల సంస్కృత సమాస రూపములో ప్రౌఢరూపాన్ని సంతరించుకొనిన సందర్భములీ శతకమునం దధికముగా కలవు. సామాన్యోక్తులు ప్రౌఢోక్తులతో వియ్యమందిన పద్యములలో ముకురంబేటికి గ్రుడ్డివానికి - మకరోగ్రక్రకచాగ్ర జాగ్రదురు సమ్యక్పాతదంష్ట్రా - అనువానిని ప్రత్యేకముగ పేర్కొనవచ్చును.

జగ్గకవి అధిక్షేప ప్రబంధకర్తగా ప్రసిద్ధుడు - సంస్కృతాంధ్ర సాహిత్యములతో సుపరిచితుడు. ప్రసిద్ధ భక్తి నీతి శ్లోక, పద్యభావములను పూర్వాంధ్ర కవుల శైలిని అనుకరించిన పద్యములీ అంశమును నిరూపించుచున్నవి. సుభాషిత త్రిశతి మహాభారత భాగవతములు - సర్వేశ్వర, సుమతి, భాస్కర శతకముల ప్రభావ మీ శతకమున గలదు - ఇనుడద్దంబగు నగ్ని నీరగు, ముద మొప్పార, సుదతీపీన పయోధరద్వయముపై పెంపొందు నెమ్మోముపై మున్నగు పద్యము లిట్టివి.

# భక్త మందార శతకము

శా. శ్రీ సాకేతపురీ వరంబున సునాసీరోపల స్థాపిత
ప్రాసాదాంతర చంద్రకాంతమణియుక్పర్యంక భాగంబునన్
శ్రీ సీతాసతిఁగూడ వేడ్కలలరం గ్రీడించు మిమ్మెప్పుడున్
మా సన్మానస వీథిఁ గొల్చెదము రామా! భక్త మందారమా! 1

శా. అస్తోకామల కీర్తికామ! లసదుద్యన్నీరద శ్యామ! భూ
విస్తార ప్రభుతా లలామ! త్రిజగత్ప్రఖ్యాత సన్నామ! ధీ
రస్తుత్యోరు గుణాభిరామ! భుజసారస్ఫార పౌలస్త్యదు
ర్మ స్తస్తోమ విరామ! ధీమహిత! రామా! భక్త మందారమా! 2

మ. కదన ప్రాంగణకార్తికేయ! విలసద్గాంగేయకౌశేయ! భా
స్వదు దంచద్ఘననీలకాయ! త్రిజగత్సంరక్షణోపాయ! స
మ్ముదితాశేష మరున్నికాయ! దివిషత్ప్రఖ్యాతి గేయా! గరు
త్మద మేయాశ్వ! సుధీ విధేయగుణ! రామా! భక్తమందారమా! 3

మ. అకలంకాయత కీర్తిజాల! మహనీయాభీల శౌర్యస్ఫుర
స్మృక రాక్షసుర రావణప్రముఖ నానాదానవోత్తాల తూ
ల కరాళస్ఫుట వహ్ని కీల! జయశీలా! సద్దయావాల! హే
మకనచ్చేల! బుధానుపాల! రఘురామా! భక్త మందారమా! 4

మ. దురిత ధ్వాంత పతంగ! సంగర మహా మత్సార గర్వాహితో
త్కర సేనాకదళీ మతంగ! లస దేకాంతాత్మ పంకేజ సం
చర దుద్యన్మదభృంగ! పుంగవ ఘన శ్యామాంగ! సద్గంగ! క
్రమ రమాలింగన సంగతాంగ! రఘురామా! భక్త మందారమా! 5

శా. దండం బీయదె నీకుఁ గైకొనుము దోర్దండాగ్రజాగ్రన్మహో
దండోత్తాల విశాల దివ్యతర కోదండాగ్ర నిర్ముక్త స
త్కాండ వ్రాత విఖండి తాహిత శిరఃకాండా! కనత్కుండలా!
మాండవ్యాది తపోధన ప్రణుత! రామా! భక్త మందారమా! 6

శా. వింతల్గాఁగను మీకు సత్కృతులు గావింతున్ దుషారాద్రి జా
కాంతా క్రాంత జటాంతరాళ విలుఠద్గంగా తరంగచ్ఛటో
త్క్రాంతాత్యంత ఝుళం ఝుళన్నినద రంగద్ధాటి మీఱంగ సా
మంతా! సంతత శాంతిమంత! జయరామా! భక్త మందారమా! 7

మ. రకపుంగాప్యకశాకలాప రచనా ప్రాగల్భ్య సంసిద్ధికై
ప్రకట ప్రేమ భజింతు నీశ మకుట ప్రస్ఫీత గంగా జలా
ధిక మాధుర్య కవిత్వ ధూర్వహస ధీ దివ్య ప్రభావాఢ్యుఁ ది
మ్మ కవిశ్రేష్ఠు మదగ్రజున్ మదిని రామా! భక్త మందారమా! 8

మ. సకలాభీష్ట ఫల ప్రదాయకుఁడవై చంచద్దయాశాలివై
ప్రకట స్నేహ రసార్ద్ర మానసుఁడవై భంగీకృతానేక పా
తక ఘోరామయశాత్రవోత్కరుడవై ధాత్రీసుతం గూడి మా
మక చిత్తాబ్జమునన్ వసించు మొగి, రామా! భక్త మందారమా! 9

మ. మణి పుంఖాంకిత కంకపత్త్రచయ సమ్యగ్దివ్య తూణ ద్వయం
బణుమధ్యంబునఁ దళ్కు గుల్క ఖల దైత్యానీకహృద్భేదకృ
ద్ఘణ నీయోగ్ర కఠోరకార్ముకము చేతంబూని నా వెంటల
క్ష్మణుడు న్నీవును నంటి త్రిమ్మరుము రామా! భక్త మందారమా! 10

మ. పలుమాఱున్ భవదీయ కావ్య రచనా ప్రాగల్భ్య మొప్పార ని
న్గొలుతున్ మామక మానసాబ్జమున బొంకుల్ గావు నీ వెచ్చటం
గలలోనం బొడకట్ట విట్టి పగ బాగా! మేల్! బళా! శ్యామకో
మల విభ్రాజితమందరా పయవ! రామా! భక్త మందారమా! 11

మ. రఘు వంశాంబుధి పూర్ణచంద్ర! విలసద్రాజన్య దేవేంద్ర! నా
యఘ సంఘంబులఁ బాఱఁద్రోలి భవదీయామేయ కారుణ్యదృ
ష్టి ఘన ప్రక్రియఁ జూచి యేలుకొనుమా! సేవింతు సత్యంతమున్
మఘవ ప్రస్తుత సద్గుణాభరణ! రామా! భక్తమందారమా! 12

మ. గణుతింతున్ భవదీయ సద్గుణ కథల్ కౌతూహలం బొప్పఁగాఁ
బ్రణుతింతున్ సచరాచరాదిక మహా బ్రహ్మాండ భాండచ్ఛటా
గణిత ప్రాణిజనాంతరాత్మ వని వేడ్కన్ సంతతంబున్ నభో
మణివంశాంబుధి శీతభాను! రఘురామా! భక్తమందారమా! 13

మ. సారాసారవిచార! ధీరజనతా సంరక్షణోదార! స
త్కారుణ్యాకరమూర్తి వంచు నెద సత్యంతంబు మీ దివ్యశృం
గారాగార పదారవిందములు వేడ్కన్ గొల్తు నన్ బ్రోవుమీ
మారీచ ప్రముఖప్రహారశర! రామా! భక్తమందారమా! 14

మ. మిహికాంశుప్రభ సుందరాననముతో మేలైన కందోయితో
సహజద్రత్న వినీల విగ్రహముతో నంచత్కిరీటంబుతో
విహగాధీశ్వరు నెక్కి నా యెదుటికిన్ విచ్చేయవే యోపితా
మహ సుత్రామ సుఖామర ప్రణుత! రామా! భక్తమందారమా! 15

శా. కంజాతప్రభవాండ భాండతతుల సంగప్స్ఫితనాచేతనా
శిం జెన్నారఁగఁ బ్రోవ నేతు వని యాశిన్ ధీజనుల్ చెప్ప హృ
త్కంజాతంబున నిన్ను గొల్తు నను వేడ్కన్ వేగ రక్షింపుమీ
మంజుశ్రీకరుణా కటాక్షమున రామా! భక్తమందారమా! 16

మ. తనువుం బంగరు రాసియున్ గొనఁగ నెంచం బొప్పు శత్రుఘ్నుఁడున్
రమ్మలి బట్టిన్ భరతుండు చామరము గూర్మిన్ వీవఁగా లక్ష్మణుం
డలరం దూపుల విల్లుదాల్పఁ గపి సేనాధీశ్వరుల్ గొల్వ ని
ర్మల లీలం గొలువుండు నిన్ దలఁతు రామా! భక్తమందారమా! 17

శా. నిక్కంబారయఁ దావకాంఘ్రి విలసన్నీరేరుహ ద్వంద్వమే
దిక్కెల్లప్పుడు మా కటంచు మదినెంతే వేడ్కఁ భావించెద౯
జిక్కుల్ వచ్చిన నమ్మకిచ్చి సరగం జేపట్టి రక్షింపు స
మ్యక్కారుణ్యకటాక్ష వీక్ష నను రామా ! భక్తమందారమా ! 18

మ. అతసీపుష్పసమాన కోమల వినీలాంగున్ సముద్యన్మహో
న్నతకోదండ నిషంగసంగు బలవన్నక్తంచరాఖర్వ ప
ర్వత జీమూత తురంగుఁ గింకరజనవ్రాతావనాత్యంత ర
మ్యతదాపాంగుని నిన్ భజింతు మది రామా ! భక్తమందారమా ! 19

శా. ఆర్తత్రాణ పరాయణుండ వని నిన్నత్యంతమున్ సజ్జను
ల్కీర్తింపన్ విని తావకీన పదనాళీక ద్వయుంబాత్మ వి
స్ఫూర్తిం జెందఁగ నెంతు నెల్లపుడు నన్బోషింపు మీ సత్కృపన్
మార్తాండ ద్విజరాజ సన్నయన ! రామా ! భక్తమందారమా ! 20

మ. మదనాగాశ్వ శతాంగకాంచన తనన్మాణిక్య భూషామృగీ
మద దివ్యాంబర చామరధ్వజ లసన్మంజూషికాందోళికా
మృదు తల్పార్థ సమృద్ధిగల్గి పిదప న్నీ సన్నిధిం జేరు నిన్
మదిలో నెప్పుడు గొల్చు మానవుఁడు రామా ! భక్తమందారమా ! 21

శా. శ్రీకంఠాంబుజ సంభవేంద్ర రవిశోచిష్కేశ ముఖ్యామరా
నీకంబుల్ గడుభక్తి నిన్ గొలిచి పూన్కిన్ ధన్యులైనారు నేఁ
డాకాంక్షన్ భజియింతు మేమటుల చిత్తానంద మొందింపుమా
మాకుం బ్రాపును దాపు నీ వగుచు రామా ! భక్తమందారమా ! 22

మ. శరి భా, జార్జున, పుండరీక, శుక, గంగానందన వ్యాసులున్
పరమాధీశ, బలీంద్ర, మారుతసుతుల్, సంప్రీతి సద్భక్తి మీ
పదపద్మాంఘ్రిద్వయ చింతనాభిరతిమైఁ బ్రాపించిరో సద్గతిన్
స్మరకోటి ప్రతిమాన రూపయుత రామా ! భక్తమందారమా ! 23

మ. ఆహితార్థుల్ వెదఁజాయు లేము లెడలున్ వ్యాధుల్ దొలంగు న్నవ
గ్రహ దోషంబులు శాంతిఁ బొందుఁ గలుషవ్రాతంబు జాఱున్ శుభా
వహమౌ తావక దివ్యనామ మెలమిన్ వాక్రుచ్చినన్ ధాత్రిపై
మహితోద్దండతర ప్రతాపగుణ! రామా! భక్తమందారమా! 24

మ. గర్గాగస్త్యవసిష్ఠ శుక మార్కండేయ గాధేయులం
తర్గాఢాధిక శత్రుశిక్షణ కళాధౌరేయతాబుద్ధి సం
సర్గ ప్రక్రియ మిమ్ముఁ గొల్తురుగదా క్ష్మాకన్య కోరోజస
న్మార్గస్ఫాయ దురః కవాటతట! రామా! భక్త మందారమా! 25

మ. అకలంకాయత భోగభాగ్యదము నిత్యానంద సంధాన హే
తుక మాభీలతరాఘమేఘ ఘనవాతూలంబు ముక్తిప్రదా
యక మత్యంత పవిత్ర మెంచ నిల నాహా! తారకబ్రహ్మ నా
మక మంత్రంబు భళీ! భవన్మహిమ! రామా! భక్తమందారమా! 26

మ. ఇనుఁడర్ధంబగు నగ్నినీరగు భుజగేంద్రుండు పూదండయౌ
వనధుల్ పల్వల పంక్తులే జలధరాధ్వం బిల్లయౌ రాజయో
గ నిరూఢస్థితిఁ దావకీనపదయుగ్మం బెల్లకాలంబు ప్రే
మ నెదం బూని భజించు ధన్యులకు రామా! భక్తమందారమా. 27

మ. ముద మొప్పార నిరంతరంబు బలవన్మోక్షప్రదామేయభా
స్వదుదంచత్పదంఘ్రితామరస సేవాసక్త చిత్తంబు ప
ద్మదులం జేరునె పారిజాత సుమనోమత్తద్విరేఫంబు దా
మదనోర్వీజము చెంతకుం జనునె రామా! భక్తమందారమా! 28

శా. ఖండించున్ బహుజన్మసంచిత చంద్గాఘోగ్ర దోషావళిం
జండప్రక్రియ శైలజావినుత భాస్వచ్చారు దివ్యన్మహో
ద్దండ శ్రీ భవదీయనామ మిలమీఁదన్ భూతభేతాళ కూ
ష్మాండవ్రాత ఘనాఘనశ్వసన! రామా! భక్తమందారమా! 29

శా. సారాసారకృపా కటాక్షమున నిచ్చల్ భూర్భువ స్వస్త్రిలో
కాలాధాఖిల జంతుజాలముల నెయ్యంబొప్పఁగాఁ బ్రోచు ని
న్నారాధించి సుఖింపలేక శిలలం బ్రార్థింతురెంతే నవ
స్మారస్ఫూర్తి మదాత్మ మూఢు లిల రామా! భక్తమందారమా! 30

మ. సరసీజాత భవాభవామరుల్ చర్చింప మీ మాయఁగా
నరటంచున్ సతతంబు ప్రాఁజదువులున్ నానా పురాణంబులున్
సరస ప్రక్రియఁ జాటుచుండఁగఁ బిశాచప్రాయు లెంతేని సో
మరిపోతుల్ నరులెట్లు గాంచెదరు? రామా! భక్తమందారమా! 31

శా. ధర్మంబంచు సధర్మమంచుఁ గడు మిథ్యాలీల లేపారఁగా
నిర్మాణం బొనరించి ప్రాణులను నిర్నిద్ర ప్రభావంబులన్
బేర్మిం జెందఁగఁ జేసి యంత్రకుగతిన్ బిట్టూరకే త్రిప్పు నీ
మర్మం బెవ్వ రెఱుంగఁగాఁ గలరు? రామా! భక్తమందారమా! 32

మ. వ్రతముల్ పట్టిన, దేవభూసుర గురువ్రాతంబులం గొల్చి నం
గ్రతు తంత్రంబులు దానధర్మము లపారంబౌనటుల్ చేసినన్
శతవర్షంబులు గంగలో మునిఁగినన్ సంధిల్లునే ముక్తి దు
ర్మతికిం దాసక భక్తి గల్గనిని? రామా! భక్తమందారమా! 33

శా. సందేహింపక కొంచకెప్పుడు హృదబ్జాతంబులో భక్తి నీ
యందంబై తగుమూర్తి నిల్పికొని యత్యాసక్తి సేవించువాఁ
డొందుం గుప్పన వాంఛితార్థములు బాగొప్పారు వందారు స
న్మందారంబవు గావె నీ వరయ, రామా! భక్తమందారమా! 34

మ. అరిషడ్వర్గముఁ బాఱఁద్రోలి సకల వ్యామోహముల్ వీడి సు
స్థిర యోగాంతర దృష్టి మీ చరణముల్ సేవించు పుణ్యాత్మకుల్
పరవైకుంఠపురాంతరాళమున భాస్వల్లీలలన్ ముక్తి తా
మరసాక్షీ రతికేళిఁ జొక్కుదురు రామా! భక్తమందారమా! 35

మ. ఉదయార్కాంశు వికస్వరాంబుజ రమాయుక్తంబులై యొప్పు నీ
పదముల్ ధ్యానము చేసి ముక్తియువతిం బ్రాపింపఁగా లేక దు
ర్మదవృత్తిన్ బహుమానస మగ్ని దనరారన్ వేల్పుఁగా! దేవతా
మదిరాక్షీసురతేచ్ఛ! భూసురుఁడు రామా! భక్తమందారమా! 36

శా. ప్రాణివ్యూహ లలాట భాగముల లీలాలోల చిత్తంబునన్
వాణీకోకిల వాణినాథుఁడు లిఖింపం బొల్చు భాగ్యాక్షర
శ్రేణిం బెంపఁదరంబె యెవ్వరికి సంసిద్ధంబు స్వారాడ్వరో
మాణిక్య స్ఫురదంఘ్రి తామరస రామా! భక్తమందారమా! 37

మ. నిను సేవింపని పాపకర్ములను వాణీనాథ గోరాజవా
హనసుత్రామముఖామర ప్రవర వాచాగోచరంబై సనా
తనమై ముక్తి రమా సమేతమగు నీ ధామంబు సిద్ధింపనే
మనురాడ్వంశ సుధాబ్ధిసోమ! రఘురామా! భక్తమందారమా! 38

మ. మొదలంజేసిన పుణ్యపాపములు సన్మోదాతిఖేదంబులై
యెదన న్వచ్చి భుజింపఁజాలు పడు నాహా! యెవ్వరి న్వేఁడినన్
వదలం జాలవె యెన్ని చందములఁ దా నారింపఁ జింతించినన్
మదనారాతికినైనఁ దత్త్వమిది రామా! భక్తమందారమా! 39

శా. ఇంపందన్ సుఖమీయఁజాలని మహాహేయార్థ సంసారఘో
రాంధూ బంధనిబద్ధులై సతత మన్యాయ ప్రచారంబులన్
గ్రిందున్మీఁదును గానరెంతయును రక్తిన్ ధాత్రిపత్రింతురో
మందుల్ సుందర మందహాసముఖ రామా! భక్తమందారమా! 40

మ. అమరశ్రేష్ఠుని వారువంబునకు దూండ్లాహారమీశానమౌ
ళి మహాభోగికి గాలిమేఁత, నిను పాలి న్మోయుమాద్యద్విహం
గమతో కేంద్రుఁడన కెల్లఁ బుర్వుగమియే భోసంబు ప్రారబ్ధక
ర్మ మవశ్యంబు భుజింప కెట్లుచను? రామా! భక్తమందారమా! 41

మ. సభఁ దెల్లప్పుడు నాజపంజపభరానన్మాత్ముఁడై యున్నఁగా
ని రహస్యంబుగ నీ పదద్వయము ధ్యానింపన్ వలెన్ భక్తితో
బరమానంద సుధాసారానుభవలిప్సాబుద్ధియై సర్వఁగు
మ్మరి పుర్వం బలెఁ బంకదూరగతి రామా! భక్తమందారమా! 42

శా. దానంబాభరణంబు హస్తమునకు దద్జ్ఞానికిన్నీపద
ధ్యానంబాభరణంబు భూసురున కత్యంతంబు గంగానదీ
స్నానంబాభరణంబు భూతలమునన్ నాడెంపుటిల్లాలికిన్
మానంబాభరణంబు తథ్యమిది రామా! భక్తమందారమా! 43

మ. అపన న్వేఁడిన యాచక ప్రతతికీయంగా వలెన్ రొక్కమిం
పొదవన్ మీ కథలాలకింపవలె మేనుప్పొంగ గంగామహా
నదిలో స్నానము లాచరింపవలె హీన ప్రక్రియన్ మాని స
మ్మద చిత్తంబున మర్త్యుఁ డెల్లపుడు రామా! భక్తమందారమా! 44

శా. ఉద్యానాదిక సప్తసంతతుల బా గొప్పార నిల్పన్ వలెన్
సద్యోదానమునన్ బుధాళి కెపుడున్ సంప్రీతి నల్పన్ వలెన్
ప్రోద్యద్విప్రులు సంగ్రహింపవలె నిత్యోత్సాహియై మర్త్యుఁడో
మాపద్ధానపకానన జ్వలన! రామా! భక్తమందారమా! 45

మ. నిను భక్తిన్ భజియించినన్ గురువులన్నిత్యంబు సేవించినన్
ధనవంతుండయి గర్వదూరుఁడగుచున్ ధర్మంబు గావించినన్
జనతామోదక పద్ధతి న్మెలఁగినన్ జారుండు గాకుండినన్
మనుజుండాతయు దేవుఁ డిమ్మహిని రామా! భక్త మందారమా! 46

శా. అన్యాయంబు దొలంగి యెల్లరను సత్యానంద మింపొంద సో
మ్య ప్రక్రియ నేల యేలు నతఁడున్ శాస్త్రానుసారంబుగాఁ
గన్యాదానము సేయు నాతఁడును వేదజ్ఞున్ భూసురున్ బిల్చి స
న్మాన్యస్థలం బిచ్చినవాఁడు ధన్యుఁడిల రామా! భక్త మందారమా! 47

మ. చెఱుపున్ సూనుఁడుఁదోటయుంగృతియు నిక్షేపంబుసుం దేవమం
దిరముల్ విప్ర వివాహమున్ జగతి నెంతే పేర్కొ గావించుచున్
నిరతంబున్ భవదీయ పాదవిల స న్నీరేరుహద్వంద్వ సం
స్మరణం బూనెడువాఁడు ముక్తుఁడగు రామా! భక్త మందారమా! 48

శా. ఆకాంక్షన్ గృహదాసితో సురతలీలాసక్తి వర్తించినన్
లోకస్తుత్య చరిత్ర ! సత్కులవధూలోలుండు గాకుండినన్
శోకాప్తాస్తమయోదయంబుల యెడన్ సూర్యానినన్ మర్త్యుపై
మా కారుణ్య కటాక్ష మూన దిల రామా ! భక్త మందారమా! 49

మ. గణుతింపంగ పరాధముల్ సుకవికిం గాసీనివాఁడున్ దయా
గుణ మొక్కింతయు లేనివాఁడు పొరుపైఁగొండెంబుగావించు వాఁ
డణుమధ్యన్ సతిఁబాసి దాసి పొందాసించువాఁ డుర్విఁ బ్రా
హ్మణ విత్తంబు హరించువాఁ డరయ రామా! భక్తమందారమా 50

మ. వృషలీభర్తయుదేవలుండు సమిఁడున్ వేదాభిశస్తుండు మా
హిషి కుం డగ్నిదకుండగోళకులునున్ హింసా పరస్వాంతుడున్
విషదుండుసుం గొఱగాఁడు పంక్తి కెపుడర్హున్ భక్తసంఘాత క
ల్మష మత్తద్విరదౌఘ పంచముఖరామా! భక్తమందారమా! 51

మ. అగసాలిన్ దెలఘాతకున్ యవనునిన్ వ్యాపారి దాసున్ పినున్
జగతీనాథుని వేటకాని గణికన్ జండాలునిన్ జోదునిన్
బ్రెగడంగోమటి జూదరిన్ బుధజనుల్ పెన్గొక్కమర్పింప స
మ్మగఁగ రాదెంతయుఁ దథ్య మిద్ధరణి రామా! భక్తమందారమా! 52

మ. అలుడిన్ మిక్కిలి సాహసంబు ఘనమున్యాయము బ్రచారింబునుం
జలముం దప్పము కాము మొప్పుతు మహాకాలంబు శీలంబుహో
తలపైఁజేయుడి దానచేసిన యథార్థంబుర్విపైఁ బుష్పకో
మలుల న్నమ్మఁగరాదు పూరుషులు రామా! భక్తమందారమా! 53

మ. కుకవుల్ కూళలు కొంటె తొత్తుకొడుకుల్ కొండీలు కోనారులుం
పక్కలై తత్తలవారు పాపకులు జూదంబాడువారు న్మహిం
బ్రకటంబై సిరిగాంచిరి కలియుగ ప్రామాణ్య మాశ్చర్య మో
మకరాక్షాసుర గర్వ సంహరణ రామా! భక్తమందారమా! 54

మ. పలితాలంబుర వైద్యలక్షణ పరీక్షా శాస్త్ర మూఢావనీ
తలనాథుల్ బలుమోటకాఁపు దొరలున్ పట్టంబుగా బిల్చి పుం
ఖలం వేయింప భుజించి క్రొవ్వి కడువైద్యుల్‌గారె సిగ్గేది? త
మ్మకులున్ నంబులు క్షౌరకాంత్యజులు రామా! భక్తమందారమా! 55

శా. దీపత్వంబునఁగూడులేక చెడి యెంతే భైక్ష్యముల్ గొంచుల
జ్జానామంబులు లేకయుండు బలుఘాజస్యంబు చేపట్టి దా
నానా వస్తువులిచ్చి వైభవ మిడన్ న్యాయజ్ఞుఁడై వాఁడిలన్
మానం జాలునె తొంటినీచగతి రామా! భక్తమందారమా! 56

శా. ఎన్నంగార్ధభ ముత్తమాశ్వమగునే; హీనుండు దాతృత్వ సం
పన్నుండౌనె; ఖలుండు పుణ్యుఁడగునే; పల్గాకి సాధౌనె; క
ఱ్ఱున్నానే; మహిషంబ హస్తి యగునే; జోరీగ దేఁటౌనెటుల్
మన్నంబిల్లి మృగేంద్రమౌనె భువి రామా! భక్తమందారమా! 57

మ. బలిభిక్షన్ దయఁబెట్టఁబూనిన మహాపాపాత్మకుల్ భూమిలో
పలఁగోట్యర్బుద సంఖ్యయైనఁ ద్రిజగత్ప్రఖ్యాత దానప్రచ్ఛటా
కలనావర్తిత పుణ్యమూర్తియగునే గాటంబుగాఁ బర్వ దో
మలువేయైన మదద్విపంబగునె రామా! భక్తమందారమా! 58

మ. ధరరోసన్ సురవిప్రవశీత బలపద్ధాటీనిరాఘాట భా
స్వర సత్కావ్య కథాసుధారస పరీక్షాదీక్ష విద్వన్మహా
పురుషశ్రేష్ఠులకెట్లు పాపులకటే పోల్కిన్ లభింపన్ సదా
మరుదాత్మోద్భవసేవితాంఘ్రియుగళ! రామా! భక్తమందారమా! 59

పద్యంబేల పిసినికి? కీప్సితము దీర్పన్ రాని జేజేకు నై
వేద్యంబేల? పదార్థ చోరునకు నుర్విన్ వేదవేదాంత స
ద్విద్యాభ్యాసన బుద్ధియేల? మది భావింపంగ నెల్లప్పుడున్
మద్యం బానెడు వానికేల సుధ? రామా! భక్తమందారమా! 60

మ. ముకురంబేటికి గ్రుడ్డివానికి, జనామోదానుసంధాన రూ
పకళాకౌశలతామినీ సురతలిప్సాబుద్ధి ధాత్రీశ్నపుం
సకతం గుందెడు వానికేమిటికి, మీసంబేటికిన్ లోభికిన్
మకుటంబేటికి మర్కటంబునకు రామా! భక్తమందారమా! 61

మ. కుజనున్ ధర్మతనూజుఁడంచు నతిమూర్ఖున్ భోజరాజంచు ఘో
ర జరాభార కురూపకారిని రమాకాముండుమారుండటం
చు నుతత్వంబున వేఁడి కాతపులు కాసుంగాన రెన్నంగ సా
మజ రాజోగ్రవిపద్విశాపహర! రామా! భక్తమందారమా! 62

మ. చలదశ్వత్థతరుప్రవాళమనుచున్ సారంగ హేరంబటం
చలరుందింబెన పూవటంచు ముకురంబంచున్ భ్రమన్ సజ్జనుల్
కళలూరంగ రమించుచున్ వదలరే కాలంబు ముగ్ధాంగనా
మలమూత్రాకర మారమందిరము రామా! భక్తమందారమా! 63

మ. సుదతీపీనపయోధర ద్వయముపై సొంపొందు నెమ్మోముపై
మదనాగారముపైఁ గపోలములపై మధ్యప్రదేశంబుపై
రదనావాసంబు పయున్నితంబముపయున్ రాజిల్లు నెంతేని స
మ్మద వృత్తిన్ ఖలుచిత్త మిద్ధరణి రామా! భక్తమందారమా. 64

మ. రసికోత్తంసులు సత్కవీంద్రులు మహోద్యానుష్ఠ సంసార ఘో
రసముద్రాంతరమున్సృత్తి నరకంబేరున్ లేక సంభ్రాంతిచేఁ
బసులం గాచిన మోటకొయ్యల వారిం బ్రార్థింతు రెంతేని ప
మసగాదే యిది యెంచి చూచినను రామా! భక్తమందారమా! 65

మ. సరసుం డాతఁడు పెద్ద యాతఁడు సుహాసౌందర్యవంతుం డతం
డరి హృద్భీకరశౌర్యధుర్యుఁ డతఁడుద్యద్దాన కర్ణుం డతం
డురుగోత్రోద్భవుఁ డాత డెప్పుడిల సుద్యోగార్థ సంపన్నుఁడౌ
మరుదీశోపల నీలమూర్తి ధర! రామా! భక్తమందారమా! 66

శా. విత్తం బొత్తుగఁ గూర్చి మానవుఁడు దుర్వృత్తిం బ్రవర్తించి యు
వ్యేత్తుం దేహ మెఱుంగలేక తిరుగున్ హేళాగతిన్ బత్తఁ దాఁ
జిత్తాంబ్జంబున మిమ్ముఁ గొల్వఁ డెపు డిస్సీ యెంత పాపంబొకో
మత్తారాతి నిశాట సంహరణ! రామా! భక్తమందారమా ! 67

మ. శమ మావంతయుఁ బూననొల్లఁడు గరిష్ఠ జ్ఞానవిద్యావిశే
షము గోరంతయు నాత్మలోఁ దలఁపఁ డాచార ప్రచారంబు ధ
ర్మము వీసంబును జేయఁజాలఁడు గదా, మంచుండు పెన్ రొక్కపున్
మమతన్ దేహ మెఱుంగలేక ధర రామా! భక్తమంచారమా! 68

మ. భువిలో లోభులు కూడఁబెట్టిన ధనంబున్ బందికాం డ్రాడిగల్
బవినీలున్ దరిబేసులున్ దొరలొగిన్ బచ్చుల్ నటీ దాసికా
యువతుల్ గుంటెనకత్తెలున్ గొనుదు రోహో! యెట్టి కర్మంబొ! హై
మవతిసన్నుత దివ్యనామ! రఘురామా! భక్తమందారమా! 69

మ. సిరులెంతేనియు నిక్కవంబనుచు దుశ్శీలన్ మదిన్ నమ్మి ని
ర్భర గర్వంబున మీఁదు చూతు రహహా! భావంబుతో నెంచినం
గరి కర్ణాంతము లంబు బుద్బుదతతుల్ ఖద్యోతకీటప్రభల్
మరుదగ్రార్పిత దీపమాలికలు! రామా! భక్తమందారమా! 70

మ. ఇటురా రమ్మని పిల్చి గౌరవముగా హేమాంబరాందోళికా
కటకప్రాకట భూషణాదు లిడి వేడ్కన్ తేఁడు ప్రార్థింప వి
స్ఫుట భంగిం దగు కావ్యకన్య నిడనొప్పన్ గానిచో నుర్వి కో
మటి మేనప్ప్రేమె బిల్చిఁ గట్టఁగను? రామా! భక్తమంచారమా! 71

మ. తనకుం బద్యము లల్లి సత్కవులు నిత్యంబుం బ్రసంగింపఁగా
వినియొత్తుల్ విను దాసరింబలె బయల్వీక్షించుచుం గానియై
న నౌసంగన్ మదిలోఁ దలంపని మదాంధక్షోణిపాలుండిలన్
మనుమార్గంబు గ్రహింపఁగాఁగలడె రామా! భక్తమందారమా! 72

శా. ధాటీపాటవ చాటు కావ్యరచనోద్యద్ధోరణీ సారణీ
వాటీకోద్గతి సత్కవీశ్వరుఁడు నిత్యంబుం దమున్ వేఁడఁగా
వీటీ ఘోటక హాటకాదు లిడ రర్విన్ నిర్దయాబుద్ధిచే
మాటే బంగరు నేటి రాజులకు రామా! భక్తమందారమా. 73

మ. పలుమాఱుం ద్విజరాజు లొక్కటఁ దముం బాధింతురంచున్ విషా
నలఘోరాననముల్ముడుంచుకొని కానన్రాక దుర్గస్థలం
బుల వర్తించుచు బుస్సు రందు రిల నాభోగేశు లెందైననున్
మలఁకల్మాని చరింపఁగాఁగలరె? రామా! భక్తమందారమా! 74

మ. గడియల్ రెండిక పైచిరా వెనుకరా కాసంత సే పుండిరా
విడిదింటం గడె సేద దీర్చుకొనిరా వేగంబె బోసేసిరా
యెడపొద్దప్పుడు రమ్మటంచు సుకవిన్ హీనప్రభుం డీగతిన్
మడఁతల్వాల్కుచుఁ ద్రిప్పుఁగాసిదక! రామా! భక్తమందారమా! 75

మ. బలరాజన్యుఁడు ధూర్తకాకవిఁ గనంగంపించి విత్తంబు దా
నలఘు ప్రక్రియ నిచ్చు సత్కవిపరున్ హాస్యంబు గావించు నౌ
నిల బర్బూరము గాలివానఁబడుఁగా కింతైనఁ గంపించునే
మలయోర్వీధర మారుతంబునకు రామా! భక్తమందారమా! 76

శా. కాయస్థుగ్గణికా జనంబులు తురుష్క శ్రేణులున్ దుష్టదా
సేయుల్ వైద్యులును బురోహితులు దాసీఘాతముల్ గాయకుల్
బోయల్ గొంచెము లోభభూపుల ధనంబున్ సంతతంబున్ మహా
మహామానంబు పన్ని లాగుదురు రామా! భక్తమందారమా! 77

శా. శ్రీలక్ష్మీ మహయుక్తుఁడై నృపుఁడువాసింబేర్చు భూదేవునిం
గేలింబెట్టి తదీయకోప మహిమన్ గీడొందు నెట్లన్న ది
క్ఛేలత్కీర్తి త్రిశంకుం డల్క నలశక్తింబల్కి తద్వాగ్గతిన్
మాలండై చెడిపోవడోట! మును రామా! భక్తమందారమా! 78

మ. లస దుద్యజ్జ్వల భవ్యదివ్య కవితాలంకార విద్యావిశే
షసమాటోప విజృంభమాణ కవిరాట్సంక్రందనుం ద్రిప్పి త్రి
ప్పి సమీచానతఁబ్రోవకుండు నృపతుల్ పెంపేది నిర్భాగ్యులై
మసియై పోవరె తత్కృతిధాగ్ని నిల రామా! భక్తమందారమా! 79

మ. రసికత్వంబును దాన ధర్మగుణముం బ్రత్యర్థిశిక్షాకళా
వ్యసనప్రేమము సాధుబంధుజనతా త్యం తావనోపాయ లా
లసచిత్తంబును దృప్తియుం గొఱత వాలాయంబు దానెంచఁదా
మసమే మిక్కిలి దుర్నరేంద్రులకు రామా! భక్తమందారమా. 80

మ. ఖలభూనాథుఁడు నిచ్చనిచ్చ జనులన్ గారించి విత్తంబు మి
క్కిలిగా గూరిచి పుట్టలో నిఱికి వేఁగింపంగ నుద్దండతం
బలవన్మ్లేచ్ఛులు పొంది లాపనుచు లే బాధింతురో పెట్టి జెట్టిఁజీ
మలు చీకాకుగఁ జేయుచందముగ రామా! భక్తమందారమా! 81

మ. అతికష్టం బొనరించి భూమిజనుఁ డత్యాసక్తి విత్తంబు వి
స్తృతభంగిం గడియింపఁగా నెఱిఁగి ధాత్రీకాంతు లుద్దండ ప
ద్ధతి వానిం గొనిపోయి కొట్టి మిగులం దండించి యా సొమ్ము స
మ్మతిఁగైకొంద్రు మఱెంత నిర్దయులొ రామా! భక్తమందారమా! 82

శా. దానంబిల్లె, దయారసంబు నహి, సద్ధర్మంబుతీర్, మీపద
ధ్యానంబున్ గడులొచ్చు సత్యవచన వ్యాపారముల్ సున్న సు
జ్ఞానం బెంతయు నాస్తి సాధుజన సన్మానేచ్ఛ లే దెన్న నీ
ష్మానాథాధమకోటి కేది గతి రామా! భక్త మందారమా! 83

మ. తనువుల్ నిక్కము లంచు నెంచుకొని యత్యంత దుర్మార్గ వ
ర్తనులై నిర్దయమీఱ భూమిప్రజలం దండించి విత్తంబులా
ర్జవము ల్సేయుచు గొందు లందొదిగి నిచ్చల్గానరాకుంద్రు ఛీ!
మనుజాధీశుల కేటి ధర్మములు రామా! భక్తమందారమా! 84

మ. మురుగుల్ ప్రోగులు సుంగరాల్సరిపిణీల్ముక్తా మణీహారముల్
తురంగంబు ల్గరు లందబులు భట స్తోమంబులున్ రాజ్యమున్
స్థిరమంచున్ మది నమ్మి పాపములు వే సేతు ర్మదోన్మత్త పా
మర భూవిష్టప దుష్టనాయకులు రామా! భక్తమందారమా! 85

మ. మకరోగ్రక్రకచాగ్రజాగ్రదురు సమ్యక్చాత దంష్ట్రిక్షత
ప్రకటాంఘ్రిద్వయనిర్గళ ద్రుధిరధారాపూర ఘోరవ్యథా
చకితుండై మొఱసేయ నగ్గజపతిన్ సంప్రీతిరక్షింపవే
మకుటీభూత శశాంక చాపహర! రామా! భక్తమందారమా! 86

మ. అగవిద్వేషణుఁగూడి వేడుక నహల్యా దేవి క్రీడింపఁగా
భగవంతుం డగు గౌతముండు గని కోపస్ఫూర్తి శాపింప నీ
జగతిం ఱాపడి తాపమొందగ పదాబ్జ ప్రస్ఫుర ద్ధూళిచే
మగువం జేసితి వెంత వింతయది రామా! భక్తమందారమా! 87

మ. అమరేంద్రాది సమస్త దేవభయదాహంకార హుంకార మ
ర్దద బాహా బలసింహనాద పటుకోమండోగ్ర బాణచ్ఛటా
సమజాగ్రత్ఖర దూషణాసురుల భాస్వ ద్దండకారణ్య సీ
మ మును ల్మేలని మెచ్చఁ ద్రుంచితివి రామా! భక్త మందారమా! 88

శా. నే నీ బంటను నీవు నా దొర వదే నిక్కంబటంచు న్మదిన్
నానాథంగుల నమ్మి కొల్చితనె యన్యాశ్యాయి జీతంబుగా
నైన స్నేటి కొసంగవైతి భళియాహా! లెస్స! బాగాయెగా!
మానేంద్రా శయపద్మ షట్చరణ! రామా! భక్త మందారమా! 89

మ. బలదేవుండతి నీచవృత్తిని సురాపానంబు గావింపఁగా
జలజాక్షాస్త్రిఁడు మానిసీ పురుషలజ్జాత్యాగముల్ సేయఁగా
చలమారంగనలక్ష్మి సజ్జనుల నిచ్చల్ పట్టి బాధింపఁగా
మలపం జాల విదే వివేక మిల ? రామా ! భక్తమందారమా! 90

మ. అదిరా ! పిల్చినఁబల్కవేటికి ? బరాకా చాలు నిం కేలఁగాఁ
గదరా ! మిక్కిలివేఁడి వేసరిలు బాగా ? నీకు శ్రీజానకీ
మదిరాక్షీ శరణంబులాన ! నను ప్రేమన్ బ్రోవరా వేడ్క శ్రీ
మదుదంచత్ప్రభుతాగుణప్రథిత ! రామా ! భక్తమందారమా ! 91

శా. వందిం బోలి భవత్కథావళులనే వర్ణింతు నత్యంత మీ
చందం బొందఁగఁగొందలం బుడిపి నిచ్చల్లభ్చి హెచ్చంగ నీ
వందందుం దిరుగంగబోక దయ నాయం దుండు మెల్లప్పుడున్
పొంకప్రక్రియస్ఫూర్తి పూనికను రామా ! భక్తమందారమా ! 92

మ. అకటా ! తావకకావ్య భవ్య రచనావ్యాపార లీలావిలో
లకసత్స్వాంతుఁడనైన నా పయిని నీలక్ష్మీకటాక్షామృతం
బొకవేళం జనుదేర దేమి ? దయలేదో యోగి హృత్పద్మస
న్మకరందాసవ పానకృద్భ్రమర ! రామా ! భక్తమందారమా! 93

మ. నతమర్త్య ప్రజ వాంఛితార్థ ఫలదాన శ్రీవిరాజన్మహో
న్నత మందారమ వంచు ధీరజను లానందంబునం దెల్ప నే
వ్రతచర్య న్నినువేఁడి వేసరితి బ్రోవన్ రావిదే నీకున
మ్మతమా! తెల్పుము తేటతెల్లముగ రామా ! భక్తమందారమా ! 94

మ. పదపద్యంబు లొనర్చి నీకొసగనో ప్రాఙ్జలి న్నుతింపగ మీ
పదపద్మంబులు భక్తితోడ మదిలో భావింపనో ! యేమిటం
గొదవే దేటికి జాగుచేసెదవు ? కోర్కులు దీర్పవేవేగ ! శా
మదరాతిక్షణ దాచరప్రమద ! రామా ! భక్తమందారమా! 95

మ. క్రతువుల్ సెసెదనంటినా, బహుపదార్థంబిల్లె ! సంధ్యాజప
వ్రతముల్ సేసెదనఁటినా దొరలఁ గొల్వంగావలెం గూటికె
ధృతి నిన్వేడెదనంటినా నిలుప దొక్కింతైనగానీ దయా
మతి నన్నేగతిఁబ్రోచెదో యెఱుగరామా ! భక్తమందారమా! 96

మ. లగునా పాపన తావకన పదధ్యానసిష్ఠాగరి
ష్ఠ గతిన్ వర్తిలుమాకు నిప్పు డతికష్ట ప్రాప్తిఁగావించి బల్
పగవాఖిన్ బలెఁజూడఁగాఁ గటకటా ! పాపంపు గాదోటు ! జి
హ్మగ సమ్రాట్కరకంకణప్రణుత ! రామా ! భక్తమందారమా! 97

మ. నిను నా దైవముగా భజించుటకు నేనిత్యంబుఁ గావించు స
జ్జనతాకర్ణ రసాయన ప్రకటభాస్వత్ సోము లేసాక్షి నీ
వనుకంప న్నినుఁబ్రోచుచుండుటకు నీయైశ్వర్యమె సాక్షి నీ
మనసు న్నా మనుసు న్నెఱుఁగు నిది రామా ! భక్తమందారమా ! 98

మ. జయ మొప్పార నిను న్మదీయ హృదయాబ్జాతంబునం గొల్తు నే
రములెల్లన్ క్షమచేసి ప్రోతు వనుచున్ రాఁగంబునన్ నీదుచి
త్తము నాభాగ్య మదెట్టిదో యెఱుగ తథ్యం బిద్ధసంగ్రామ ధా
మమహాకాయవిరామశాతశర ! రామా ! భక్తమందారమా! 99

మ. జయనారాయణ ! భక్తవత్సల ! హరే ! శౌరే ! జగన్నాయకా
జయ ! సీతాహృదయేశ ! శేషశయనా ! శశ్వద్దయాసాగరా !
జయ ! పీతాంబర ! రామచంద్ర ! జలదశ్యామాంగ ! విష్ణో ! నిరా
మయ ! లీలామనుజావతారధర ! రామా! భక్తమందారమా! 100

మ. సరసప్రస్తుత కూచిమంచి కులభాస్వద్వార్ధి రాకాసుధా
కరుఁడన్ గంగన మంత్రినందనుఁడ ! రంగ త్రిమ్మభూమండలే
శ్వరపర్యాకృత "బేబదల్" బిరుదవిస్ఫాయజ్జగన్నాథనా
మ రసజ్ఞుండను బ్రోవు మెప్డు నను రామా ! భక్తమందారమా ! 101

# కవి చౌడప్ప

అధిక్షేప శతక కర్తలలో విలక్షణ మార్గము ననుసరించిన వారిలో కవి చౌడప్ప ప్రముఖుడు. ఈ కవి ప్రస్తుతించిన మట్లఅనంతభూపాలుడు, తంజావూరు రఘునాథ రాయలు అనువారు పదునేడవశతాబ్ది పూర్వార్ధమున జీవించిరి. ఆత్మ సంబుద్ధి పరముగ నీతిహాస్య అధిక్షేప ధోరణిలో పద్య రచన చేయుటలో ఈతనికి వేమన మార్గ దర్శకుడై యుండును. ఈ ఆధారము ననుసరించి చౌడప్ప పదునేడ శతాబ్ద్యంతమున జీవించి యుండెను.

చౌడప్ప కవి కుందవరము కరణము. ఈతని శతక పద్యములు పండిత పామర లోకమున బహుళ ప్రచారము నొందినవి. ఇతరాంశములతో పాటు అశ్లీలోక్తులు- బూతులు-ఈతని పద్యముల కట్టి ప్రశస్తిని కలిగించినవి. నగ్న సత్యమును నగ్నముగ చెప్పుటలో ఈతడు వేమనకు ఈడు జోడైనవాడు. చౌడప్ప రాజాస్థానము లందు సంచరించి పండిత కవుల సాహచర్యము నొందిన వాడు. విశేష భాషాసాహిత్యజ్ఞాన సంపన్నుడు. కవిత్వ మాధుర్యమును సామాన్య ప్రజలకు ప్రసాదించిన మహానుభావుడు. కవిత్వము-దాని ప్రయోజనము-రసము-పాకము. కందపద్య రచన మున్నగు అంశములను గూర్చి ఈకవి తనకుగల అభిప్రాయములను స్పష్టముగా చాటినాడు.

చౌడప్ప చెప్పిన పద్యములు వేయికి మించి యున్నవని కొందరు పండితులూహించిరి. కాని చౌడప్పశతకముగా ప్రకటింపబడిన ప్రతులలో దాదాపు రెండు వందల పద్యములు కలవు. అశ్లీలోక్తులు-బూతులు కల పద్యములను, అస్పష్టముగ నున్న వానిని పండితులు పరిష్కరించి నూరు, నూటపది పద్యములలో చౌడప్ప శతకమును ప్రకటించిరి. చౌడప్ప పద్యముల పరిష్కరణము జటిలమైన సమస్య-దీనిని గూర్చి అభిప్రాయ భేదము లెన్నియో కలవు. అశ్లీ

మ. క్రతువుల్ సెసెదనంటినా, బహుపదార్థంబిల్లె! సంధ్యాజప
వ్రతముల్ సేసెదనంటినా దొరలఁ గొల్వంగావలెం గూటికై
ధృతి నిన్వేడెదనంటినా నిలువ దొక్కింతైనగాని దయా
మతి నన్నేగతిఁ బ్రోచెదో యెఱుగరామా! భక్తమందారమా! 96

మ. తగునా పావన తావకీన పదధ్యాననిష్ఠాగరి
ష్ఠ గతిన్ వర్తిలుమాకు నిప్పు డతికష్ట ప్రాప్తిఁగావించి బల్
పగవారిన్ బలెఁజూడఁగాఁ గటకటా! పాపంపు గాదోటు! జి
హ్మగ స్త్రీమాటన్నకంకణ ప్రఖ్యాత! రామా! భక్తమందారమా! 97

మ. నిను నా దైవముగా భజించుటకు నేనిత్యంబుఁ గావించు స
జ్జనతాకర్ణ రసాయన ప్రకటభాస్వత్ సుజ్ఞులనాత్మ స
వనుకంప న్ననుఁ బ్రోచుచుండుటకు నీయైశ్వర్యమే సాక్షి నీ
మనసు న్నామనసు న్నెఱుఁగు నిది రామా! భక్తమందారమా! 98

మ. జయ మొప్పార నిను న్మదీయ హృదయాబ్జాతంబునం గొల్తు నే
రములెల్లన్ క్షమచేసి ప్రోతు వనుచున్ రాఁగంటినన్ నీదుచి
త్తము నాభాగ్య మదెట్టిదో యెఱుగ తథ్యం బిద్ధసంగ్రామ ధా
మమహాకాయవిరామశాతశర ! రామా! భక్తమందారమా! 99

మ. జయనారాయణ! భక్తవత్సల! హరే! శౌరే! జగన్నాయకా
జయ! సీతాహృదయేశ! శేషశయనా! శశ్వద్దయాసాగరా!
జయ! పీతాంబర! రామచంద్ర! జలదశ్యామాంగ! విష్ణో! నిరా
మయ! లీలామనుజావతారధర! రామా! భక్తమందారమా! 100

మ. సరసప్రస్తుత కూచిమంచి కులభాస్వద్వార్ధి రాకాసుధా
కరుఁడన్ గంగన మంత్రినందనుఁడ! రంగ త్తిమ్మభూమండలే
శ్వరపర్యాకృత "జేబదల్" బిరుదవిస్ఫాయజ్జగన్నాథనా
మ రసజ్ఞుఁడను బ్రోవు మెద్ది నను రామా! భక్తమందారమా! 101

# కవి చౌడప్ప

అధిక్షేప శతక కర్తలలో విలక్షణ మార్గము ననుసరించిన వారిలో కవి చౌడప్ప ప్రముఖుడు. ఈ కవి ప్రస్తుతించిన మట్లఅనంతభూపాలుడు, తంజావూరు రఘునాథ రాయలు అనువారు పదునేడవశతాబ్ది పూర్వార్ధమున జీవించిరి. ఆత్మ సంబుద్ధి పరముగ నీతిహాస్య అధిక్షేప ధోరణిలో పద్య రచన చేయుటలో ఈతనికి వేమన మార్గ దర్శకుడై యుండును. ఈ ఆధారము ననుసరించి చౌడప్ప పదునేడ శతాబ్ద్యంతమున జీవించి యుండెను.

చౌడప్ప కవి కుందవరము కరణము. ఈతని శతక పద్యములు పండిత పామర లోకమున బహుళ ప్రచారము నొందినవి. ఇతరాంశములతో పాటు అశ్లీలోక్తులు- బూతులు-ఈతని పద్యముల కట్టి ప్రశస్తిని కలిగించినవి. నగ్న సత్యమును నగ్నముగ చెప్పుటలో ఈతడు వేమనకు ఈడు జోడైనవాడు. చౌడప్ప రాజాస్థానము లందు సంచరించి పండిత కవుల సాహచర్యము నొందిన వాడు విశేష భాషాసాహిత్యజ్ఞాన సంపన్నుడు. కవిత్వ మాధుర్యమును సామాన్య ప్రజలకు ప్రసాదించిన మహానుభావుడు. కవిత్వము-దాని ప్రయోజనము-రసము-పాకము. కందపద్య రచన మున్నగు అంశములను గూర్చి ఈకవి తనకుగల అభిప్రాయములను స్పష్టముగా చాటినాడు.

చౌడప్ప చెప్పిన పద్యములు వేయికి మించి యున్నవని కొందరు పండితులూహించిరి. కాని చౌడప్పశతకముగా ప్రకటింపబడిన ప్రతులలో దాదాపు రెండు వందల పద్యములు కలవు. అశ్లీలోక్తులు-బూతులు కల పద్యములను, అస్పష్టముగ నున్న వానిని పండితులు పరిష్కరించి నూరు, నూటపది పద్యములలో చౌడప్ప శతకమును ప్రకటించిరి. చౌడప్ప పద్యముల పరిష్కరణము జటిలమైన సమస్య-దీనిని గూర్చి అభిప్రాయ భేదము లెన్నియో కలవు. అశ్లీ

లోక్తులను-'బూతు' పదములను పరిష్కరించుట కంటె-వానిని సూచ్య ప్రాయముగ నొనర్చి ముద్రించుట వలన చౌడప కవితా ప్రశస్తిని గ్రహించుటకు పాఠకుల కవకాశము కలుగు నని కొందరి అభిప్రాయము. చౌడప్ప వ్రాసినది వ్రాసినట్లే ముద్రించుట అశ్లీల సాహిత్యమును ప్రచార మొనర్చుట వంటి నేర మనియు నాగరికతకు అది కళంక మనియు వానిని పరిష్కరించుట సముచిత మైన పద్ధతి అనియు మరి కొందరి మతము.

అశ్లీలోక్తులు గల కావ్యములను. చాటపద్యములను, ప్రకటించు సందర్భ మున పండిత విమర్శకులలో వాదోపవాదములు ఎన్నియో జరిగినవి-పదము లను సంస్కరించక, పరిష్కరించక, సూచ్య ప్రాయమొనర్చి ప్రకటించు విధానమే కవి కవితారీతిని గ్రహించుట కవకాశము కలిగించుననుట అంగీకృతమైన విషయము. ఈ శతకములోని పద్యములీ దృష్టితో కొన్ని ప్రకటింపబడినవి.

చౌడప్ప ప్రాచీన కవితా రీతులలో సుపరిచితుడు, తిక్కన పెద్దనాదు లితని అభిమాన కవులు. అలనాడు కందపద్య రచనలో తిక్కన సిద్ధ హస్తు డనియు, ఆ తరువాత అట్టి ప్రశస్తి తనకే లభించినదనియు చౌడప్ప ఆత్మస్తుతి ప్రశంసా పూర్వకముగ చెప్పికొనుటవలన కందపద్య రచనలో చౌడప్పకు గల ప్రావీణ్యము స్పష్టమగుచున్నది. కంద పద్యపు నడక, పూర్వార్ధ పరార్థభాగ ములలో భావములను వివిధ పద్ధతులలో కూర్చిన విధాన మితని కంద పద్య రచణ శిల్పమును తెలియజేయును. నీతులను బూతులను కూర్చి చౌడప్ప తనకు గల అభిప్రాయములను స్పష్టాతిస్పష్టముగ చాటినాడు. బూతుల రూపమున నీతుల నుపదేశించుట ఈతని వైశిష్ట్యము. చతురమైన హాస్యమును పోషించుట యందును చౌడప్ప సమర్థుడు. కామము-శృంగారము, గుహ్యాంగములు-రతిక్రీడ. రసిక జీవనము మున్నగునవి ఈతని బూతులకు ఆలంబనములు. సామాన్య పదము లతో అశ్లీల భావములను వ్యక్తీకరించుట. బూతు మాటలతో అశ్లీలార్థమును. నగ్న రూపమున వ్యక్తీకరించుట-ఉపమానములను వానికి అనుగుణముగ.

గ్రహించుట - జానపద హావభావ రీతుల ననుకరించుట - మున్నగునవి చౌడప్ప బూతు కవితలోని విలక్షణాంశములు.

సమకాలిక శతక కర్తలవలె చౌడప్ప కూడా నాటి వ్యవస్థనే కవితా వస్తువుగ నెన్నుకొనెను పూర్వ నీతిశతకకర్తల మార్గమున సజ్జన దుర్జన పద్ధతులను వివరించి నీతుల నుపదేశించెను. దొరలు - కరణములు - దానశౌర్య గుణవిహీనులైనవారిని, అధికారులు వారి దుర్నీతిని నిశితముగ విమర్శించి కర్తవ్యోపదేశ మొనర్చెను. వివిధ అధికారులు - దానశౌర్యగుణము - కవిత్వము సంగీతము మున్నగువిద్యలు - రసిక జీవనము - కులవృత్తులు - జాతులు - దైవభక్తి - విధి - దైవబలము - మొదలగు అంశములను గూర్చి వివరించిన విధము విమర్శించిన రీతి అధిక్షేప శతక కర్తల కంటె భిన్నమైనది.

రసిక జీవనము - వితరణగుణము - దాతలు పసగల అనేకాంశములు వ్యక్తీకరించుపట్ల చౌడప్పకు గల లోకజ్ఞత రసికతాదృష్టి పరిశీలింపదగినది. మీసము పస మగమూతికి, మాటలు పస నియ్యోగికి మొదలగు పద్యము లిట్టివి.

వితరణగుణము - దానశీలుర గూర్చి కవి చౌడప్ప దాదాపు ఇరువది అయిదు పద్యములు రచించెను. కొన్ని పద్యములో దానగుణమును దాతలను సముచితముగ ప్రశంసించెను. వితరణ గుణ హీనులమ కసిదీర విమర్శించెను. ఈయగలేని మగముండ మూతికి మీసమేల అని అధిక్షేపించెను. లోభి జనమును బూతు పదములతో నిందించిన పద్యములలో అధిక్షేపముతో పాటు హాస్యాచమత్కృతి దర్శింపదగినది.

భావానుగుణమైన శక్తిమంతమైన భాషలో చౌడప్ప రచనసాగినది. మాండలికములు - నూత్న పదములు - పదబంధములు - నుడికారములు - సామెతలు లోకోక్తులు - ఉపమానములు, ఈతని భాషకు, భావ వ్యక్తీకరణకు శక్తిని పుష్టిని చేకూర్చినవి. వీనిని అన్నింటిని బూతులలో రంగరించుటయే చౌడప్ప విలక్షణ మార్గము. ఇదియే ఈతని కవితకు 'పస' ను కూర్చినది.

వేమన పద్యములను ఆతని శిష్యులు - శిష్యప్రాయులు, అభిమానులు కవితా చాపల్యము కలవారు అనుకరించి పద్యములు రచించి ఆతని పేర ప్రచార మొనర్చినట్లే కొందరు చౌడప్పపేర పద్యముల నల్లుటకు మరికొందరు ఆతని వలెనే కవిత చెప్పుటకు ప్రయత్నించిరి - పద్యపు నడక, ఎత్తుగడ, ఛందస్సు, శైలి, వస్తువిన్యాసరీతులు - మున్నగువానిలో కొంత సామ్య ముండుటవలన పాఠకులు, అభిమానులు, ఒక శతకమునందలి భావమును పదములను మరియొక శతకమున చేర్చి చదువుట వలన కొన్ని శతక పద్యములు కూడ ఒకదానిలో నొకటి కలిసిపోయినవి. జనబాహుళ్యము నందును, తత్కారణముగ ఒక శతక పద్యము వేరొక శతక పద్యముగా ప్రచారము నొందినది. చౌడప్ప శతకము నందలి కొన్ని పద్య పాదము లిట్టి మార్పుల నొంది గువ్వల చెన్న శతకమున చేరినవి. ఈ కారణము వలనను గువ్వల చెన్న శతకము కవి చౌడప్ప శతకముతో పాటు బహుళ ప్రాచుర్యము నొందగలినది.

# కవి చౌడప్ప శతకము

శ్రీకారము పద్యాదిని
ప్రాకటముగ నుండెనేని బహుళదోషములన్
బోకడఁచి శుభము లొసఁగును
గాకోదర కుందవంపు కవి చౌడప్పా! 1

శ్రీపతి పుల్లూరి పట్టణ
గోపాలుఁడు సదయుఁడగుచుఁ గుంతీసుతులన్
గాపాడు నటులు మమ్మును
గాపాడును కుంద... 2

ఉండఁగ నిచ్చును నీపైఁ
బాండవ మధ్యముని మీఁది పక్షము గోపా
లుండగు పుల్లూరివాసుఁడ
ఖండితయశ కుంద... 3

ఎంతెంతో దీర్ఘాయు
ష్మంతుఁడవై మిగుల బుద్ధిమంతుఁడవై శ్రీ
మంతుఁడవై మను లక్ష్మీ
కాంతుని కృపఁ గుంద... 4

వెయితల లొక వెయికన్నులు
వెయిచేతులు పదములొక్క వెయిగల పురుషుం
డిషు వలయును దీర్ఘాయువు
గయికొమ్మని కుంద... ౫

మందరగిరిధర సనకస
నందన ప్రముఖమునిగణ నారదనుతా గో
విందా యనువారు ముక్తిం
గందురు గద కుంద... 6

వనజభవాదులుఁ దాఁ లోక
పనిఁ బూనినవేళ మొదటఁ బ్రార్థన గణనా
థునిఁ జేయకున్న సాగుట
కనము వినము కుంద... 7

**పండిత ముఖ్యులు భారవి**
దండియు భవభూతి కాళిదాసులు; నుతి యొ
వ్వండు నిడుఁ గృతులవారి క
ఖండితయశ కుంద... 8

వినుభారవి బిల్హణు నా
చనసోముని మాఘకవినిఁ జతురుని శ్రీనా
థుఁ నుతింతు సుకవివరుఁ ది
క్కనఁ దలఁతునుఁ గుంద... 9

పెద్దనవలెఁ గృతిఁ జెప్పిన
పెద్దనవలె, నల్పకవిని పెద్దనవలెనా?
ఎద్దనవలె మొద్దనవలె
గద్దనవలెఁ గుంద... 10

అందములై వినవినఁ జవ
కందములై మంచి నీతి కందములైతే
అందరు చదువుదు రభినవ
కందర్పా కుంద... 11

ముందటి దినములలోపల
గందమునక్కు సోమయాజి ఘనుఁడందురు నేఁ
డందఱు ఘనులందురు నను
కందమునకుఁ గుంద... 12

కందము నీవలెఁ జెప్పే
యందము మఱిగాన మెవరియందును గవిసం
క్రందన యసదృశనూతన
కందర్పా కుంద... 13

కందములఁ బ్రాసగణయతు
లందముగాఁ గవిత నెంద అల్లరు విను నీ
కందంబులు రసవన్మా
కందంబులు కుంద... 14

కందంబులు సకలజనా
నందంబులు సరసమధుర నవరసఘటికా
బృందంబులు నీ కవితా
కందంబులు కుంద... 15

మునుపటి సుకవుల నీతులు
జననుతములు, కుందవరపు చౌడుని నీతుల్
వినవినఁదేట తెనుంగై
కనఁబడుఁగద కుంద... 16

నీతులకేమి యొకించుక
బూతాడక చౌరకు నవ్వు పుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా కుంద... 17

బూతని నగుదురు తమతమ
తాతలు ముత్తాత మొదలు తన తరముల వా
రేతీరున జన్మించిరొ
ఖ్యాతిగ మఱి కుంద... 18

పదినీతులు పదిబూతులు
పదిశృంగారములు గల్గుపద్యములు సభం
జదివినవాఁడేఁ యధికుఁడు
గదరప్పా కుంద... 19

లంజలు రాకుండిన గుడి
రంజిల్లదు ప్రజల మనసు రాజిల్లదుగా
లంజల నేల సృజించెను
గంజజుఁడిలఁ గుంద... 20

పడఁతుకయును పంకాయయు
నడరు సమూలంబు మధుర మందుల లోఁగా
తొడమొదలుఁ దొడిమ మొదలుం
గడుమధురము కుంద... 21

వేయాలు వగల కూరలు
గాయ లనేకములు ధాత్రిఁగల వంటలలో
నాయకములురా కాఁకర
కాయలు మఱి కుంద... 22

అంభోజాక్షులలోపల
రంభయొకడు నందగత్తె, రాగంబులలో
గాంభీర్యముగల రాగము
కాంభోజియె కుంద... 23

నా నీతి వినని వానిని
భానుని కిరణములు మీఁదఁ బాఱని వానిన్
వానను దడియని వానిని
గానమురా కుంద... 24

కాకులు వేవేలొక్కట తు
పాకి రవము విన్న నులికి పడవా మఱి నా
ధాకకు నగు నాలాగే
కాకవులకుఁ గుంద... 25

విద్దెల మేలెఱుఁగని నరుఁ
డెద్దే సరి గడ్డి తినెడి దెద్దా పసులం
దెద్దుకుఁ గొంత వివేకము
కద్దిప్పా కుంద... 26

పెద్దల మంచును రాజుల
వద్దను గూర్చుండి నీచ వాక్కులు పలికే
పెద్దలు భువిలోఁ బీతిరి
గ్రద్దలుగా కుంద... 27

తారాజ సభల మెలఁగుట
తారసికతఁ జెలగుచెల్లఁ దన బ్రతుకునకా
పూ రే దేఱుక తినదా
కారడవుఁల గుంద... 28

కుక్కుటము లూరఁబందులు
కుక్కలు తమ కడుపు పెంచుకొనవా ధరలోఁ
[illegible] మనుపఁ జాలమి
కక్కూరితి కుంద... 29

ఉందు రుపకార హీనులు
కొందరు దొర వద్ద, శివుని - గుడిపై నుండే
నందుల వలె బిగియించుక
కందములను గుంద... 30

బుద్ధి గలుగు దొరయైతే
ఇద్దరికొక పారుపత్తె మీఁదగదు సుమీ
ఇద్దరి యెడలను నష్టము
కద్దప్పా కుంద... 31

దొర వద్ద నెవడు చనవరి
నరు లతనికిఁ బ్రియము సేయన్యాయము ధరలో
హరివాహనమని మ్రొక్కరె
గరుఁడునిఁగని కుంద... 32

దొర యెంత ప్రౌఢుఁడైనను
సరసను నియ్యోగి లేకసాగదు; వలదా
శరమెంత వాఁడియైనను
గరవై ఖరి కుంద... 33

కరణము గావలె సరసుఁడు
కరణ మవశ్యంబు సకల కార్యంబులకున్
గరణము ముల్లోకపతి
కరణము కద కుంద... 34

కరణంబని తను నడిగినఁ
గరుణ విలిచి యొక్క కాసు కవి కియ్యనిచోఁ
గరణము పేరు సహించే
కరణమురా కుంద... 35

ధరఁగవి క్షుమాన్యంబులు
హరియింపఁగ లెక్క వ్రాసె సంపించెండి యౌరా
కరణము పేరు సపిండీ
కరణమురా కుంద... 36

దేవుఁడు దేవుండనఁగా
దేవుండా దీవిసుండి దిగవచ్చెనా
ఈవిగల దొరయె దేవుఁడు
తావంగను కుంద... 37

సముఖము దొరకక దొరికెన
సుముఖుండై తన్ను గాంచఁ జూడని దొరతో
నమరునె పేరలు మనవికి
గమకించుట కుంద... 38

రాచతనానకుఁ జందెపుఁ
బోఁచఁటురా సుఖుతు రిపులఁ బోరి గొనుటయు జే
చాచిన నిచ్చుట శరణనఁ
గాచుట రా కుంద... 39

ఇయ్యఁగ నిప్పింపఁగల
యయ్యలకేగాని మీస మందరికేలా
రొయ్యకు లేదా బారెఁడు
కయ్యమునకుఁ గుంద... 40

తగుపాటి కవుల కియ్యని
మగేముండల కేల గలిగె మూతిని మీసల్
దిగగొఱుఁగ డాయె మంగలి
ఖగరాడ్బల కుంద... 41

[illegible]ండగులాములు యాచక
తడంబుల కియ్యఁజేరు తము దండించే
ముండల కిత్తురు ధగిడీ
గండలు మఱి కుంద... 42

బియ్యమున మెఱక యుండిన
వెయ్యాఱున్నట్టు దోఁచు విను వాతలతోఁ
గొయ్యగులా మొం డుండను
గయ్యమునకుఁ గుంద... 43

ఏమియ్యని దొర పద్యము
నామం బిడి చదువుచెల్ల నాలుక తీఁటా
రామకథా భారతమా
కామింపఁగఁ గుంద... 44

అత్తముల కాకఁ దొలఁగిన
దత్తరపకి రాజునీతిఁ దప్పిన సుజనుం
డత్తరిఁగతఁ దొలఁగవల జ
గత్తునమిఱి కుంద...... 45

వేసరక యిచ్చు దాతకుఁ
గాసునుమీ మేరువంత కనకంబై సన్
గాసే మేరువు లోభికి
వాసిగ మఱి కుంద... 4[illegible]

[illegible]తియిట్టు [illegible]
చెతనొందుదు వారి మోము [illegible]
అతిసార రోగపీడితు
గతిసప్పు కుంద... 47

ఆకొని వచ్చిన యతిథిని
వాకిట నిలఁబెట్టి యింట వాఁడశనము దా
నే కుడువ మన్నుగుడుచుట.
గాకేమిర కుంద... 49

తినఁజాలక యేధర్మము
గనఁజాలక పరమలోభి కష్టుడు గూర్చె
ధన మెల్ల నేల పాలని
గనుమప్పా కుంద...

ముండాకొడుకుల సంపద
దండుగులకె గాని దానధర్మములకు రా
కుండు మహీమండలమున స
ఖండితముగ కుంద... 50

కులశీల మానుషాదులు
గలనరులకుఁగాక కీర్తి కత్తరి కేలా
తలుపేల చాప్ర గుడిసెకుఁ
గలదే భువి కుంద...... 51

అనయము పేదల పట్టున్
వినయముగలవాఁడు భువిని వెలయుచు నూతెం
డ్లను నింద మనుచుఁబరముం
గను నప్పా కుంద...... 52

అతిథుల బంధుజనంబుల
యతులను దిము నడుగవచ్చు యాచకతతులన్
క్షితిఁ బూజించునరుడు స
ద్గతిఁబొందును గుంద

తనసతి యిడఁగా మనుమలు
తనయులు తలిదండ్రులు నన్న దమ్ములు బంధుల్
దినదినమును భుజియించుట
ఘనవిభవము కుంద... 54

తనయునికిని బరదేశికిఁ
దానమొసగిన నొక్కరీతి మం దిడియెడు నా
వనితను బుణ్యాంగన యనె
ఘనులందరు కుంద... 55

దొరకైనఁ జేపకైనను
వెరవరి యిల్లాలికైన వేశ్యకునైనన్
గరిగరికతనము బాగగుఁ
గరుణాంబుధి కుంద... 56

మనుపాడి వెనుక లేదను
పెనుగొంటె గులాము నోరు పీతిక గుంచే
యనితలఁచి ఘనుఁడు సత్యమె
కనవలెరా కుంద... 57

మూలికక్రియ కొడిగినదే
నాలిక సత్యంబుగలదె; నడిపినవాఁడే
యేలిక, వరమిచ్చినదే
కాశికరా కుంద... 58

పరవిత్తము గోమాంసము
పరసతి తన తల్లి యనుచు భావించు నయా
నరుఁడు నరుఁడా రెండవ
కరివరముఁడె కుంద... 59

కొండవలె పెనిమి టుండఁగ
మిండని జవి మరగి కడలమీఱుచుఁదిరిగే
రండను యమపురిఁ జీల్తురు
కండలుగా కుంద... 60

వగలాడి చెంతనుండిన
మగవానికి నూరకుంట పస సయ్యేనా
తగు సరసమ్ముల నాడక
ఖగపతిబల కుంద... 61

వగలాఁడికి ముసలాతఁడు
మగఁడైతె దానిచింత మఱియింతంతా
జగదీశు డు తానెఱుఁగును
ఖగపతిబల కుంద... 62

సారములెవి సంసారికి
ఘోరములెవి గోపురంపుఁ బ్రతిమకు, బిప్పిన్
నారములెవి, గుడిసెకు బ్రా
కారములెవి కుంద... 63

పులినాకి విడుచుదైవము
గలనాటికి, దైవబలము గలుగని వేళం
గలహించి గొఱ్ఱె కఱచును
గలియుగమునఁ గుంద... 64

పాండవు లిడుములఁ బడరే
పాండవ్యోఁడు కాఱుతబడఁడె మహిఁ బ్రాకృత మె
ప్వాండోపు మీఱి చనఁగ స
ఖండితయశ కుంద... 65

[illegible]ంజకు ధన మీఁ దలఁతురు
రంజన గలదైన; మూఢులాలే యైనన్
గింజలు పడెఁ డీజాఁగు.
గంజికి మంటి కుంద... 66

పొగఁద్రాగని నరుఁ బ్రతుకును
పొగడంగా నియ్యలేని భూపతి బ్రతుకున్
మగఁడొల్లని సతి బ్రతుకును
నగవు సుమీ కుంప... 67

మారుని గేరెఁడు రూపము
సౌరస్యముఁ గల్గు విభులు సముకూడుటకున్
వారిజగంధుల పూజలు
కారణమురా కుంప... 68

గుడిసెయు మంచముఁ గుంపటి
విడియములు పొగాకు రతికి వెంపరలాడే
పడఁతియు గల్గినఁ జలి యె
క్కడిదప్పా కుంప... 69

మనుజుండు నేర్పరియైతే
కొనవలెరా మంచి ముద్దు గుమ్మను లేదా
మునివృత్తినుండి మోక్షము
గనవలెరా కుంప... 70

అప్పయిన దీసి తినవలెఁ
ఒప్పుగను మరికూడదు; పయిను భామామాతలన్
మెప్పించవగ వలె; జలువలె
తప్పఁగవలె కుంప... 71

పండుగ పండుగ యందురు
పండుగ దినమేమి, వయసు పడుచుల ప్రక్కన్
పండిన దినమే పండుగ
ఖండిత యశః గుంద... 72

దినముల లోపల నుత్తమ.
దినమే తద్దినము; నాఁటి తిండికి సరి యే
దినములను వెదకి చూచినఁ
గనమప్పా కుంది... 73

పప్పేపస బాపలకును.
ఉప్పేపస రుచులకెల్ల, నువిదల కెల్లన్
గొప్పేపస; దంతములకుఁ
గప్పేపస కుంద... 74

బట్టలుపస తుఱకలకును
గిట్టలుపస గుఱ్ఱములకుఁ క్షితినాథులకుం
బొట్టలుపస, చెఱువులకును
గట్టలుపస కుంద... 75

మాటలు పస నియోగికిఁ
గోటలు పస దొరలకెల్ల; ఘోటకములకున్
దాఁటులు పస ; బెబ్బులులకుఁ
గాఁటులు పస ; కుంద... 76

వానలు పస పైరులకును ;
సానలు పస వజ్రములకు ; సమరంబులకున్
సేనలు పస ; మృగజాతికిఁ
గానలు పస ; కుంద... 77

నారాయణ యని సుతునిం
బేర నజామిళుఁడు వేగ పిలిచిన ముక్తిం
జేరిచెఁగద హరినామము
గారవమునఁ గుంద... 84

చిత్తము శ్రీహరిపైఁ గిం
చిత్తును నిలుపంగ లేని చెడుగుల మడియన్
మొత్తి యమభటులు పొడుతురు
కత్తులతోఁ గుంద... 85

తులసీదళముల హరిపద
జలజంబులు పూజసేయు సరసుల యమదూ
తలు చూచి యేమిసేయం
గలరప్పా కుంద... 86

ముంతెడు చమురున హరి క
త్యంత మనశ్శుద్ధి దీప మనుదిన మిడువాఁ
డంతమునఁ జేరు లక్ష్మీ
కాంతునిపురిఁ గుంద... 87

అలసటఁ వేసటనె నం
గలనైనను నగుచునైన గరుడధ్వజునిం
దలచిన వారలఁ జేరవు
కలుషంబులు కుంద... 88

తనమదిలోపల దశరథ
తనయులలోఁ బెద్దవాని దలచినఁ జన్మం
బనయంబు పావనం బని
ఘను లందురు కుంద, 89

దశమినొక పూట నేకా
దశి రేపగ నుపవసించు ద్వాదశినొక పూ
టశనము గొను పుణ్యుడు లో
కశరణ్యుఁడు కుంద... 90

పరగడుపున సభలోపల
తరుణుల యెడ భక్తమైనతరి నొక విడెముం
దొరకని నరునకు సౌఖ్యము
కరువప్పా కుందవరపు కవిచౌడప్పా

ఏపాటిదైనను ప్రక్కకు
దాపొక్కటి లేకపోతె తరమటరా యీ
పాపపు దినములు గడుపగ
కాపాడుము కుందవరపు కవిచౌడప్పా. 92

యతికి మరి బ్రహ్మచారికి
నతులితముగ విధవముండ కళ్వంబునకున్
సతతము మైథునచింతయు
గతిదోపదు కుందవరపు కవిచౌడప్పా 93

ముదితచను మెత్తనయినను
యధికారము మెత్తనయిన నాడేని దొరకున్
మది మత్తనయిన రోతురు
గదరప్పా కుందవరపు కవిచౌడప్పా 94

అంభోజాక్షుల లోపల
రంభే కడుచక్కనిది రాగంబులలో
గాంభీర్యమైన రాగము
కాంభోజే కుందవరపు కవిచౌడప్పా 95

తలవెంట్రుక లందరురా
యిరలా యిబ్బులవాయి ప్రయిట్లసవాం
మోరవంద్రుకొం తరదరురా
కలియుగమున కుందవరపు కవిచౌడప్పా 96

లంజెయును బీజకాయయు
ముంజెయు బాలోమున జాలమాహము గొలుపున్
రంజనచెడి ముదిరిన వెను
కం జూడరు కుంద... 97

ప్రస్తావోచిత పద్యము
మెస్తే యెవడయిన జదువు మేదిని మీరం
ప్రస్తుత పద్యము చదువుట
కస్తిగదా కుందవరపు కవిచౌడప్పా. 98

దొరగావలె ధర్మాత్ముడు
సిరిగావలె బ్రజకు బేరుసీమల నెఱుగం
గురి గావలె గులసతి సి
గ్గరికావలె కుందవరపు కవిచౌడప్పా. 99

పరసతిగవయగ జనుచో
నరుణోదయవేళ స్నానమాడగ జనుచో
బొరిబొరి వణకు నశక్తుడు
కరుణాంబుధి కుందవరపు కవిచౌడప్పా. 100

కొట్టగవలె బరిదళముల
గట్టగవలె భూమి దానకర్ణుని వలెనే
పెట్టగవలె నిల రాజును
గట్టిడి యిధి కుందవరపు కవిచౌడప్పా. 101

# పోలిపెద్ది వేంకటరాయకవి
# వేణుగోపాల శతకము

పోలిపెద్ది వేంకట రాయకవి శతక వాఙ్మయ చరిత్రలో విశిష్ట స్థానము నలంకరించినవాడు. ఈతడు కార్వేటి సంస్థాన కవులలో ప్రముఖుడు. రాజాశ్రయము నొందినను స్వతంత్ర దృక్పథముతో జీవించినవాడు. తిట్ల దండకము-లావణ్య శతకము - వేణుగోపాల శతకము లీతని ప్రశస్తకృతులు - దండక ప్రక్రియను దూషణోక్తి ప్రధానముగ రచించిన వారిలో వేంకటరాయకవి ప్రముఖుడు. వ్యక్తిగత ద్వేషమును క్రోధమును మూర్తీభవించుకొనిన దండకమిది. లావణ్య శతకము శృంగార ప్రధానమైనది. వేణుగోపాల శతకము నాటి అధిక్షేప శతకములలో తలమానికమైనది. భక్తి నీతి అధిక్షేప గుణసమ్మిశ్రితమైనను అధిక్షేప ప్రధానమై సమకాలిక వ్యవస్థకు, దర్పణము పట్టుచున్న కృతి ఇది.

కార్వేటి నగర సంస్థానమున వేంకటరాయ కవి సముచిత గౌరవస్థానము నొందియుండెను. ఏ అధికారుల వలన అనాదరము నొందెనో తెలియదు. కాని సంస్థానోద్యోగులను గూర్చి ఈ కవి వచించిన నీతులు అధిక్షేపములు నిరసన పూర్వకముగ నున్నవి. ప్రభువులు, అధికారులు మున్నగువారి వర్తనము నీతడు గమనించి కొన్ని విశేషములను సామాన్యీకరించి ఈ అధిక్షేప శతకమును రచించెను. రాజులు - రాజోద్యోగులు - వారి వర్తనమును గూర్చి ప్రత్యేకముగ శతకము రచించిన వారిలో వేంకటరాయకవి ప్రముఖుడు సంస్థాన వ్యవస్థను ప్రత్యేకించి చెప్పుటలో వేంకటరాయ కవి అధిక్షేప ధోరణి కూడా ప్రత్యేకముగ గమనింప దగినది. ప్రభువు నామమును గాని అధికారుల నామమునుగాని ఎచ్చటను పేర్కొనలేదు. ఒక వ్యక్తిపట్ల గల ద్వేషభావమును కూడ వ్యక్తీకరించలేదు. అధికారుల వర్తనమును ప్రత్యక్షముగ పరిశీలించి లోకానుభవమునకు

వచ్చిన అంశములను సామాన్యీకరించి చెప్పిన ధోరణిని నిశితముగ పరిశీలించ దానిలో వ్యక్తిగతముగ అనుభవించిన వైఖరి తొంగి చూచుచున్నది. వ్యక్తులను కాక వ్యవస్థనే విమర్శించుటలో వేంకటరాయకవి విజ్ఞతను చాటెను. ఈ కవి విమర్శకు గురియైన రాజోద్యోగులలో ఖిల్ బక్షి-ముసద్ది-దివాను మున్నగువారు ముఖ్యులు. - వీరి ప్రసక్తి వచ్చినపుడు వేంకటరాయకవి రాజనీతి విశేషముల నెన్నింటినో పేర్కొనెను. రాజు మంచుడైనను, మంత్రి దుర్మంత్రపరుడైనను రాజ్యపాలన మస్త వ్యస్తమని కవి ఉదాహరించుట ప్రభువునకు సుబుద్ధియగు మంత్రి ఉండుట అవసరమని సూచించుట ఇట్టిది. రాజ్యాధిపతి ఉదారహృదయుడై అర్థిజనము నాదరించి సత్కరింప బూనినను మంత్రులు సాగనీయక వారికి దుర్భోధలొనర్చు చుందు రని వేంకటరాయకవి విమర్శించెను - రాజాస్థానములో వివిధ అధికారులను, కవిపండితులను గౌరవించని వేశ్యలను కూడ ఈ శతకకర్త ఒక సందర్భములో విమర్శించెను. పాలనలేని భూపతి వలన కవి పండితులకు విద్వాంసులకు దాతలకు ప్రాణ సంకట మనియు రాజాస్థానములలో మూర్ఖులు చేరినపు డీ స్థితి తప్పదనియు నాటి వ్యవస్థను తూలనాడెను - ఇటువంటి పరిస్థితులలో రాజసేవయే ప్రమాదకరమని వేంకటరాయకవి భావించెను. కవి పండితుల నీసడించిన వారిని ముచ్చెలతో కొట్టి శిక్షింపవలయు నని ఈ కవి భావించెను. దొరసొమ్ము తిని అవసరమునకు రానివారు, పరకాంతల నాసించువారు, దాతను దీవించక వెడలిపోవు యాచకుడు మున్నగు వారును ఇట్టి శిక్షకు అర్హులని కవి అభిప్రాయము - వివిధ రంగములకు చెందిన వ్యక్తులు - దుర్వర్తనము మూర్తీభవించిన వారు - కపట యోగులు - అజ్ఞులు - ఆత్మాభిమాన విహీనులు - మందబుద్ధులు-ఉన్నత స్థానముల నధిష్ఠించిన మందమతులు మున్నగువారిని గూర్చియు ఈ కవి నిశిత విమర్శ లొనర్చెను.

సాంఘిక వ్యవస్థను పరిశీలించినపుడు కొన్ని కొన్ని అంశములను యుగ ధర్మములుగా కవి భావించుట గమనింపదగినది. వీనిలో వర్ణసాంకర్యము ప్రధానమైనది. తండ్రి మధ్వాచారి తనయుడు దారాధ్యుండు - తల్లి రామానుజమతస్థురాలు అని వర్ణ సాంకర్యమును గూర్చి కవి చమత్కరించెను. అసమర్థులున్న తత్స్థానము నొందుటకు కూడ కలియుగ ధర్మమే కారణమని కవి విమర్శించుట పరిశీలింప దగినది. కలియుగమున వేశ్యలకు గలిగిన ప్రాధాన్యమును

పురస్కరించుకొని కవి ఆడపుట్టువు అందును 'లంజె' గా జన్మించుట మేలని కవి భావించెను.

ఈ శతకమున గల కవి పండితుల గూర్చిన ప్రశంసలు విమర్శలు నాటి పరిస్థితులను వ్యక్త మొనర్చుచున్నవి. అరసికులైన రాజుల నాశ్రయించి వారికి కృతుల నొసగ కూడదని వేంకటరాయ కవి అనేక సందర్భములతో స్పష్ట మొనర్చెను. అది 'రోత' గలిగించు పట్టని పరిహరింప దగినదనియు సూచించెను. కవి శాపానుగ్రహ శక్తియుక్తుడై యుండవలయు నని వచించి నపుడు వేంకటరాయ కవికి వేములవాడ భీమకవి, అడిదము సూరకవి ప్రభృతులు మనోరంగమున నిలచి యుందురు. సుకవి ఆగ్రహమునకు గురియైన వ్యక్తి ఇంద్రుడైనను బిచ్చమెత్త వలయుననియు అనుగ్రహమునకు పాత్రుడైనవాడు అతి దీనస్థితి నున్న బీదవాడైనను అందల మెక్కవలయునని కవి వాక్కున కంతట శక్తి యుండ వలయునని వేంకటరాయ కవి వచించెను. సుకవిత అజ్ఞునకు మోటువానికి పనికి రానిది-కవులు అజ్ఞానుల నాశ్రయించక చిత్ర ప్రబంధాదుల రచింప వలయునని ఉపదేశించెను కవుల కీయ పలుపని కన్నుగీటు లోభుల నీ కవి నిశితముగ మందలించెను.

అనే కాంశముల నొకచో చేర్చి విమర్శించుట పూర్వశతక కర్తల అనుకరణ ధోరణి - ఈ శతకము నందును కనిపించును. రోత జుగుప్స కలిగించు నట్టివి - ఉభయ భ్రష్టత్వము - పెద్దమ్మ విడిచి చేయు స్థానములు ఆదుర్మ జీవనము, దుర్భర జీవనము, నడుమంత్రపుసిరి మొదలగు వానికి సంబంధించిన అంశము లిట్టివి.

చౌడప్ప 'పస' గల వివిధాంశములను ప్రత్యేకముగ పేర్కొనినట్లు ఈ కవి వీనిని ఒకచో చేర్చి విమర్శించెను. కవివరుల నవమానించుట పంచాంగములు మోయుట ఇట్టివి. రాజ సన్మానము సంగీత సాహిత్యాభిరుచి- అగ్ర జన్మము- అనుకూలవతి యైన భార్య-మొదలగునవి భూతల స్వర్గ సుఖదాయకములని కవి వివరించెను. అలు గయ్యాళైన కోడలు దొంగైన హొరుగెండ్లు వెంబడి తిరిగి గృహ కృత్యములు చెప్పి పెద్చెడి చెల్లెలైన నున్నచో వాని జీవనము దుర్భరమని కవి వచించెను. నత్తు లేని ముత్తైద ముక్కు - పెద్దిమ్మ

విడిది చేయు స్థానమట ! వేశ్యాతనయు డబ్బుకు పెట్టు తద్దినము ఉభయ భ్రష్టత్వము వంటి దవట !

సామాన్య ధోరణిలో సాగిన నీతి బోధనలు-పూర్వ నీతి శాస్త్ర గ్రంథ శ్లోక భావములను స్ఫురింపజేయును. మద్యపాన మొనర్చువారితో స్నేహము- శాత్రవు నింట భోజనము- దేవ భూసుర వృత్తి అపహరణము మున్నగునవి పరిహరింప దగినవని కవి ఉపదేశించుట ఇట్టివి. సామాన్య వ్యక్తులకే కాక రాజులకును సంబంధించిన నీతులను కవి కొన్నింటిని పేర్కొనెను. కవి లోకజ్ఞత వలన, రాజస్థానములలో సంచరించుట వలన వీనిని గ్రహించి యుండును. పరవధూ కాంక్షవలన కలుగు అనర్థముల వివరించిన సందర్భ మీతని లోకజ్ఞతను నిరూపించును.

సమకాలిక సామాజిక వ్యవస్థలోని వివిధ రంగములను కవి కన్నులకు కట్టినట్లు వర్ణించెను. జానపదులు - ప్రాకృత జనము-వివిధ వృత్తుల వారు-వారి వేషభాషలను వర్ణించెను- ఈడిగ-ఉప్పరి మున్నగు వృత్తుల వారి వర్ణన లిట్టివి.

వేంకటరాయ కవి వచించిన నీతులు- అధిక్షేపించిన అంశములు సరసములైన ఉపమలతో సూక్తి ప్రాయములై శక్తి మంతములైనవి. బొందుమల్లెలు బోడి ముండకేల-శుద్ధ వేశ్యకు మంగళసూత్రమేల- వంటి పద్యపాదములిట్టివి. అధిక్షేప ధోరణి ప్రాయికముగ లలిత హాస్య చమత్కార స్ఫోరకమై యున్నది ధవుడు మిన్నైన వైధవ్యంబునప్పునే - కాచె వెంకిలి సన్నికల్లు దాచ-అనునవి ఇట్టివి.

వైరి సమాసములు ప్రాకృత జన వ్యవహారము నందలి తద్భవ రూపములు ఈ శతకమున పెక్కుగలవు. గ్రామ దండుగ ఏవము- వాసివేతు- రామాంతము - మున్నగునవి యిట్టివి. ఈ కాలము నాటికి సామాన్య పదములతో పాటు పరిపాలనా రంగమునకు చెందిన అన్య దేశ్యముల తెలుగుతో బహుళముగ ప్రవేశించినవి. ఈ శతకమున ముసద్దు - సుబా - సాయెబు - వరిచేసి - సుబా వస్తాదు - పార్సీ మొహర్లు - కలందాను. తాజీతవాజును - మీర్ - బషి దివాను మొదలగు పదములు గమనింప దగినవి.

# వేణుగోపాల శతకము

కౌస్తుభవక్ష శ్రీకరపాద రాజీవ
దీనశరణ్య మహానుభావ
కరిరాజవరద భాస్కరకోటి సంకాశ
పవనభుగ్వరశాయి పరమపురుష
వేదవేద్యానంతవిభవ చతుర్దశ
భువనశోభనకీర్తి పుణ్యమూర్తి
వైకుంఠపట్టణవాస యోగానంద
విహగరాడ్వాహన విశ్వరూప
నీలనిభగాత్ర శ్రీరమణీకళత్ర
సద్గుణస్తోమ యదుకుల సార్వభౌమ
మదరిపువిశాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్త సంత్రాణశీల 1

నినుసదా హృత్కంజమునఁ జూచుకుండ నా
ప్రహ్లాదువలెను నేర్పరినిగాను
ఏవేళ నిను భజియించుచుండుటకు నా
ధ్రువచిత్తుఁ డైనట్టి ధ్రువుఁడఁ గాను
సతతంబు నిన్ను సంస్తుతి చేయుమంత నా
వే శిరంబుల సర్పవిభుఁడఁగాను
నీ విశ్వరూపంబు సేవించుటకు వేయి
చక్షువుల్ గల్గు వాసవుఁడఁగాను
ఇట్టివాఁడఁ గృపఁజూచు టెచ్చుగాదు
దేవ నా వంటి దీనుని బ్రోవవలయు
మద... 2

శ్రీ రుక్మిణీ ముఖసారస మార్తాండ
సత్యభామా మనశ్శశి చకోర
జాంబవతీ కుచశైల కంధర మిత్ర
విందాను సుధాధరబింబకీర
భద్రావయోవన భద్రేభరాజ క
ళిందాత్మజా చిదానందనిలయ
లక్షణాశృంగార వీక్షణకాసార
హంస సుదంతా గుణాపహార

సుందర కపోలవిబుధ సంస్తుత కృపాల
వాల ధృతశైల కాంచనపర్ణ చేల
మద...                                                    3

భానుకోటి ప్రభా భాసురంబగు వెల్గు
పరులు చూచినఁ గానఁబడని వెల్గ
గురు కృపచేఁ గాక గుత్తెఱుంగని వెల్గు
నమృతంపు వృష్టిచే నమరు వెల్గ
విద్యుల్లతాది పరివేష్టితంబగు వెల్గు
ఘననీల కాంతులఁగ్రక్కు వెల్గు
దశవిధ ప్రణవనాదములు గల్గిన వెల్గు
మౌనులెన్నఁగ రమ్యమైన వెల్గు

ఆది మధ్యాంతరహిత మైనట్టి వెల్గు
ఇట్టి వెల్గును సేవింపనట్టి చెట్ట
వారికే లభించు కైవల్యపదము
మద...                                                    4

6)

వేదంబులును నీవె వేదాంగములు నీవె
జలధులు నీవె భూజములు నీవె
క్రతువులు నీవె సద్వ్రతములు నీవె కో
విదుఁడటంచన నీవె నదులు నీవె
కనకాద్రి నీవె యాకాశంబు నీవె ప
ద్మాప్త సోములు నీవె యగ్ని నీవె
అణురూపములు నీవె యవనీతలము నీవె
బ్రహ్మము నీవె గోపతియు నీవె
ఇట్టి నిను సన్నుతింప నేనెంతవాఁడ
గింకరుని జేసి ప్రోవు మకించనుండ
మద... 5

వేదాంత మనుచు బ్రహ్మదు లెంచిన వెల్గు
నాదాంత సీమల నడరు వెల్గు
సాధుజనానంద సంపూర్ణమౌ వెల్గు
బోధకు నిలయమై పొసగు వెల్గు
ద్విదళాబ్జ మధ్యమం దుదయమౌ వెల్గు
సుషుమ్న నాళంబునఁజొచ్చు వెల్గు
చూడఁజూడఁగ మహాశోభితంబగు వెల్గు
నిఖిల జగంబుల నిండు వెల్గు
శతకోటి సారస హితుల మించిన వెల్గు
మేరువు శిఖరంబుమీఁది వెల్గు.
మద... 6

వేదాంత యుక్తులు విని లెంపు నేర్చుక
వాఁగి నాతఁడు రాజయోగి గాఁడు
కల్లు లొట్టెడు త్రాగి కైపెక్కి తెలియక
ప్రేలినంతనె శాస్త్రవేత్త గాఁడు

పట్టపురాజు చేపట్టి యుంచంగానె
గుడిసె వేటుకు బారి గుణము రాదు.
ముండపై వలపున రెండెఱుంగక మోవి
యానఁగానె జొల్లు తేనెగాదు.
కోఁతిపై నున్న సంగపుఁగొడమ కాదు
ఎంత చదివిన గులహీనుఁ డెచ్చుగాఁడు.
మద... 7

దండకమండలుధారులై కాషాయ
ములు ధరించిన దాన ముక్తిలేదు
భూతి గంపెడు పూసి పులిచర్మమును బూని
ముక్కుమూసిన దాన ముక్తి లేదు
తిరుమణి పట్టెఁడు తీసి పట్టెలు తీర్చి
భుజము గాల్చిన దాన ముక్తిలేదు.
వాయువుల్ బంధించి ధీయుక్తి యలయఁగ
న్మూర్తి వేసిన దాన ముక్తిలేదు.
గురుపదాంబుజముల భక్తి కుదిరి తమ్ముఁ
దా యెఱుంగక ముక్తి లేదీ మహి పయి.
మద... 8

దారిద్ర్యమనెడు భూధరచయంబులు గూల్ప
హరి నీదు భక్తి వజ్రాయుధంబు
అజ్ఞానమనెడు గాఢాంధకార మణంప
నీదు సపర్య భానూదయంబు
ఘోరమౌ దుష్కృతాంభోరాశి నింకింపఁ
గా నీదు సేవ దవానలంబు
చపలం బనెడు రోగసమితిని మాన్ప స
ద్జాక్ష నీ స్మరణ దివ్యౌషధంబు

వెన్నయుండియు నేతికి వెదకి నటులు
పరులవేఁడితి నీ మహత్తెఱుఁగ లేక
మద... 9

సూక్ష్మపానము చేసి సొక్కినవేళ సా
మిత ధారణము చేసి మెలఁగువేళ
బడలిక పైనంబు నడచివచ్చిన వేళ
సుఖమంది హాయని సొక్కువేళ
ఒంటరిగాఁ జీఁకటింట నుండినవేళ
సలుకతోఁ బవళించు నట్టివేళ
దెఁబ్బగొప్ప మనమున దిగులు చెందినవేళ
భక్తి గన్నట్టి విరక్తివేళ

లభ్యభావంబుఁ జూడ సలక్షణముగ
బందు వెన్నెల గతిఁ గానబడును ముక్తి
మద... 10

అగ్రజన్మము తీరమందు వాసంబును
వితరణము ననుభవించు నేర్పు
సంగీత సాహిత్య సంపన్నతయు మతి
రసికత బంధు సంరక్షణంబు
ననుకూలమైన చక్కని భార్య రాజ స
న్మానంబు ప్రఖ్యాతి మానుషంబు
సౌందర్యమతి వృథశక్తి విలాసంబు
జ్ఞానంబు నీ పదధ్యాన నిష్ఠ

ఇన్నియును గల్గి వర్తించుచున్న నరుఁడు
భూతలస్వర్గ సుఖమును బొందుచుండు.
మద... 11

అబ్బ మే లోర్వ లేనట్టివాఁడైనను
మోహంబుగల తల్లి మూఁగదైన
ఆలు రాకాసైన నల్లుఁ డనాథైనఁ
గూఁతురు పెను లంకుఁబోతుదైనఁ
గొడుకు తుందుడుకైనఁ గోడలు దొంగైనఁ
దనకు సాధ్యుఁడుగాని తమ్ముఁడైన
గృహకృత్యములు పొరుగిండ్ల వెంబడిఁ బోయి
చెప్పి యేడ్చెడు పెద్ద చెల్లెలైన

నరుని ఖేదంబు వర్ణింపఁ దరము గాదు
అంతటను సన్న్యసించుట యైన మేలు.
మద... 12

అఱవ చెవులకేల యరిది వజ్రపుఁ గమ్మ
లూరి తొత్తుకు విటుం డుండ నేల
గ్రుడ్డి కంటికి మంచి గొప్ప యద్దం బేల
సరవి గుడిసెకు బల్ చాంది నేల
ఊరఁబందులకుఁ బన్నీరు గంధం బేల
బధిరున కల వీణపాట లేల
కుక్కపోతుకు జరీ కుచ్చుల జీనేల
పూఁటకూళ్ళమ్మకుఁ బుణ్యమేల

తనకు గతిలేక యొకఁ డిచ్చు తఱిని వారి
మతులు చెడిపెడి రండకుఁ గ్రతువు లేల.
మద. 13

అలకాధిపతినేస్త మైనప్పటికిని బా
లేందు మౌళికి బిచ్చమెత్త వలసెఁ
గమలా సనున కెంత కరుణ రా నడచినఁ
గలహంసలకుఁ దూటి కాదలేను

క్షీరాబ్ధి లంకలోఁ జేరినప్పటికైనఁ
గొంగతిండికి నత్త గుల్లలేను.
పరగ సాహేబ సుబాయెల్ల నేలిన
బేగంబులకుఁ గుట్టు ప్రోగులేను

ఒకరి కుండె నటంచు మే లోర్వ లేక
నేడ్వఁగ రాదు తన ప్రాప్తి నెన్న వలయు
మద. 14

అల్పునిఁ జేర్చిన నధిక ప్రసంగియౌ
ముద్దు చేసినఁ గుక్క మూతినాకు
గోళ్ళ సాఁకినఁ బొంత కుండలో విష్ఠించుఁ
గొద్దితొత్తుల పొందు రద్ది కీడ్చు
గూబలు వ్రాలినఁ గొంప నాశముఁ జేయుఁ
జన వియ్యఁగా నాలు చంక కెక్కుఁ
బలుకతో సరసంబు ప్రాణ హాని యొనర్చు.
దుష్టుఁడు మంత్రియై దొరను జెఱుచుఁ

కనక నీవెర్గి జాగరూకతను ప్రజలఁ
బాలనముఁ జేయు టది రాజ పద్ధతి యగు.
మద. 15

అవ నీశ్వరుఁడు మందుఁడైన నర్థుల కియ్య
వద్దని యొద్ది దివాను చెప్పు
మునిషీ యొకడు చెప్పు మొససి బక్షీచెప్పుఁ
దరువాత నా మజుందారు చెప్పుఁ
దల ద్రిప్పుచును శిరస్తా చెప్పు వెంటనే
కేలు మొగిడ్చి పకీలు చెప్పు.
దేశ పాండ్యా తాను దిన పలెంని చెప్పు
మొసరద్ది చెవిళోన ఝెుఱిగి చెప్పు

యశము గోరిన దొరకొడుకైన వాఁడు
ఇన్ని చెప్పులు కడఁ ద్రోసి యియ్య వలయు-
మద 16

ఆత్మగానని యోగి కద్వైతములు మెండు
నెఱ అంకులాఁడికి నిష్ఠ మెండు
పాలు పిండని గొడ్డు బట్టె కీఁతలు మెండు.
కల్ల పసిండికిఁ గాంతి మెండు.
గెలువని రాజుకు బలుగచ్చులును మెండు
వంధ్యకు భర్తపై వలపు మెండు.
దబ్బరపాటకుఁ దలద్రిప్పుటలు మెండు
రోగపుఁ దొత్తు మెఱుంగు మెండు

వండ లేనమ్మకు వగపులు మెండు
కూటికియ్యని విటకాని కోర్కె మెండు
మాచకమ్మకు మనసున మరులు మెండు
మద. 17

ఆలిని వంచుకోఁజాలక తగవర్ల
బ్రతిమాలుకొనువాని బ్రతుకు రోఁత
నర్తనాంగనల వెన్కను జేరి తాళముల్
వాయించువాని జీవనము రోఁత
వ్యభిచరించెడి వారవనిత గర్భంబునఁ
బురుషత్వము వహించి పుట్టరోఁత
బంధుకోటికి సరిపడని దుర్వృత్తిని
బడియున్న మనుజుని నడత రోఁత

అరసికుండైన నరపతి నాశ్రయించి
కృతులొసర్చెడి కవినెత్తి గీఁత రోఁత
మద. 18

ఆస్థానమందు విద్యావంతులకు లేచి
మ్రొక్క వేయని వార మోహినులను
దల గౌఁగిలించి మెత్తని సున్నమును బూసి
బొగ్గు గంధమ్ము బొట్టమర్చి
చెప్పులు మెడఁగట్టి చింపిచేటలఁగొట్టి
గాడిదపైఁబెట్టి కాల మెట్టి
తటుకునఁ గ్రామ ప్రదక్షిణం బొనరించి
నిల్చినచోటఁ బేఁడ్నీళ్ళు చల్లి
విప్రదూషకులను దానివెంట నిచ్చి
సాగ నంపించవలయును శునకు పురికి.
మద. 19

పెట్టనేరని రండ ఫెక్కు నీతులఁ బెద్ద
గొడ్రాలిముండకు గొంతు పెద్ద
డబ్బురాని పకీలు డంబంబు కడుఁబెద్ద
రిక్తుని మనసు కోరికలు పెద్ద
అల్ప విద్వాంసుండు నాక్షేపణకుఁ బెద్ద
మూర్ఖచిత్తుఁడుఁ గోపమునసుఁ బెద్ద
గుడ్డి గుబ్బవు తట్ట గుగ్గిళ్ళు తినఁ బెద్ద
వెలయునాఁబోతు కండలను బెద్ద
మధ్యవైష్ణవునకు నామములు పెద్ద
కాసునిచ్చని విటకాని గాసి పెద్ద-
మద. 20

ఈడిగె ముత్తికి జోడు శాలువలిస్తి
కురుబ గంగికి జరీ కోక లిస్తి
కడియాలు కుమ్మర కన్నికికి దచ్చిస్తి
పోఁగులు గోసంగి పోలి కిసి

పోచీలు చాకలి పుల్లిచేతుల వేస్తి
దాని తల్లికి నూఱు దారపోస్తి
దాసరచ్చికి దేవతార్చన లమ్మిస్తి
గుఱ్ఱాన్ని ఉప్పరకొండి కిస్తి

ననుచుఁ బాత్ర మపాత్రము ననక యిచ్చి
చెప్పుకొందురు మూఢులు సిగ్గులేక.
మద. 21

ఈనె గాండ్లంటరో యీాండ్ల బైశారను
శెన్నంగి సుద్దులు సెప్పలేరు.
యేదగాండ్లంటరో యీాండ్లింట పొగలెల్ల
గొఱ్ఱాల్ల బిగ్గెన గొనుగుతారు
కయిత గాండ్లంటరో కాల్పంగటించుక
చిన్నచ్చరము పేరు చెప్పలేరు,
వాసిపేలంట తమాసగా జొమ్మున
దప్పొట యేసుక తట్టలేరు.

అనుచు విప్రోత్తములఁ గన్న యట్టివేళ
మోటపూనవు లనియెడిమాట లిట్లు.
మద. 22

ఉండి యియ్యని లోభి రండకొంపను శ్రాద్ధ
మైననేమి శుభంబు లైననేమి
చండాలు వాకిట పండుకొన్నది యంబ
లైన నే మతి రసాలైననేమి
మాచకమ్మ సమర్త మఖపుబ్బ హస్తచి
త్తయిన నేమి పునర్వసైన నేమి
కులనాశకుండగు కొడుకు దీర్ఘాయువై
యుండిన నేమి లేకున్న నేమి

బవరమున (జొచ్చి పోడువని బంటుచేతి
దాయుధంబైన నేమి తెడ్డయిన నేమి.
మద... 23

ఎసుపోతువానకు జంకునా యింతైన
వెలహెచ్చుగల తేజివెఱచుగాక
జెట్టిమల్లుండు గుంజిళ్ళకు వెఱచునా
పిన్నబాలుడు మతి వెఱచుగాక
గడుసైన పెనుమొద్దు గాలికి వెఱచునా
విరుగగాచినమ్రాను వెఱచుగాక
అంకుముండ బజారురచ్చకు వెఱచునా
వీరపతివ్రత వెఱచుగాక.

ఘనతగల్గిన దొరబిడ్డ గాక సుకవి
నోటితిట్లకు వెఱచునా మోటువాడు.
మద... 24

ఏదంబులను మంగలెంకడే బగునేటు
ప్రశ్న సెప్పెను మాల పాపిగాడు
కయితముల్ సెప్పబోగము చినెంకడె సరి
సంగీత యిద్దెకు సాకలెల్లి
చాత్రపురండాల సాతాసనంతమ్మ
సిందులు ద్రొక్క దాసిరి పెదక్కి
యీశె గొట్టను కోమటిరేశమే సరి
మతిరతాలను మాఱుమనుము లచ్చి

అనుచుమూర్ఖాళి యీరీతి నను దినంబు
భూతలమున పచింపరే నీతి లేక
మదన... 25

బంటి జందెము ద్వాదశోర్ధ్వ పుండ్రంబులు
సమరిన పసపు కృష్ణాజినంబు
దండంబు గోచి కమండలు పక్ష మా
లిక పుస్తకంబు పాదుకలు గొడుగు
దర్భ మౌంజీ పవిత్రము గోముఖముకొన
చెవిలోనఁదగు తులసీదళంబు
వేదమంత్రములు వినోదమౌ సపరంజి
పడగ కుండలముల పంచశిఖల
తో సరుగు దెంచి బలిని భూదాన మడిగి
తెచ్చి సురపతి కిచ్చితి విచ్చతోడ.
మద. 26

కనుముక్కుతీరు చక్కనికాంతి పొందిన
శుభలక్షణంబులు సూక్ష్మబుద్ధి
ఘనత వివేక విక్రమము బాంధవ్య వి
మర్శ విలాసంబు మానుషంబు
సరస వాచాలత సాహసందౌకవేళ
విద్యా విచక్షత విప్రపూజ
వితరణగుణము భూపతియందు భయభక్తి
నీతియు సర్వంబు నేర్పునోర్పు
స్నాన సంధ్యాద్యనుష్ఠాన సంపన్నత
గాంభీర్యము పరోపకారచింత
గలుగు మంత్రిని జేర్చుకోఁ గలుగు దొరకుఁ
గీర్తిసౌఖ్యము సకల దిగ్విజయము సిరి
గలుగుచుండును దోషము ల్తొలగుచుండు.
మద 27

కన్నె నిచ్చినవానిఁ గబ్బమిచ్చిన వాని
సొంపుగా నింపుగాఁ జూడవలయు
అన్నమిచ్చిన వాని నాదరించిన వాని
దాతఁగాఁ దండ్రిఁగా దలపవలయు
విద్యనేర్పినవాని వెఱపుదీర్చినవాని
గురునిగా హరునిగా నెఱుఁగవలయు
కొల్వు గాచినవానిఁ గూర్మి చూపినవాని
సుతునిగా హితునిగాఁ జూడవలయు

ఇట్టి వారలపైఁ బ్రేమ పెట్టుకోక
కసరు పుట్టిన మనుజుండు గనఁడు కీర్తి.
మద... 28

కలకొద్దిలోపలఁ గరుణతో మన్నించి
యిచ్చిన వారి దీవించవలయు
సిరిచేతమత్తుఁడై పరువెఱుంగని లోభి
దేబెను బెళ్ళునఁ దిట్టవలయుఁ
దిట్టిన యప్పుడేఁ దెలసిఖేదము నొందియింద్రుడై నను బిచ్చమెత్తవలయు.
దీవించినప జాలదీర్ఘాయువొంది బీ
దేనియు నందలం బెక్క వలయు

నట్టియాతఁడు సుకవి కానట్టి యతనిఁ
గవియనఁగ నేల కవిమాలకాకి గాఁడె.
మద. 29

కొండసిగల్ తలగుడ్డలు పాకోళ్ళు
చలువవస్త్రములు టొజ్జలకటార్లు
కాసెకోకయు గంపెడేసి జందెములును
దలవార్లు జలతారు డాలువార్లు

సన్నపు తిరుచూర్ణ చారలు కట్నాలు
జొల్లుపీడెమ్ములు పల్లెవాట్లు
దాడీలు వెదురాకు తరహా సొగసుకోర్లు
నంతకు దొరగార్లటంచు ( బేర్లు
సమరమున జొచ్చి తొమ్మగాయముల కోర్చి
శాత్రవుల ద్రుంచనేరని క్షత్రియులకు
నేలకాల్పన యీ వట్టి యెమ్మెలెల్ల.
మద... 30

కోమటి యత్యంత క్షామము గ"రును
ధారుణి క్షితపతి ధనము గోరు
ధర(గరణము గ్రామదండుగ గోరును
జంబుకం బేవేళ శవముగోరు
కుజను(డౌ వైద్యుండు ప్రజకు రోగముగోరు
సామాన్యవిప్రుండు చావుగోరు
అతిజారులగు వార లమవస గోరుదు
రా(బోతు పేదల యశము గోరు(
గా(పువానికి గ్రామాధికారమైన
దేవభూసురవృత్తులు దీయ(గోరు...
మద... 31

కండ చక్కెర పానకము( బోసిపెంచిన
ముష్టిచెట్టుకు( దీపుపుట్టబోదు.
పాలమున్నీటి లోపల ముంచికడగిన(
గాకి తెక్కకు( దెల్పుగలుగ(బోదు
పన్నీరు గంధంబు పట్టించి విసిరిన(
దేలుకొండి విషంబు తీయ(బోదు.
వెపురు బద్దలు చుట్టు వేసి బిగెంచిన(
గుక్కతో(కకు వంక కుదురబోదు.

మంచి మాటల నెంత బోధించి చెప్పగ
మడియరండకు విగుణంబు విడువబోదు.
మద... 32

ఖేద మోదంబుల భేదంబు తెలియక
        గోలనై కడపితిఁ గొన్నినాళ్లు
పరకామినుల కాసపడి పాప మెఱుఁగక
        కౌమరు ప్రాయంబునఁ గొన్నినాళ్ళు
ఉదరపోషణమున కుర్వీశులను వేడి
        కొదవచేఁ గుందుచుఁ గొన్నినాళ్ళు
ఘోరమైనట్టి సంసార సాగర మీఁదు
        కొనుచుఁ బామరముచేఁ గొన్నినాళ్లు
జన్మమెత్తుట మొదలు నీ సరణిఁ గడచె
నెటులు గృపఁ జూచెదో గతంబెంచఁబోకు.
మద... 33

గజముపై చౌడోలు గాడిద కెత్తితే
        మోయునా పడవేసి కూయుఁగాక
చిలుక పంజరములోపల గూబ నుంచితే
        పలుకునా భయపెట్టి యులుకుఁ గాక
కుక్క నందలములోఁ గూర్చుండఁ బెట్టితే
        కూర్చుండునా తోక్ల కొఱుకుఁ గాక
ధర్మకార్యములలో దరిబేసి నుంచితే
        యిచ్చునా తన్నుక చచ్చుఁ గాక
చెడి బ్రతికినట్టి ఛంతను జేర్చుకొనిన
వాఁడు చెడు నుంచుకొన్న భూపతియుఁ జెడును
మద... 34

గోవుల నఱవంగఁ గోసి పండుక తిను
　　వారలు నైశ్వర్యవంతు లైరి
మానాభిమానముల్ మాని వర్తించు గు
　　లాములు గౌరవధాము లైరి
అక్షరం బెఱుగని యాకార పుష్టిచే
　　వర్ణ సంకరులు విద్వాంసులైరి
బాజారి అంకుకుఁ బంచాయతీ చెప్పు
　　ప్రాఁత లంజెలు వీరమాత లైరి

అహహ! కలియుగ ధర్మ మేమనఁగ వచ్చు
నన్నిటికి నోర్చి యూరక యుండవలయు
మద... 35

చదువుచుండెడివేళ సభలోనఁ గూర్చుండి
　　దున్నపోతుల కొడుకెన్నుఁ దప్పు
విద్యాధికుల కిచ్చు వేళడ్డుపడి మాల
　　ధగిడీల కొడుకు వద్దనుచుఁ జెప్పు
ధన మెక్కుడుగఁ గూర్చి తినలేక మేడెక్కి
　　పేనులుబ్ధుఁ డర్థుల గనిన తొప్పు
బిరుదు గల్గిన యింటఁ బెరిగినఁ గొణతంబు
　　విప్పినంతనె కుక్క వెదకుఁ జెప్పు

రాజసభలందుఁ బండిత రత్నములకుఁ
జనులు చెఱచును నొక్కొక్క పాపి నరుఁడు
మద... 36

జన్నిరోగికి బత్తెజున్ను వేసినయట్లు
　　పిల్లినెత్తిని వెన్నఁ బెట్టినట్లు
కుక్కపోతుకు నెయ్యికూడు వేసినయట్లు
　　చెడ్డజాతికి విద్య చెప్పినట్లు

సాతాని నుదుట విభూతి రాసినయట్లు
గూబ దృష్టికి దివ్వె గూడినట్లు
ధన పిశాచికి సుదర్శనము గన్పడినట్లు
చలిచీమలకు ముగ్గు చల్లినట్లు

సురభి బదనిక పాముకుఁ జూపినట్లు
దుష్టునకు నీతి వెగటుగాఁ దోఁచునట్లు
మద... 37

తండ్రి మధ్వాచారి తనయు డారాధ్యుండు
తల్లి రామానుజ మతస్థురాలు
తనది కూచిమతంబు తమ్ముఁడు బౌద్ధుండు
సర్వేశ్వర మతంబు సద్దకునిది
ఆలు కోమటిజాతి దక్క జంగమురాలు
బావగారిది లింగబలిజకులము
ఆఁడుబిడ్డ సుకారి యల్లుఁడు పింజారి
మఱదలు కోడలు మూరువాడి

గలియుగమ్మున వర్ణసంకరము ప్రబలి
యుత్తమకులంబు లొక మూల నొత్తిగిల్లె.
మద... 38

తల్లి అంకునఁ దండ్రి ధనము పోయినయట్లు
మూలనిక్షేపంబు మునిఁగినట్లు
కూఁతురి ముడుపెల్లఁ గొల్లవోయినయట్లు
కాణాచివల్లెలు కాలినట్లు
తన యాలి గడనెల్ల దండుగ కైనట్లు
దండ్రి తద్దిన మేమొ తప్పినట్లు
చెల్లెపైఁ బడి దొంగ చెఱచిపోయిన యట్లు
కొడుకునప్పుడు తలగొట్టినట్లు

దిగులుపడి చూచి మూర్ఛిల్లి తెప్పరిల్లి
కవుల కియ్యంగ వద్దని కన్ను మీటు
మద... 39

దూదేకుల హుసేను దొమ్మరి గోపాలు
పట్రు మంగఁడు గాండ్ల బాలిగాడు
బయశేనినాగఁడు పటసాలె నారాయఁ
డగముడి లచ్చిగాఁ డా ముకుందు
చాకలిమల్లఁడు సాతాని తిరుమల
గొల్లకాటడు బెస్త గుర్విగాడు
కోమటి శంభుడు కుమ్మరి చెంగడు
మంగ లెల్లడు బోయ సింగ డొకడు

కన్నవారెల్లఁ బండితుల్ కవులుఁ గాగ
వేదశాస్త్రంబు లేదను విప్రులేడ
మద... 40

దొరవద్ద నెంత చౌదరి యైన దన మన్వి
తాఁజెప్పఁ గార్య సాధకము లేదు
రంభైన తన శరీరముఁ గరంబుల
దా బిగించిన సుఖ తరము లేదు
తగవులో నాపురందరుఁ డైనఁ దన ప్రజ్ఞ
తాఁజెప్పుకొనినఁ బెత్తనము లేదు
తాఁజేయు పుణ్య మింతని యొరులతోఁ జెప్ప
బ్రహ్మ దేవునికైన ఫలము లేదు

గనుక నివి యెల్ల నొరులచేఁ గాని భువిని
తమదు శక్తిని మంత్ర తంత్రములు లేవు
మద... 41

దొర సొమ్ముదిని కార్య సరణి వచ్చిన వేళఁ
జాఱిపోఁ జూచిన బంటువాని
నగ్నిసాక్షిగను బెండ్లాడిన తన యింతి
నేలక పరకాంత నెనయు వానిఁ
గబ్బము ల్సేయు సత్కవిజనాళికిఁ గల్గి
నంతలో నే మియ్య నట్టివాని
నిచ్చిన దీవెన లియ్యక యత్యాశ
తోనేఁగు యాచకుండైన వాని
గట్టి ముచ్చెలతోఁ బట్టి కొట్టి విఱుగ
గట్టి పంపించ వలయునుఁ గాలు పురికి
మద... 42

నంబి కవిత్వంబు తంబళి జోస్యంబు
వలనొప్పు కోమటి వైష్ణవంబు
వరుసనే యుప్పరివాని సన్న్యాసంబు
తరువాత శూద్ర సంతర్పణంబు
రజకుని గానంబు రండా ప్రభుత్వంబు
వెలయఁగా వెలమల వితరణంబు
సానిపండితశాస్త్ర వాదము వేశ్య '
తనయుఁడబ్బకుఁబెట్టు తద్దినంబు
నుభయ భ్రష్టత్వములు గాన నుర్విలోన
రాజసభలందు నెన్నగా రాదుగదర
మద... 43

నత్తులేకుండిన ముత్తైదు ముక్కందు
మూల లందను ఋతుస్త్రీల యందు
మద్యపక్వ స్థల మందుఁ గిన్నెరమీటు
సతనిచేఁ గుమ్మరి యావ మందుఁ

కాటుక పొగయందుఁ గాళ్ళ చప్పుడు నందు
దొమ్మరి వాయించు డోలు నందు
దీపము లేనట్టి దివ్వెకంబము నందు
హుర్జాల ముఖమందు మాంసమందు

ముదముతో. సంతతము నీదు వదినెగారు
విడిది చేసుక వీరిని విడువకుండు
మద... 44

పంచాంగములు మోసి ఒడవాతనముఁ జేసి
పల్లె కూటము చెప్పి పసులఁ గాచి
హీనవృత్తిని బిచ్చమెత్తి గోడలు దాఁటి
ముష్టి కూళ్ళకుఁ బోయి మొత్తులఁబడి
విస్తళ్ళుగుట్టి కోవెల నంబి వాకిటఁ
గసవూడ్చి లంజెల కాళ్ళు పిసికి
కన్న తొత్తులఁ దమ కళ్ళొత్తి చూడక
యాలు బిడ్డలఁ బరులంటఁ జేయు

నిట్టి దేబెకు సిరి గల్గనేని వాఁడు
కవివరుల దూఱు బంధు వర్గములఁ గేరు.
మద... 45

పతికి మోహము లేని సతి జవ్వనం బేల
పరిమళింపని సుమ ప్రచయ మేల
పండిత కవివర్యు లుండని సభ యేల
శశి లేని నక్షత్ర సమితి యేల
పుత్ర సంపద లేని పురుషుని కలి మేల
కలహంసములు లేని కొలన దేల
శుకపికరవ మొకించుక లేని వస మేల
రాజు పాలింపని రాజ్య మేల

రవి వికసనంబ లేనట్టి దివసమేల
ధైర్య మొదవని వస్తాదు తనమదేల
మద... 46

పరకాంతపై నాసపడెడి మానవులకు
నగుబాటు, మనమున తగని దిగులు
అగడువిరుద్ధంబు నాచారహీనత
చేసొమ్ముపోవుట, సిగ్గుచెడుట
యపకీర్తి బంధుజనాళి దూషించుట
నీతియుఁదొలగుట నిద్రచెడుట
పరలోకహాని లంపటనొంది మూల్గుట
పరువుదప్పుట దేహబలము చెడుట
తనయాలి చేతిపోటునఁ గృశించుట దాని
వరుడు గన్గొనిన జీవంబుతెగుట

ముజ్జగము లేలు నా విరాణ్మూర్తి కయినఁ
గాని దుర్వృత్తి దగదెంత వానికైన
మద... 47

పరదళంబులఁగాంచి భయముచే నురికిన
రాజుగాఁడతడు గోరాజు గాని
ధర్మంబులకు విఘాతముసేయ మంత్రిశే
ఖరుఁడు గాఁడతఁడు సంకరుఁడు గాని
విద్యాప్రసంగము ల్విను రసజ్ఞులు లేక
ప్రాజ్ఞుల సభ గాదు రచ్చ గాని
పతితోడ కలహించి పడుకొని యేడ్చెడి
దాలు గా దది యెద్దు తేలు గాని

శాస్త్రముల మించినట్టి యాచారమైన
నిష్ఠ గానేరదది పెనుజ్యేష్ఠగాని
మద... 48

పానంబు జూదంబు పరసతిపై బాళి
ధనకాంక్ష మోహంబు తగనియాస
యనుదినంబును వేఁట యధిక నిద్రనుగొంట
పేదఱికంబును బిఱికితనము
నతిలోభమును మందమతి హెచ్చుకోపము
నమిత వాచాలత యనృతములును
ఖండితం బాడుట గర్వంబు సంధ్యల
వేళలఁబయనంబు విప్రనింద

యాప్తజనముల దూఱుట నసురు తిండి
మానవేంద్రుల పదవికి హాను లివియ
మద...                                                                49

పాలనలేని భూపతియైన నతని ద
గ్గరనుండు మంత్రి ధర్గీయునైన
చెవిటి రాయసమైన సేవకుఁ డౌడైన
వారసుగాఁడు దివాను నయిన
వరుస బక్షి చిత్తవైకల్యుఁ డయినను
గడుదీర్ఘ వృత్తి వకాల తైన
కోశపాలకునకును గుండేటి తెవులైన
నుగ్రాణగాని కత్యుగ్రమైన

దాతలను మోస మచటి విద్వాంసులకును
ప్రాణసంకట మా భూమిఁ బ్రజకుఁగీడు
సుద...                                                                50

సీమగఁదపు మోము పిల్లి మీసంబులు
కట్టెశరీరంబు కాకినలుపు
ఆర్చుకన్నులు వెన్నునంటిన యుదరంబు
నురుగు కారుచు నుండు నోరుకంపు

చెయిచెయ్యి దిగరాచి చెక్కిళ్ళురుద్దుట
దవుడల సొట్ట పాదముల మిట్ట
ఒకరిని జూచి మేలోర్వ లే కేడ్చుట
దౌర్భాగ్యగుణములు తగని యాశ
ఇట్టి యపలక్షణపు మంత్రి నేర్పరించి
దొరల కపకీర్తి దెచ్చు నా దుర్జనుండు
మద... 51

పూబొదలో దాఁగియున్న పులియున్నరీతిని
మొగిలిరేకుల ముండ్లు మొలచి నట్లు
నందవనములో నాగుఁబామున్నట్లు
చందురునకు నల్పు చెంది నట్లు
సొగసుకత్తెకుఁజడ్డ తెగులు కల్గిన యట్లు
మృగనాభిలో ఁబుప్పి తగిలి నట్లు
జలధిలో బెద్దక్క సంభవం బైనట్లు
కమలాప్తువకు శని గల్గినట్లు
పద్మరాగమునకు ఁబటల మేర్పడినట్లు
బుగ్గవాకిట ఁజెట్టు పుట్టి నట్లు
ధర్మవిదులైన రాజసంస్థానములను
జేరు నొక్కొక్క చీవాట్లమారి శుంఠ
మద... 52

పై మాటలొకలక్ష పలుకంగను సరా య
హంకారవర్తన మణఁగ వలయు
అణఁపజాలక కానలంచుఁదోపఁగ సరా
యెఱుకచెప్పెడి మూర్తి దొరక వలయు
దొరకినాఁడని పేడ్క సరయంగనే సరా
గురుపదంబుల భక్తి కుదుర వలయు

కుదిరె నం చని యూరకుండఁగానే సరా
పాయకాత్మను బాటి సేయవలయు
చేసినను కాదు పాచిని దోసి శుద్ధ
గంగనెత్తిన యటముక్తి గాంచవలయు
మద... 53

భట్టరాచార్యుల బట్టలు కాగానె
మడిగట్టుకొను పట్టుమడత లౌనె
అలరాచకూతురు సధరంబు కాగానె
తేనె ఁజిల్కునె యనుపాన మునకు
అల్ల యేలేశ్వరోపాధ్యాయు బుజ్జియు
రాచూరిపెద్ద ఫిరంగి యౌనె
అల తాళ్ళపాక చిన్నన్న రోమము లైన
దంబుఅ దండెకుఁ దంతులౌనె
హుంకరించిన నెటువంటి మంకునైనఁ
దిట్టవలయును గవులకు దిట్టమిదియె
మద... 54

బడవాకు ఁబ్రతియెన్న బహుమతు లేనూరు
దళవాయి కొక యూరధర్మచేఁ
పడుపు తొత్తుకు మేలు పౌజులకమ్మలు
తాటాకు దుద్దులు తల్లిచెవుల
దండె దాసర్లకు ఁదాజీతవాజము
కవివరులకుఁగన్నగాని మన్న
బైసీని సుద్దికి బారిశాలువ జోడు
విద్వాంసులకు బేడ వెలితిగుడ్డ
ఘనము నీచం బెఱుంగక కలియుగమున
నవని నడుతురు మూఢులైనట్టి దొరలు
మద 55

మంగల కత్తిపై నంగవేసిన యట్లు
కోడెత్రాచును ముద్దు లాడి నట్లు
కొఱవితో నడునెత్తి గోఁకి నట్టినిన
పులితోడ సాముకుఁబూనినట్లు
వెదసింగమును జాల నదలించికొని నట్లు
మినుకు వజ్రవు రవమింగ్రినట్లు
కొత్తిమీదను గొంతు కూర్చుండుకొని నట్లు
నూతిపైఁ బసిబిడ్డ నునిచి నట్లు

క్ష్మాతలేంద్రులసేవ కష్టంబు వార
లిచ్చి రని గర్వమున నిక్కి యెగురరాదు
మద.. 56

మకరందపానంబు మధుకరాళికిఁగాక
జోటీగఁ చవి గని జుఱ్ఱగలదె
హరిపదాబ్జధ్యాన మమనస్కులకుఁగాక
చెనఁటిసద్భక్తితోఁ జేయగలడె
కవితా రసజ్ఞత సువివేకులకుఁగాక
యవివేకి చెలి యొగ్గియాఁనగలడె
పద్మినీ సతిపొందు పాంచాలునకుఁగాక
దేబైన షండుండు తెలయఁగలఁడు

రాజసభలఁబరోపకారములు తెలుప
శ్రేష్ఠులేకాక దుష్టులు చెప్పఁగలరె
మద... 57

మద్యపాయులతోడ మచ్చిక కారాదు
భడవాల గొప్పగాఁ బట్టరాదు
శాత్రవునింట భోజనము చేయఁగరాదు
సన్యాసులను గేలి సలుపరాదు

దేవభూసురవృత్తి తెరువు పోవఁగ రాదు
పరు నాలి గని యాస పడగ రాదు
కంకోష్ఠునకు నధికార మియ్యఁగ రాదు
చెలగి లోభినిఁ జేర బిలువ రాదు
లంచగాండ్రను దగవుల నుంప రాదు
మాతృపితరుల యెడ భక్తి మఱువ రాదు
మద... 58

మన్ననలేని భూమండలేంద్రుని కొల్వు
లాలింపనేరని లంజె పొందు
వస్తుపోతుండని వాని చుట్టఱికంబు
బుద్ధి తక్కువవాని యొద్ది ఋణము
సరిగానివానితో సరసోక్తి తనకన్న
బలవంతు నింటను బడుచుఁగొనుట
సామాన్య జాతితో జగడంబు పూనుట
మూర్ఖుని మైత్రికి మోహపడుట
అధమ మిది భువి నరులకు నజునకైన
మఱచి యప్పని చేసిన మానహాని
మద... 59

మన్నించు నరపతి మమత తప్పిన వెన్క
నుత్తముం డాభూమి నుండ రాదు
పైవిటుం డొకఁడు దేర్పడినట్టి వేశ్యపై
నెంతవాఁడైన నాసింప రాదు
అన్నదమ్ములను గొట్లాడి మానసము ని
ర్జింపక మును తామసింప రాదు
పగతుఁడు నెనరుగా భాషించెనని వాని
నెయ్యంబుగనక చన్వియ్య రాదు

చెలులతో రాజకార్యముల్ చెప్పరాదు
పలువ మంత్రైన దొరలకుఁబరువులేదు
మద... 60

రణభేరి తెగువైన రాజు శ్వేతచ్ఛత్ర
మేనుఁగు నివి నాలుగు నేకరాశి
మారుండు కీరంబు మంద సమీరుండు
రాకాసుధాకరుం డేక రాశి.
వేదము శ్లోవులు విప్రోత్తములు దర్భ
లేర్పరింపఁగ నాలు గేకరాశి
మూఢాత్ముఁ డత్యంత మూర్ఖుఁడు గాడిద
కాకి వీరలు నాలు గేకరాశి.

ద్విపద కావ్యంబు ముదిలంజ దిడ్డిగంత
యియ్యనేరని రండ నాల్గేక రాశి.
మద... 61

రమణచెంతను సిగ్గు రణమున భీతి భో
జన కాలమందును సంశయంబు
ఇచ్చెడిచోఁజింత మెచ్చిన యెడలేని
యచ్చినవానిపై హంకరింపు
తగవున మోమోట దాన మిచ్చకులకుఁ
దపమొనర్చెడివేళఁ దామసంబు
గూర్మిచేసినచోట ఁగూహకం బద్భుత
ద్రోహపర్తనులపై మోహదృష్టి
అవని సత్కీర్తి కోసమై యాశనొందు
రాజవర్యుల కివియుఁగారానిపనులు
మద 62

రాజుల మంచు బొట్టులు తీవురంగఁగా
దని మొనలో సఱుకాడ వలయు
మంత్రుల మని బొంకుమాటలాడంగఁగా
దిప్పింపనేర్చి తామియ్య వలయు
కవుల మంచును వింతగా నల్లినను గాదు
చిత్రప్రబంధముల్ చేయవలయు
తపసుల మని నిక్కి తలలు పెంచినఁగాదు
నిర్వికల్పసమాధి నెగడవలయు

ఇచ్చినను నేమి వినయోక్తు లెఱుఁగవలయు
గడుసుకూఁతల సత్కీర్తి కలుగబోదు
మద... 63

రామాండ కతలెల్ల మేమెఱుంగని యవే
కాటమరాజుకుఁ గర్ణు డోడె
బాగోత కతలంట పలుమాఱు వినలేదె
యిగనేశుఁ డర్జును నిరఁగ మొడిసె
బారత కతలోన బాలరా జొక్కఁడు
కుంబకర్ణుని బట్టి గుద్ది సంపె
కంద పురాండలకత పిల్లకాలేరి
యీరబద్రుని మెడ యిరఁగగొట్టె

అనుచు మూర్ఖులు పలుకుమ రవనియందుఁ
గవివరులు పేఁడఁబోయిన కాలమందు
మద... 64

లత్తుక రంగు చల్లడము మిటారంపు
చౌకట్లు తగటుఁ మిర్జాకుళాయి.
మగవాల పంచిక మొగముపై జవ్వాజి
తిలకము జాళికెంపుల బులాకి

పులిగోరుతాళి పచ్చల బాజుబందు ని
ద్దా మేల్కడానిజ ల్తారుపాగ
కుడి పదంబునకు జాగుల్క ఘంటలును ఘ
ఝల్లని మ్రోము మానిక్షపు టిందె

సీటుగా బిన్నపై పల్లెకూటమునకు
నరుగుచును మధ్యధేనుకాసురుని బట్టి
కొట్టి ధరఁగూల ద్రోయవా గుండె లవియ
మద... 65

వంకరపాగాలు వంపుముచ్చెల జోళ్ళు
చెవి సందుకలములు చేరుమాళ్ళు
మీఁగాళ్ళపైఁ బింజె బాగైన దోవతుల్
జిగితరంబైన పార్షీమొహర్లు
చేఁపవలెను బుస్తీ మీసము ల్కలం
దాన్పెట్టెలును జేత దస్త్రములును
సొగసుగా దొరయొద్దఁ దగినట్లు కూర్చుండి
రంకులాండ్లకు శిపారసులు చేసి

కవిభటుల కార్యములకు విఘ్నములు చేయు
రాయసా ల్పిండములు తిను వాయసాలు
మద... 63

వలపు రూపెరుగదు వసుధ మర్త్యులకు సూ
కరమైన మనిసిగాఁ గానుపించు
ఆకలిలో నాల్క యరుచి యెఱుంగద
యంబలైనను సుధయనుచుఁ గ్రోలుఁ
గోపం బెదుటి గొప్ప కొద్దులెఱుంగదు
ప్రాణబంధువునైనఁ బగతుఁ జేయు
నిదుర సుఖం బెఱుంగదు వచ్చినప్పుడు
కసవైన విరిశయ్యగా గనబడు

గామంబు నిర్ణయకాలం బెఱుంగద
యిచ్చచెందిన వేళ నెనయఁగోరు
హరునకైనను నివి గెల్వ నలవికాదు
ఇతరులైనట్టి మానవు లెంతవారు
మద... 67

వసుధాధిపతికి విశ్వాసగుణంబు జా
రునకు సత్యంబు చోరునకు భయము
లంజెకు మోమోట పంజకు ధైర్యమెం
గిలికెగ్గు మద్యపాయులకు సిగ్గు
ద్రవ్యాధికులకును దాన ధర్మములపై
దృష్టియు జారిణి స్త్రీకి వావి
పలుగాకులకు మేలు పందగొడ్డుకుఁ బాలు
మానికిఁగలవు కోమటికి బరువు
మేక మెడ చన్నులకుఁ బాలు మేడిపూలు
లేవు త్రిభువనములను గాలించి చూడ 68
మద ...

వాగ్భూషణంబునిన్ వర్ణనసేయుట
కర్ణభూషణము నీ కథలు వినుట
హస్తభూషణము నీ కర్చన సేయుట
నేత్రభూషణము నీనీటు గనుట
హృదయ భూషణము నిన్మదిఁ బాయకుండుట
మూర్ధభూషణము నినె్రక్కు-టరయ
అంఘ్రిభూషణము నీయానంద నిలయప్ర
దక్షిణం బేగుట ధర్మచరిత!
సతముగల భూషణములెన్ని జన్మములకు
నివియెఁకా గనుటెంత కెచ్చేమిగలదు
మద... 69

వార్ధక్యమునఁ చిన్నవయసు పెండ్లామైన
　　దారిద్ర్యమునఁ బెక్కుతనయులైన
ఆత్రుఁడౌ విటకాని కతిభాషి లంజైనఁ
　　బొరుగున నత్తిల్లు పొసఁగనైన
సంగీతపరునకు జలపాతితోడైన
　　నెనుముతో నట్టేట నీఁదుటైన
బెను వానకాల మందును బ్రయాణంబైన
　　జలికాలమున దీక్ష సలుపుటైన
మరణ మిక లేదు వేఱె భూమండలమున
గణనసేయంగ నగునె యీ కష్టమహిమ
మద... 70

వితరణశౌర్య ప్రవిష్టునకే కాక
　　మీసము పిసినారి కోసకేల
సిరిగల ఘనసువాసిని కొప్పునకుఁ గాక
　　బొండుమల్లెలు బోడిముండకేల
ప్రజల సుఖింపగజేయు పంటచెర్వుకుగాక
　　గండిగుంటకు ఱాతికట్ట యేల
జాతైన బారహజారి తేజికిఁ గాక
　　కఱకుల కళ్లెంబు గాడ్దె కేల
అతులితంబైన యల పతివ్రతకుఁ గాక
శుద్ధవేశ్యకు మంగళసూత్ర మేల
మద ... 71

విద్యాధికుల రాజు విపరించి నిలిపెనా
　　యిందఱేమిటి కంచుఁ గుందుచుండ
మోయీను కుగ్రాణమును జెప్ప వద్ద గిం
　　జలకు బరాతము ల్సరవి వ్రాయు

తండికిఁ జేటుగాఁ బండితు లేల తె
ప్పున సెలవిమ్మని పోరుచుండు
జారిశాల్వాలు దెచ్చి బహుమాన మిమ్మన్నఁ
జాక ఖరీదు వస్త్రముల నిచ్చు

ఇట్టి యపకీర్తి మంత్రిని బెట్టఁదగదు
మంచిమాటల జరగఁ ద్రోయించవలయు
మద... 72

హేమాచలము శృంగ మెక్కి లెక్కార్చుచుఁ
గాకి కూయఁగనే పికంబు గాదు
గంగాది నదులలోఁ గలయ ముంచంగనే
తల వెంట్రు కెన్నడు దర్భ గాదు
తెగఁ దిని తలపిక్క లెగయఁగా బలసిన
దున్నపో తేనుగు గున్నగాదు
పొదుగు లావై యెంత పొడుగుగాఁ బెరిగినఁ
గుక్కపో తెన్నఁడు గోవు గాదు

ఉన్నత స్థానమందు గూర్చుండగానె
భ్రష్టు భ్రష్టే యగుఁ గాని శిష్టుగాడు
మద... 73

అప్రయోజకునకు నారభటము గొప్ప
యాఱిపోయెడి దివ్వె కధికదీప్తి
కట్టనిల్వని చెర్వు గడియలోపల నిండు
బ్రతుకఁజాలని బిడ్డఁ బారెడుండు
వృద్ధి నొందని చెట్టు వెఱ్ఱి తేగడి జాడ్య
మెచ్చు ముందటికన్న నిచ్చుఁ దళుకు
తన్నించుటకె దొరల్ తగని చన్విచ్చుడి
పొయిపాలికే పాలు పొంగు టెల్ల

బెరుగుటయు విఱుగుటకని యెఱుఁగలేక
యదిరిపడుచుండు నొక్కొక్క యల్పజనుఁడు
మద... 74

పాలన లేని భూపతిని గొల్చుట రోత
యౌదార్యహీనుని నడుగ రోత
కులహీనజనులతోఁ గలహించుటయు రోత
గుణహీనకామినిఁ గూడ రోత
పాషండ జనులపై భ్రాంతి నొందుట రోత
మద్యపాయులతోడ మైత్రి రోత
తుచ్ఛంపు బనులకు నిచ్చనొందుట రోత
చెలఁగి సద్గురు నింద సేయ రోత
వేదబాహ్యుల విద్యలు వినుట రోత
క్రూరుఁడైనట్టి హరిభక్తుఁ గూడ రోఁత
మద... 75

పసచెడి యత్తింటఁబడి యుండు టది రోత
పరువు దప్పినయెడ బ్రతుకు రోత
ఋణపడి సుఖమున మునిగియుండుట రోత
పరులకల్మికి దుఃఖపడుట రోత
తన కులాచారంబుఁ దప్పి నడువ రోత
ధరణీశునకు బిర్కితనము రోత
పిలువని పెత్తనంబునకుఁ బోవుట రోత
యల్పుతో సరసంబు లాడ రోత
ఒకరి యాలిని గని వగనొంద రోత
సతికి జార పురుషుని బ్రతుకు రోత
మద... 76

వ్యాసాదు లగు మౌనపర్యులు తపసెల్లఁ
బోగొట్టుకొనుట సంభోగమునకె
జలజాత భపశివాదులు గూడఁ భ్రమగొని
మురియుట యీ పాడు భోగమునకె
నేర్తు మంచని నెఱ్ఱసీల్గుచు విద్యలు
కోటినేర్చుట పొట్టకూటి కొరకె
ఏక చక్రమ్ముగ నేలిన రాజైన
గడ కేడు జేనల కాటి కొరకె

కీర్తి యపకీర్తి దక్కఁ దక్కినవి నిల్వఁ
బోవు శాశ్వత మౌనట్లు పుడమి మీద
మద...

77

సుంకరులకు పర్ణ సంకరులకుఁ దన
పొత్తొసంగెడి తొత్తుముండ లకును
సారాయి నీళ్ళకు జాతరగాండ్లకు
బంగు భాయీలకు బందెనకును
బతవాలకును లేని భడవాలకును అంకు
రాట్నాలకును శుంఠ రండలకును
కలిమి దండుగులను గారడీ విద్యకుఁ
దోడఁ బోతుల కాట దొమ్మరులను

శోభితనమున నద్భు సద్రా భవాన
గడనవీండ్లకె కాక సత్కవుల కౌనె
మద...

78

వెల్లుల్లి వనములో వెలయంగ జోతీఁగ
పికము, పాడూరను బెస్త రాజు
సాతె జేంద్రులలోన సాతాని పండితుం
డంఘులలోన నేకాక్షి శ్రేష్ఠుఁ

దతిలోభి రాజున కర్థంబు నడుగని
వాఁడె పో పండితవర్యుఁడరయ
గాఁపు మంత్రులలోనఁ గాటేరి దైవంబు
కొక్కెరాయలలోనఁ గొంగ ఘనము
గుడిసె వేటుల నిల్లాలు గుత్తలంజె
గనుక నీరీతిఁ బెక్కులు గలవు తలప
మద... 79

నంది గణం బెక్కె నడువీథినే వచ్చు
దైవమో గంగమో దమ్మరాజో
ఇనకాప్పశీనఁడో యీరుఁడో యీస్పుఁడో
యీస్పుడైతే లేదె యెనకఁ దోఁక
ఆళ్ళురో గనపతో అమ్మ చీతామ్మరో
చీతామ్మ రైయుంటె సింగమేది
మంచిది చూతాము మారమ్మ కాబోలు
మారమ్మ రైతేను మాలమేది
ప్రాకృత జనంబు లీరీతిఁ బలుకుచుంద్రు
తెలివి యించుక లేకను దెలిసి కొనక
మద... 80

పొరుగూరి కేగినఁ బోవునే దుర్దశ
కాదె పెండిలి సన్నికల్లు దాచ
డొంకల డాఁగ బిడుగుపాటు దప్పునే
కాలడ్డ నిలుచునే గాంగ ఝరము
కుమతిచేఁజెడునె యెక్కుడు మంత్రి యత్నంబు
లింకిపోవునె యనావృష్టి జలధి
ధవుడు పిన్నైన వైధవ్యంబు దప్పునే
మసడె దీర్ఘాయువై మందు లేక

అర్కుఁడుదయింపఁ జెడునె గుహా తిమిరము
తాళ మెత్తుక పోవ షాందసములోని
విత్త మలపడ కుండెనే వెచ్చముసకును
మద...                                                81

ఆరగించఁగ యోగ్యము గాక యుండునే
        పై తొక్క బిరుసైన బనస ఫలము
మాధుర్య మెడలునే మామిడి పండుకుఁ
        దాడిమ పట్టున జీడి తొరలి యున్న
గేదంగి విరి షూళిఁ గీలింప కుందురే
        యగ్ర భాగమునఁ ముళ్ళలమి కొన్న
అఖిలాంగ సీమ యొయ్యారంబు గల్గిన
        విడుతురే యొక పంక పడతికున్న
గుణము బహుళంబు దోషంబు గొంచె మైనఁ
గొదవఁ జెందక యుండు నెక్కుడు గుణంబు
మద...                                                82

గోవధ గావించి గోరోజనమ్ము రో
        గార్తుల కొసఁగఁ బుణ్యాత్ముఁడగునె
ఫలశాఖిఁ బడమొత్తి ఫలములేఱించి భూ
        సురుల కర్పించిన సుకృతి యగునె
నిండు తటాకంబు ఖండించి చేఁపల
        మత్స్యభుక్కులఁ దన్ప మాన్యుఁడగునె
గుడిగొట్టి యిటికలు గూరిచి తులసి తి
        న్నెలు రచించిన ధర్మనిరతుఁ డగునె
ప్రబలపాతక పూర్ణుఁడల్పంపు సుకృత
మునను శుద్ధుండు గాఁడు సనుట నిజము.
మద...

మందు మాకిడి గండమాల మాన్పఁగ లేఁడు
 చక్కఁజేయ గలండె నొక్కమోము
వ్రేలిపంకర మీఁద పీగనొత్తఁగ లేఁడు
 కుదురు సేయగలండె గూనివీఁపు
త్రోయఁ జాలఁడు కుక్కతోక వంకరయైన
 నేటివంకలు దీర్ప నెట్టు లోపు
తనవారి యొచ్చెంబ తాను దీర్పఁగఁ జాలఁ
 డొరుల యొచ్చము దీర్ప నోపునెట్లు

దైవకృతమైన వంకర దలఁగ ద్రోయ
వశముగాకుండు గద యెంత వానికైన
మద... 84

ఋణశేష మున్నను రిపుశేష మున్నను
 వహ్ని శేషంబున్న వచ్చుఁగీడు
భుక్తి వధూజనరక్తి నిద్రాసక్తి
 యగ్గలంబైనఁ గీడావహిల్లు
గుప్తాత్ముని తోడఁ గోపనజనముతో
 గొండిక వానితో గోష్ఠి తగదు
అర్భక పశుమందిరాంగరక్షల యందు
 నేమఱి పాటొంద నెగ్గుఁ జెందు

ఇట్టి నయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి
నట్లు చరియించువారికి హానివచ్చు
మది... 85

పెట్టి పోసిననాఁడె చుట్టాలరాకడ
 కలిమివేళనె వారకాంత వలపు
సేవ చేసిననాఁడె క్షితినాథు మన్నన
 వయసు గల్గిననాడె వనితరక్తి

విభవంబు గల నాడె వెనువెంట దిరుగుట
        పని యున్ననాడె మా వార లనుట
పోడిమి గలనాడె పొరుగింటి పోరచి
        మగుడింపఁ గలనాఁడె తగవుసూటి

ఆత్మశక్తి తొలగిన యవసరమునఁ
దనకు నెవ్వరు గానిది తథ్యమరయ
మద...                                                            ౮౬

చేరువ పగయును దూరపు మైత్రియు
        గావించె నేనియుఁ గార్యహాని
అల్పుతో వైర మన్య నృపాలునితో మైత్రి
        యొనరించెనేనియుఁ నొదవుఁగీడు
త్యాగంబునకు నాత్మ భోగంబునకు గాని
        విత్తార్జనంబు గావింపరాదు.
జాసకులోనైనఁ బ్రతిభాషలాడినఁ
        బొలఁతితో భాషింపఁ బోవఁదగదు

ఇట్టి నయమార్గమెరుగక యిచ్చవచ్చి
నట్లు చరియించువారికి హానివచ్చు.
మద                                                              87

సూర్యుండు దశశతాంశువులఁ బోగవేదజిమినఁ
        గలుగుహలు చీకటులుఁడాగ
ఝంఝూనిలము దాడిసలుప దీపమునకుఁ
        గలదే పసి ఖుంపఁగలశ మొకటి
ఘని సాహసంబు గువ్వను దాఁకఁదజిమినఁ
        దరుకోటరము లేదె దానిఁ బ్రోప
గరుడుండు వెసదాక గాకోదరముదాఁగ
        గలుగదే వాల్మీక బిలమొకండు

బలము గిలవాడు దుర్బలు బాఱదఱుమ
దైవమొక ప్రాపు గల్పింపఁదలఁపకున్నఁ
బొరలు నే ప్రౌ ఢ్ధహంకారమున నరుండు
మద 88

మౌనంబు దాల్చుట మన విచ్చగింపని
గదిమివేయుట లోభకారణంబు
దర్శనంబియ్యమి తప్పు సైపక యున్కి
పెడమోము పెటుట ప్రియములేమి
గర్వంబు దన్పుఫ కార్యాంతరాసక్తి
సమయంబుగాధంట జరుపునేర్పు
అరయుద మన్న రంధ్రాన్వేషణాసక్తి
యతి వినయంబు ధౌర్త్యంబు తెరువు

లిట్టి ప్రభుదుర్ణయపు చేష్ట లెఱుగలేక
వెంబడించెడి వాడెపో వెఱ్ఱివాడు
దానికొడ బడ డింగిత జ్ఞానిశాల
మద... 89

తనతల్లి చోటనే తప్పు సటించిన
దురితాత్మునకుఁ గురుద్రోహ మెంత
కొతుకొకింతయు లేక గురున కెగ్గొనరించు
కఠినాత్మునకుఁ గృతఘ్నత్వ మెంత
కృతమెఱుఁగని మహాకిల్బిషాయత్త చి
త్తునకు మిత్రద్రోహ మనఁగ నెంత
పరమమిత్రుల బాధపఱుచు దుర్ణయమునకుఁ
బ్రజలనందఱ గష్టపరచుటెంత

అసుచుఁదనదు చరిత్రంబు లనని జనులు
నిందసేయఁగ బ్రతుకు దుర్నీతిపరుడు
మద...

అచ్చిన వాని యిల్లాలిఁ గట్టఁగజూచు
        దా నియ్యవలసిన దండ మిడును
అలుసైన వాని యి ల్లాక్రమింపఁగ జూచు
        దనకుఁగీడైనఁ బాదములు పట్టు
అణువుగాఁ జూచుఁగొండంతైనఁ దనతప్పు
        గోరంత యొరు తప్పు కొండ సేయు
బంధులకిడఁ డంచుఁ బరుల దూషించును
        దనయిల్లు చొచ్చినఁ దడకవెట్టు

దుర్ణయుల దుర్గుణంబులఁ ద్రోయరాదు
దానికి ఫలంబు యమ సన్నిధాన మందె
మద...... 91

కందిరీగల పట్టు కడఁగి రేపఁగవచ్చు
        మానిపింపఁగరాదు దానిపోటు
చెట్లలో బెబ్బులిఁ జెనకి రావచ్చును
        దప్పించుకొనరాదు దానికాటు
పఱచునశ్వము తోఁకబట్టి యీడ్వఁగవచ్చు
        దప్పించుకోరాదు దాని తాఁపు
కాఁకచే బొరుగిల్లు గాల్చి రావచ్చును.
        దన యిల్లు కాపాడఁ దరముగాదు

గార్యతతులెల్లఁజేసి తత్కార్యఫలము
లనుభవించుపుడు రాయాయి యవసరములు
మద · 92

తస్కంబు ద్రవ్వి తస్కరు డింటివానికి
        వాసన లేదని మురువైచి పరుసె
తెరవాటుకాడు చింతించునే కట్టిన
        బట్ట పుల్చిన మానభంగ మనున

వలబడ్డమేకము చూల్వహియించె నంచును
విడువంగఁజూచునే వేఁటకాఁడు
జారుండు పరకాంతశయ్యపై దారిచి
వావి గాదని పల్కి వదలి చనునె
ఆత్మజను గుత్త రూకల కమ్మ నాతఁ
డరణము నొసంగఁజూచునె యల్లునకును
మద ......

గోముఖవ్యాఘ్రంబు కూరలో నిడునాబి
కప్పకూఁతలు గూఘు కాలభుజగ
మెరచిలోపల గాల మేటి లోపలి యూబి
పైఁబూరి గ్రమ్మిన పాడునుయ్యి
పైఁబండ్లుగలగి లోపల బుచ్చు తరుశాఖ
గొంగళిలోన దా గొలుపురాయి
చొర నేమరించి ముంచుకొను ప్రవాహంబు
కునుకుపట్టినఁ జుట్టుకొను దవాగ్ని
దుర్జనుఁడు వాని నమ్మిన దొడర కున్నె
హాని యెంతటివానికినైన జగతి
మద......



శక్తి చాలనివాఁడు సాధుత్వము వహించు
విత్తహీనుఁడు ధర్మప్రవృత్తిఁ దలఁచు
వ్యాధిపీడితుఁడు దైవభక్తిఁ జొరఁబాఱు
ముదిమి పొంది ప్రత్యయమునకుఁ జొచ్చు
ఆపద ప్రాపింప సన్యాసక్తి గ్రహించు
భారంబు పైబడ్డ బరువెఱుంగు
రమణి లేకున్న విరక్తి మంచిది యంచు
ఖనిపోవ మౌని వ్రతము దాల్చు

ఈ యభావవిర క్తులకేమి ఫలము
తినక ఛలి చొరకయె తోఁతు తెలియబడునె.
మద... 95

తన తల్లి శిశువుల తల దుంచివైచినఁ
జెడుముండ యనుచు వచింపరాదె
తన తండ్రి యొరుల విత్తము దొంగిలించిన
నన్యాయవర్తనుం డనఁగరాదె
తన దేశికుఁడు పరదార సంగమొనర్పఁ
బాపకర్ముండని పలుకరాదె
తన రాజు ప్రజలపట్లను తప్పు జూచిన
గ్రూరాత్ముఁ డనుచు వాక్రువ్వరాదె

ఇట్టి పలుకులు తప్పుగా నెన్నునట్టి
కుటిలచిత్తుల గర్వంబు కొంచెపరుప
మీకె కా కన్యులకు శక్యమే తలంప
మద... 96

ఆశకు ముదిమియు నర్థికి సౌఖ్యంబు
ధనపరాయణునకు ధర్మచింత
కఠిన మానసునకుఁ గరుణాపరత్వంబు
వెఱ్ఱిమానిసికి వివేక గరిమ
అల్పవిద్యునకు నహంకార దూరత
జారకామునికి లజ్జాభరంబు
బహుజనద్వేషికిఁ బలిమాయు రభివృద్ధి
గ్రామపాచకునకుఁ గౌరవంబు

పాపభీరుత సంతాన బాహ్యునకును
గల దనెడు వార్త గలదె లోకముల యందు
మద 97

అర్థాతురునకు గృత్యాకృత్యములు లేవు
కవి జనంబుల కెఱుంగనివి లేవు
కుక్షింభరుఁడు కాని కూటికి రోయఁడు
కామాతురుం డర్థకాంక్ష విడఁడు
వెలి చవుల్గొను కాంత వెఱవదు నిందకు
నీతకు మిక్కిలి శోకు. లేదు
పాపశీలికి దయాపరత యెందును లేదు
వెఱ్ఱివానికి సాధువృత్తి లేదు
మద్యపాయుల కనరాని మాటలేదు
గ్రామ్యమునకు గలుగ దెందు నాగరిక ముద్ర.
మద 98

ఎరవు సతం బౌనె యిల్లౌనె పందిరి
యల యెండమావులు జలంబు లౌనె
వరవు డిల్లాలౌనె వాఁపు బలం బౌనె
గులటాతనూజండు గొమరుఁడౌనె
మెఱపు దీపంబౌనె మేఘంబు గొడు గౌనె
స్వాంగవాద్యములు తూర్యంబు లౌనె
కంతి తలగ డౌనె కల యథార్థం బౌనె
పెసు బొట్టియును దస్కు పెట్టె యౌనె
కాని వస్తువుఁ బట్టుకోఁ గాంక్షచేత
బెనఁగుమాత్రంబె కాని లభింపదేమి
మద 99

వేద శాస్త్రములు వినసొంపు లేదాయె
సంగీత విద్య బల్ చౌకనాయె
కవితా రసజ్ఞత కలలోను లేదాయె
పారమార్థిక దృష్టి భస్మ మాయె

భూసురులకును దుర్బుద్ధులే మెండాయె
నల్పుల వైభవ మధిక మాయె
వర్ణాశ్రమాచార వర్తన లేదాయె
హీన కులంబులు హెచ్చులాయె

అవనిపై నింక నాఁడు పుట్టువు ప్రశస్త
మందు లంజగఁ బుట్టిన నధిక ఫలము
మద 100

# వేంకట కవి-
# కోలంక మదనగోపాల శతకము

పోలిపెద్ది వేంకటరాయకవి సమకాలికులలో వంకాయలపాటి వేంకటకవి పేర్కొనదగినవాడు. ఈతడు రచించిన మదనగోపాలశతకము అనుకరణ ప్రధానమైనను కొన్ని విశిష్ట లక్షణములు కలది. బహుళ ప్రచారము నొందిన శతకములలో ఇది ఒకటి. వావిళ్ళవారు 1928లో ప్రకటించిన ఈ శతకములో 88 పద్యములు మాత్రమే కలవు. వేంకటకవి నియోగి బ్రాహ్మణుడు. గౌతమ గోత్రుడు. పంచాక్షరీ మంత్రోపాసకుడు. గోదావరి మండలము నందలి కోలంక నివాసి. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో జీవించినట్లు శతకము నందలి వస్తువు ననుసరించి తదిత రాధారముల ననుసరించి ఊహింపవచ్చును.

భక్తి, నీతి, శృంగార భావములు - సజ్జన దుర్జన లక్షణములు - రాజుల క్రూరవర్తనము-దుష్టచిత్తవృత్తి-కలియుగ ధర్మములు-సాంసారిక జీవనము-కవుల మనస్తత్వము మున్నగు అంశము లీ శతకమున అధిక్షేపధోరణిలో వ్యక్తీకరింపబడినవి. వ్యక్తీకరణ విధానము కూడ కొంతవరకు విశిష్టమైనది.

ప్రభువులను అధికారులను వ్యక్తులను వారి దుర్వృత్తిని ఈ కవి ఆక్షేపించిన రీతిని పరిశీలించినపుడు ఆతడు వ్యక్తిగతముగ కొందరి వలన అనాదరము నొంది యుండునని అనుమానము కలుగును. వేంకటకవి ఎచటను ఆ వ్యక్తులను పేర్కొనలేదు. వారి దుశ్చర్యలను మాత్రమే సామాన్యీకరించి శతకము రచించెను.

సామాన్యనీతులను, సజ్జన లక్షణములను వివరించుపట్లు కవి భక్తి భావముల నుద్బోధించెను. కోలంక మదన గోపాలుని అనుగ్రహము లభించిన

వారికే, భగవద్భక్తి కలవారికే సకలైశ్వర్యములు భోగభాగ్యములు లభించునని సూచించెను. మానవులు ఉన్నతదశను సాధించి సుఖజీవనము గడుపుటకు భక్తి అవసరమని స్పష్టమొనర్చుట ఇట్టిది.

భర్తృహరి ననుసరించి వేంకటకవి సజ్జన దుర్జన లక్షణములను నిర్దేశించిన సందర్భములు పెక్కు కలవు-కావున దుర్జనులను వారి దుశ్చర్యల నీ కవి నిశితముగ విమర్శించెను. కొన్ని సందర్భములలో అన్యాపదేశరీతిలో నీతిబోధన మొనర్చబడినది. మూర్ఖుల చిత్తవృత్తిని సంస్కరించుట అసాధ్యమని వచించి, నానావిధములైన వారి కపట ప్రవృత్తులను విపులముగా చిత్రించుటలో ఈ కవి ప్రత్యేకమార్గము ననుసరించెను-అప్పునెగగొట్టువాడు, గురుజనద్రవ్యము నపహరించువాడు-తలిదండ్రుల కష్టపెట్టువాడు, తనయపత్నిని కామించువారు, పరదోషముల నెన్నువారు, సజ్జనులకు హాని తలపెట్టువారు, ప్రజలను పీడించు వారు. మాన్యములను హరించువారు-దానగుణహీనులు-అతిహీనవృత్తిని పాటించు వారు, మొదలగు వారిని ఈ కవి అధిక్షేపించెను. సంఘమున ప్రబలిన అనాచారము-అధర్మము మున్నగువానిని కూడ వేంకటకవి సందర్భానుసారముగ తీవ్ర దృష్టితో విమర్శించెను. చౌర్యము-జార గుణములను విమర్శించిన సందర్భము లిట్టివి

సాంఘిక వ్యవస్థ అస్తవ్యస్త మగుటకు, అధర్మవృత్తి ప్రబలుటకు కలి ప్రభావము ప్రధాన కారణమని కవి భావించెను. కొన్నింటిని బ్రహ్మసృష్టిలోని వైచిత్ర్యములుగను, మానవుల కర్మఫల జన్యముగను ఊహించెను బ్రహ్మ సృష్టిలోనే ఒకవిధమైన వైపరీత్యము కలదని ఒక సందర్భమున చాటెను. సరస సౌందర్య లక్షణ కళావతికి ముష్కరరూపుని భర్తగా కూర్చుట, సంతతసాధు నిశ్చల పుణ్యవర్తికి బలుగయ్యాళిని భార్యగా కూర్చుట ఇట్టిదని వేంకటకవి నిరూపించుటకు యత్నించెను. ఖలులకు కపట వర్తనము పుట్టుకతో వచ్చిన దనియు, అది అంతరించుట కష్టమని వారి స్వభావము నెన్ని, విసిగి, ఖలులను, మూఢులను బుట్టించిన వేధనసవలె వారిని తిట్టి ఫల మేమి టని నిర్వేదము నొందెను. కలి

పురుషుని ప్రభావమున పసులకాపరులు ప్రభువులై రనియు, మాలలు, తమ్మళ్ళు, మంగళ్ళు, సంఖులు బలు వెజ్జు లైరి అనియు, యుగధర్మములే విస్మయకరములై యున్నవనికవి ఈ అంశములను వివి ధోదాహరణములచే సమర్థించెను. ప్రభువుల పరిసక్తి దుర్గుణ, దుర్జన ప్రస్తావ వశముప వచ్చుట గమనింపదగినది. శౌర్య గుణమున్నచో రణరంగమున చూపవలయు ననియు, ప్రజల బాధించు దుష్ట వర్తనుడు సుజనుల కుపకారము చేయలే డనియు, విప్రులమాన్యముల నపహరించు వారికి అగ్రహారముల నొసంగు వాడు అపకారి అనియు, రణభీరునకు వీరుడు దారుణచర్యుడై తోచుననియు చిత్రవిచిత్ర వస్త్రాభరణములే వైభవ చిహ్నములు కావనియు నానావిధములుగ పాలకులకు వలయు గుణములను నిర్దేశించెను.

దాన గుణ శౌర్య పౌరుషవిహీనులైన అల్పులను, అతిశయోక్తులతో వర్ణించు కవులనుకూడ వేంకటకవి ఈ సందర్భమున మందలించెను. కవులు పూజ్యార్హులు, వారికి గల విశిష్ట స్థానము గుర్తించవలయుననియు సూచించెను. కవి పండితులకు యాచక గుణము, పండితులకు పరస్పర మాత్సర్యము కల్పించనిచో నలువను కీర్తించవచ్చునని భంగ్యంతరముగ కవుల ప్రకృతిని వర్ణించి విమర్శించెను - సుకవిజనములతో పోరాడువారు దుర్గతిని చెందుదురని హెచ్చరించెను.

వివిధ నీతులు సాధారణ ధోరణిలో వివరింపబడినను కొన్ని సందర్భము లలో ఖండిత దృష్టితో హెచ్చరికల రూపమున నున్నవి. కుటిల చిత్తునకు సన్తోష్టి లేదనియు, వచ్చిన అపకీర్తి పోదనియు వచించుట సామాన్య ధోరణి - ఉభయ సంధ్యల నిద్రించువానికి, బహుగుణాన్వితమైన భార్యను గూడనివారికి లక్ష్మీకటాక్షము లభించదనుటలో, అనయమెచ్చిన్యా నధికార మూడును, ద్రవ్యంబు పెల్లైన ధర్మముడుగు అను సందర్భములందును 'హెచ్చరిక' తొంగిచూచును— మాన్యములు హరించి ప్రజల పీడించి, బుధుల సొమ్ము హరించిన వారికి, కపట పవృత్తులుగల వారికి, మృత్యు, పరలోక, యమపురి బాధలను గుర్తింపజేసి హెచ్చరించిన సందర్భములు మరికొన్ని కలవు.

పూర్వనీతి శతక కర్తల ధోరణిలో వచించిన నీతులు ఈ శతకము నందును కొన్ని కలవు. భావమును మలచి మలచి వ్యక్తీకరించిన సందర్భము లందు వీనిని గమనించ వచ్చును. "యథారాజా తథాప్రజా'' అను సూక్తి ''కూతురు ప్రకటించు మాత గుణము'' అను నీతి ఈ శతకమున ప్రభువాజ్ఞ కొలదియే ప్రజల మర్యాదలు, మాత తీర్పుకొలది కూతురు నడవళ్ళు' అను భాగము లందు అనుకరణప్రాయమై కనిపించును.

అధిక్షేప శతక కర్తలలో కొందరు స్త్రీ పురుషుల మనస్తత్వమును విశ్లేషించి సుఖకరమైన సాంసారిక జీవనమునకు ఆదర్శ దంపతులు మూల స్తంభములవంటి వారని ఈ కవి ప్రస్తుతించి దుర్భర జీవనమును గడపువారిని కూర్చి విచారించెను. ఎరాఅప్పయని పాద పంకజముల సేవించి ఆతని అనుగ్రహ మునకు నోచుకొనినవారికి పన్నెలదొంతి, వరాలమూట, బంగరుబొమ్మ, గమ గమ వలచు చక్కని మల్లెపూచెండు వంటి చెలి లభించుననియు, సుగుణవతి ఇల్లాలుగల పురుషమణిభాగ్యమే భాగ్యమని ప్రస్తుతించెను. గయ్యాళి, టకుబాజి-కల్లరి-తంటాకోరుల వంటి పెండ్లాము నేలుట మగని దౌర్భాగ్యముగ భావించెను. కొన్ని సందర్భములలో వేంకటకవి స్త్రీల ప్రవృత్తిని భర్తృహరి ననుసరించి వివరించెను. చెలియలు పురుషుల చిత్తము హరింతురనియు, ధీరులైన మగవారి మనసు చూరగొందు రనియు, వారి చెలువమునకు తాళజాల రనియు వచించిన సందర్భము లిట్టివి.

సుగుణదుర్గుణములను, సుజనదుర్జనులను తారతమ్య దృష్టితో పరిశీలించుట ఈ శతకములో ప్రత్యేకముగ గమనింపవగిన అంశము. భిన్న దృక్పథము లను చూపి అధిక్షేపించు విధాన మీ సందర్భములందు చూడవచ్చును. కలియుగ మున పదయుగళశాళనాభోజికి దురాచారుడై తగు శిరస్నాన రతుండు—రణ భీరువునకు దారుణచర్యుడై తోచు ప్రబల సంగ్రామ ప్రవర్తకుండు —అను పద్యములలో ఈ ధోరణి కలదు. అనృతము, సత్యము; పాపపుణ్యకార్యములు; సంధ్యాకర్మసంత్యక్తుడు-యజ్ఞదీక్షాపరుడు; అగ్రహారప్రదాత, క్షేత్రాపహరుడు;

మున్నగువానిని తారతమ్య దృష్టితో పరిశీలించి శతులను, వారి చర్యల నధిక్షే పించెను.

దుర్గుణములను నిషేధ రూపమున వివరించి సద్గుణము లను కర్తవ్యము నుపదేశించు విధాన మీ శతకమున గలదు. విబుధుల గోష్ఠి విడువవద్దు కలిమెంత యున్న బీదల దెప్పగావద్దు-అను పద్యభాగము లిట్టివి.

ఈ శతకమున నా నా విధములుగనున్న అధిక్షేప ధోరణులలో సౌమ్యత తో పాటు తీవ్రదృష్టి కూడ ఉన్నది. ప్రతి పద్యపాదము సూక్తిప్రాయమైనది. అడిదము సూరకవి ముద్ర ఈ సందర్భములలో ప్రస్ఫుటముగా నున్నది ఊళ్లు దోచుక రాతి గుళ్ళు గట్టగ నేల—మాన్యముల్ కబళించి మఖముసేయగ నేల యడవుల చెట్లెక్కి యాడు కోతికి రత్నసౌధాగ్రసీమ సంచార మేల—'' అని అన్యాపదేశముగ నధిక్షేపించిన సందర్భములలో కవి దృష్టికి వచ్చిన వ్యక్తులు వారి దుర్గుణములే స్ఫురించుచున్నవి. భావోన్నతికి అనుగుణమైన భాష, నిశిత మును హృదయస్పర్శిగను సాగిన వ్యక్తీకరణ విధానము శతకము బహుళ జనాదరణము నొందుటకు తోడ్పడినది. సమకాలిక వ్యవస్థకు దర్పణరూపమైన ప్రశస్త శతకముగా రాణించినది.

# కోలంక శ్రీ మదనగోపాల శతకము

శ్రీకృష్ణ కేశవ చిన్మయానంద ము
కుంద గోవింద వైకుంఠవాస
దేవనారాయణ దేవదేవ యనంత
నరసింహ వామన గరుడ గమన
క్షీరాబ్ధిశయన లక్ష్మీనాథ పుండరీ
కాక్ష హృషీకేశ యాత్మరూప
మధుసూదన త్రివిక్రమ జనార్దన పురాణ
పురుష కౌస్తుభ మణిభూషితాంగ
శంఖచక్ర గదాఖడ్గ సహితహస్త
పాహిమాం దేవయని మిమ్ముఁ బ్రస్తుతింతు
భూరిమయవాస ! కోలంక పురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల ! 1

గురుతర గౌతమ గోత్ర పవిత్రుండ
ప్రథిత పంకాయల పాటి కులుఁడ
వేంకయ మంత్రి సాధ్వీమణి కామమాం
బా గర్భవార్ధి జైవాతృకుండ
గుండు వేంకటరామ కోవిద గురుదత్త
శుద్ధ పంచాక్షరీ సిద్ధి యుతుఁడ
సకల లక్షణ లక్ష్య సాహితీ నిపుణుండ
శైవ వైష్ణవ సదాచార రతుఁడఁ
వేంకటాఖ్యుఁడ నే జగ ద్విదితముగను
శతక మొనగూర్తు త్వత్సమర్పితముఁ గాఁగ
భూరిమయ... 2

దండంబు దోర్దండ మండిత కోదండ
దండంబు భూరి ప్రతాపచండ
దండంబు పాలితార్తస్తుత్య వేదండ
దండంబు ముని వరదాన శౌండ
దండంబు దండితాతత నిశాచరకాండ
దండంబు వైరి రౌద్ర ప్రకాండ
దండంబు భక్త సంత్రాణ మహోర్దండ
దండంబు బ్రహ్మాండ ధరపిచండ
దండమో పాపతిమిర మార్తాండ నీకు
ననుచు మ్రొక్కెద నన్బ్రోవు మయ్యవేగ
భూరిమయ...

శరణు జగద్భర్త శరణు శరణు
శరణు తాండవలీల శరణు పాండవపాల
శరణు పండిత ఖేల శరణు శరణు
శరణు శంకర పక్ష శరణు కింకర రక్ష
శరణు పంకరుహాక్ష శరణు శరణు
శరణు దయాసార శరణు జయాధార
శరణు నయాగార శరణు శరణు
శరణు వారణ వారణ శరణు శరణు
శరణు కారణ కారణ శరణు శరణు-
భూరిమయ... 4

హీరాయ గోపికా జారాయ రుక్మిణీ
దారాయ భవ భయోత్తారణాయ
శూరాయ ముని జన ధారాయ వరుణాప్ర
చారాయ సత్య ప్రచారణాయ

ధీరాయ వార్ధి గంభీరాయ సద్గుణ
        వారాయ దురిత నివారణాయ
స్ఫారాయ ధృత జగద్భారాయ నవ సుకు
        మారాయ కృతశత్రు మారణాయ

తే నమో యంచు వినుతించు ధీర మతులు
సిద్ధ సామ్రాజ్య లక్ష్మిచేఁ జెలగు చంద్రుడు
భూరిమయ... 5

ముసిడి తుప్పలకుఁ గొప్పులు ద్రవ్వనేటికి
        పట్టి నూతికి యొరల్ గట్ట నేల
గొడ్డుఁబోతుకు నొజ్జు కొట్టు కాయం బేల
        మాచకమ్మకు పైఁట మా టదేల
అంధురాలికి నిల్వుటద్ద మేటికి నపుం
        సకున కొయ్యారంపుఁ జాన యేల
దొంగముండకు వ్రతోద్యోగ నిష్ఠ లవేల
        జారకాంతకు సదాచార మేల

క్షుద్రగుణునకు సజ్జన గోష్ఠి యేల
మోటు కొయ్యకు మృదువైన మాట లేల
భూరిమయ... 6

దురితాత్మునకు దేవ గురుపూజనం బేల
        కర్ణ హీనునకుఁ జౌకటు లవేల
జ్వరరోగ కృశునకు హరి చందనం బేల
        పరమ లోభికి దాన పటిమ యేల
కర్మ బాహ్యునకు గంగా స్నానమేటికిఁ
        గామాంధునకుఁ దపః కాంక్ష యేల
తిండిపోతుకు నిత్య దేవచార్చన లేల
        వెట్టి వానికి సద్వివేక మేల

మూర్ఖ జనునకు సతత ప్రమోద కరణ
సాధు సజ్జన గోష్ఠి ప్రసంగ మేల
భూరిమయ... 7

కుక్కుతొత్తుకు గంధ కుసుమాగరు లవేల
గూదలంజక జరీ కోకలేల
మొండి కట్టెకు ధర్మములు దెల్పఁగానేల
సొట్ట వానికి నాట్యశోభ లేల
అంధురాలికి నయనాంత సంజ్ఞ లవేల
బోసి దానికిని దాంబూల మేల
పలు గుదండకు బతి భక్తి మార్గం బేల
చెడుగుముండకు నీతి జెప్పనేల

మూర్ఖ జనునకు బహుతరామోదకారి
సరసకవితావిచిత్ర వైఖరు లవేల
భూరిమయ... 8

గుడిగూల్చి యిటకల కొట్టు గట్టినవాడు
చెట్టుకొట్టుటకు విక్షేప పడునె
తిన్న యింటికి ఘాత పన్నఁ జూచిన క్రూరుఁ
డన్యాపకృతికి భీతాత్ముఁడగునె
చెలుల చుట్టంబులఁ జెరిపిన పాపాత్ముఁ
డొరుల మాపగఁ జింత నొందఁ గలడె
తనవారలకుఁ గీడు పలఁచిన నిర్దయుం
డితర బాధకు సంశయించఁ గలడె

తల్లి దండ్రుల హింసించు దారుణుండు
దుఃఖ పడగలఁడే గురు ద్రోహమునకు
భూరిమయ... 9

తల్లి చెవుల్ ద్రెంచఁదలచిన మూర్ఖుండు
బినతల్లి చెవి దెంచ భీతి పడునె
తండ్రిని ప్రస్తుంచి తా దిన్న దుర్మతి
యాకొన్న యతిథుల కన్న మిడునె
తమ్ముల పాలి విత్తమ్ము ద్రింగు ఖలుండు
పరధనంబుల కాస పడక యున్నె
తనయుల పట్ల మాత్సర్యమూను దురాత్ము
డన్య వైరము దోషమని తలఁచునె
నమ్మువారిని చెఱచు దుర్ణయపరుండు
యితరులను బాగుజేయ నూహింపఁ గలడె
భూరిమయ... 10

పైతృకంబున రాత్రి భక్షించు చపలుండు
నుపవాసములు నిష నుండఁ గలడె
యిలు వెడలంగఁ దానలయు మూలుగుచుఁబోఁతు
తీర్థయాత్రా సక్తిఁ దిరుగఁ గలఁడె
గ్రహణ కాలమున మున్గని మందుఁ డనిశంబు
వేకువ ప్రాత స్స్నాన విధికి జనునె
బాపఁడి కొక స్వయంపాక మియ్యని లోభి
నిత్యాన్న సత్త్రంబు నిలుపఁ గలఁడె
తనదు పెండ్లాము నదిమి దీర్పని జడుండు
ఎవిరి మఱపంద్రఁ గోడండ్రఁదీర్పఁగలడె
భూరిమయ... 11

పిడికెడు బిచ్చంబుఁ బెట్టజాలని దాత
యిష్టార్థ సంసిద్ధు లివ్వఁగలఁడె
చేని గట్టే దాటలేని గుఱ్ఱము వైరి
గిరి దుర్గములకు లంఘించగలడె

యూరబందికి భీతినొంది పారిన బంటు
దాడి బెబ్బులుల వేటాడ గలఁడె
కొలుచువారికి జీతములు నొసంగని దొర
యర్థుల బిలిచి వెయ్యార్లు లిడునె

బట్టు బొగడిన నొకపూట బత్తెమిడని
యతినికృష్టుఁడు సత్కృతుఁలందగలడె
భూరిమయ... 12

అప్పిచ్చి యిమ్మని యడుగునాత దధర్ముఁ
డెగదొబ్బునాతఁడు తగవు పెద్ద
అడ్డుండి తప్పించు మనువాడు కఠినుండు
తంటాలు బెట్టునాతఁడు సాధు
వెరువిచ్చి యడిగిన నరుడు దుర్మార్గుఁడు
నమ్మమతిన్న వాఁడార్యపియుఁడు
దాఁచనిచ్చిన సొమ్ము దలచువాఁ డవివేకి
లేదు పొమ్మనువాఁడు వెదవెత్త

యనుచు తీర్పులు చేసిన యట్టి మూర్ఖుఁ
లంతకన్నను గుణవంతు లవనిలోన
భూరిమయ... 13

తనదు దరిద్రత్వమునకు నేడ్వఁగనేల
యితర సంపద తా సహింపలేక
తన యాలు బంజుఁబోయినఁ గృశింపఁగనేల
తా నన్యసతి పొందు మాన లేక
తనదు శత్రు లసాధ్యులని చింత పడనేల
యొరుల మూర్ఖంగఁ దా నుడుగలేక
తనపుత్రు లవగుణులని మొత్తుకోనేల
యొకరి బిడ్డలనీతి కోర్వ లేక

యెఱుఁగనేరని మూఢుల కేమిజెప్ప
దీనికి ఫలంబు మీఁదను గానవచ్చు
భూరిమయ... 14

తన తాత నిరతాన్న దాతయం చననేల
ముసలామె యూళ్ళంట ముష్టియెత్త
తన తండ్రిగారు సద్వ్రత నిష్ఠుఁడననేల
తల్లి బల్ జారవర్తనలు సేయ
తనదు భార్యను వరగుణవతి యననేల
కూఁతురు తలవంపురీతి నడువ
తనవారలంత సద్ధర్మాత్ము లననేల
చెల్లెండ్రు చౌర్యముల్ సేయుచున్న
తాను తీర్పరినని యభిమాన మేల
కొడుకు నొకమూలఁ దెరవాట్లు గొట్టుచున్న
భూరిమయ... 15

అప్పు పుచ్చుకొని లేదను మొండి కొయ్యకుఁ
బత్రంబు చించుకో భార మగునె
గురుజన ద్రవ్యాపహరణశీలున కన్య
ధనము హరింప సంతాప మగునె
తల్లిదండ్రులను బాధల బెట్టు క్రూర చి
త్తునకు బాంధవపీడ దోష మగునె
పాలించు ప్రభుపు కపాయమెంచు దురాత్ము
నకు మిత్రఘాత మన్యాయ మగునె
తనయుఁ పత్నిని రమియించు దారుణునకు
పరసతీసంగమాసక్తి పాప మగునె
భూరిమయ 16

పుత్రికకే నల్లపూసఁ బెట్టనిభామ
గా రల్లునకు రత్నహార మిడునె
పెనిమిటికే కూడుఁ బెట్టని యిల్లాలు
శ్రితబంధులకు విందు సేయఁగలదె
తన తల్లిపట్లనె తప్పిన మూర్ఖుఁ డిం
తల్లి యాజ్ఞారీతి మళ్ళఁగలదె
తమ్ములకె కీడు తలచెడు పాపాత్ముఁ
డొకరి భాగుకుఁ జింత యుంచఁగలఁడె

యిట్టి దుర్మార్గవర్తుల కెవరు చెప్పఁ
గలరు యమరాజు నొకఁడు దక్కంగ జగతి
భూరిమయ 17

తల్లిని వేరుంచి తమ్ముల విడఁదోలి
అక్కచెల్లెండ్ర సొమ్మపహరించి
బంధువులను తృణప్రాయంబుగా నెంచి
యొరుల మాపఁగ మది నూహఁ జేసి
తనకన్నఁ దెలిసిన జనుఁ డెవ్వఁడని క్రొవ్వి
యించుకంతయు ధర్మ మెఱుగకుండి
లోపల బహు దురాలోచనంబులు జేసి
పైకి నీతులఁ బెక్కు బలుకు చుండి

బుధులకొరకే కీడు సేయంగఁ బూనఁ జూచు
నిట్టి పురుషాధముని జన్మ మెంచుకొనఁగ
భూరిమయ... 18

పరజన ద్రవ్యాపహరణత్వ మొక్కటి
అన్యసతి సంగమాప్తి యొకటి
పితృమాతృ సద్భక్తి విముఖత్వ మొక్కటి
యాశ్రితజన పరిత్యాగ మొకటి

సాధు సజ్జన బంధుజన దూష్య మొక్కటి
స్వామి నిందాపతభావ మొకటి
వివిధ పండితవర్గ విద్వేష మొక్కటి
మిత్ర ఘాతృత్వ ప్రమేయ మొకటి

యిన్నియును గల్గి నర్తించుచున్న మోట
కొయ్యల కొకళ్ళ తీర్పులు చెయ్యగలరె
భూరిమయ... 19

తనవారు తలవంపుపనులు జేయసహించుc
బరులుcజేసిన తప్పుపట్టిc జూచు
దనయింటిలో కానిపని కమ్ముకో జూచుc
బొరిగింటి పని రవ్వపరుపcదలcచుc
దన పుత్రి వారవర్తన మాటుcపడc జేయు
పరుల బిడ్డల అంకు బయలcబెట్టుc
తనదు చెల్లెలిదొంగతనము లోన నడంచు
లాcతి వారైన హేళన మొనర్చు

యిట్టి దుర్మార్గులకు యమపట్టణమున
దీనికి ఫలంబు తథ్యమైcగాన వచ్చు
భూరిమయ 20

వ్యాఘ్రంబు లేళ్ళుజంపక మళ్ళిపోవునె
పిల్లిమానునె కోడిపిల్ల బట్టc
దోcడేలు మేcకల దునుమాడకుండునె
పెనుcబాము గప్పల దినకయున్నె
కొంగ చేపల గఱుస్కన మ్రింగకుండునె
డేcగ సుప్పాలను పీకిపకున్నె
దుంత గుఱ్ఱములను దొబరికొట్టిక యున్నె
కాకి cగోరలcదన్ని కఱువకున్నె

ఖలుఁడు సజ్జనులకుఁ గీడు దలఁపకున్నె
కూడదని యెందఱన్న నీక్షోణియందు
భూరిమయ 21

చూలింతరా లని తేలు మన్నించునె
ముసలిగోవని కాకి మ్రొక్కులిడునె
ఫలవృక్షమని కదల్పకపోవునే గాడ్పు
భూసురుండని పులి పూజ లిడునె
పలుకు చిల్కని పిల్లి తలచి యూరకయున్నె
యీను చే నని మశ్కి యెద్దు జనునె

ప్రజల బాధించు దుష్టవర్తనుఁ డొకండు
సుజనునకుఁ గీడు సేయంగఁజూడకున్నె
భూరిమయ 22

కంటిలోపల పెద్దకాయ గాచినలాగు
కడుపులోపల బల్ల బొడిమి నట్లు
నరములపై గొప్పకురుపు పుట్టిన మాడ్కి
పెడతలనొక కంతె పెరిగి నట్లు
కాలిలోపల కొట్టు గట్టిగా దిగి నట్లు
పొట్టలోపల శూల బొడిచి నట్లు
మూత్రరంధ్రములోన ముల్లు నాటి**ప** యట్లు
గూఁబలోపల పుర్వుగొఱికి నట్లు

చెడుగు కొడు కొక్కరుఁడు బుట్టి చెడ్డహాని
వాని తలిదండ్రులకు సేయు వసుధ యందు
భూరిమయ ...... 23

ప్రబల శత్రువుల...దెంచఁబోలేఁడు
        బీదలఁ జంపంగ పెద్దమేకము
యెదిరించువారి నదేరా యనఁగలేడు
        బుధుల మార్గానఁ బెద్ద బోట్లగిత్త
తన్న వచ్చినవారి దరిఁజేరఁగాలేఁడు
        సాధులపైకి విస్తార బలుఁడు
తన యిల్లు పుచ్చుకోఁ దలచువారికి మ్రొక్కఁ
        బరుల మాపఁగ బహూపాపెయుంత్త

హరిహరీ! యిటి పాపాత్ము లవనిలోన
మన్నుచున్నార లేమని విన్నవింతు
భూరిమయ... 24

వీరు పెద్ద లటంచు వీరు బంధువులంచు
        వీరు సజ్జను లటంచు వీరు గురువు
లంచును వీరు ధరామరోత్తము లంచు
        వీరు యోగ్యు లటంచు వీరు సుకవు
లంచును వీర లాచార్యులంచును వీరు
        విద్వాంసు లంచును వీరు సద్వ
చారు లంచును వీరు సదమలాత్ములటంచు
        వీరు పూజార్హ ప్రచారు లంచు

నెంచుకంతయు మదిలోఁ దలచఁబోడు
దుండగంబుసఁ బలుగాకి మొండికొయ్య
భూరిమయ.... 25

పులిని జంపఁగ నక్కపోతు గాచినలాగు
        జలధి యీదఁగఁ గుక్క జరుగు పగిది
గరుడుని గటప నీర్కాకి పొంచిన మాడ్కి
        కొండ ద్రోయఁగ గొఱ్ఱె కుదురు రీతి

దంతితోఁ బెనగఁగ దుంత బోయినమాడ్కి
వృషభ మడ్డఁగఁ బిల్లి యెగిరి నట్లు
కాలసర్పము ద్రింగఁ గప్ప జూచిన రీతి
దీపమార్పఁగ నీఁగ దిరుగు భాతి

ధరణి నధమాధముం డొక్క నరుఁడు క్రొవ్వి
గొప్పవారలతో నెదుర్కొనఁ దలంచు
భూరిమయ... 26

ధర్మంబు వీసమంతయుఁ దల్పఁగా నాస్తి
దాన మున్నది కలలోన సున్న
అర్థపాలనము రవంతగానఁ గవట్టిఁ
సత్య వాక్యంబు లేశంబు లేమి
కారుణ్య భావంబు గోరంతయునుఁ గల్ల
శమదమాసక్తి కొంచెము హుళక్కి
స్నాన సంధ్యాద్యనుష్ఠాన కర్మం బిల్ల
శైవ వైష్ణవభక్తి త్రోవజబ్బు

యిట్టి మూఢులఁ బుట్టించి నట్టి బ్రహ్మ
ననఁగవలె గాక వీంద్రఁ దిట్టను బనేమి
భూరిమయ... 27

అన్యాపకృతి వాని కాధారభూతంబు
దుర్బుద్ధి వానికిఁ దోఁడునీడ
దారుణత్వము వాని తలపై కిరీటంబు
పరదూషణము వాని పంట చేను
అన్యాయవృత్తి వీడభ్యసించిన విద్య
బంధు వైరము వాని పట్టుకొమ్మ
ప్రాణి హింసాకర్మ వాని నిత్య జపంబు
పాప శీలము వాని ప్రాలి సొమ్ము

అనుచు లోకుల తన్నాడుకొనుచు నుండ
బ్రతుకు మనుజునికన్న గార్దభము మేలు
భూరిమయ్య... 28

మహితోపకార ధర్మము వహించడు గాని
యసహాయ శూరుఁ డన్యాపకృతికి
సముచిత శాస్త్ర చర్చ సేయఁడుఁ గాని
మూర్ఖ వాదములకు మొదటి చెయ్యి
పుణ్య కార్యారంభ బుద్ధిఁ గాంచఁడు గాని
పాప కర్మకు మత స్థాపకుండు
పరలోక చింతఁ దల్పఁడు ప్రాణి హిం
సాకర్మయందు నిష్ఠా గరిష్ఠుఁ

డనుచు భూజను లిట్లు దన్నాఁడు కొనఁగఁ
నుండు మనుజుండు జీవన్మృతుండు గాఁడె
భూరిమయ... 29

పృథు శౌర్యమున్నఁ జూపింపగావలె శత్రు
సేనలపైకి వేంచేయు నాఁడు
దృఢ విద్య యున్న వాదింపఁగావలె మహా
రాజ ధీర సభాంతరాళమునను
వర కవిత్వంబున్న బ్రకటింపవలె ద్రోహ
కారి మూర్ఖుల దిట్టు కాల మందు
అమిత ధైర్యం బున్న నగుపింపవలె మహా
ఘన విపద్దశ ప్రాప్త కాల మందు

నగుపఱుపకున్నఁ జచ్చు పీనుఁగులు గాక
పరలోక పూజ్యులా పృథివీ స్థలమున
భూరిమయ...

జారుఁడై దుష్ట ప్రచారుఁడై పాపవి
చారుఁడై బహు దురాచారుఁడగుచు
హీనుఁడై మూర్ఖ సంతానుఁడై త్యక్తాభి
మానుఁడై నిరతాప్రమాణుఁడగుచు
దుష్టుఁడై సజ్జన కష్టుఁడై కోప సం
దష్టుఁడై నిజకుల భ్రష్టుఁడగుచుఁ
గ్రోధియై బంధు విరోధియై బహుజన
బాధియై బుధమనో వ్యాధి యగుచుఁ

బరగుచున్నట్టి నిర్భాగ్యవరుఁడు తనదు
పొట్ట నిక్కడ యగునె యా పయిని గాక
భూరిమయ... 31

యేపి నందలము పైకెక్కించినను గ్రింది
కురువడి పుల్లెల కురుక కున్నె
పిల్లిని గద్దియఁ బెట్టి పూజించిన
నుచ్ఛిష్ట భక్షణం బుడుగఁగలదె
బలు చక్కెరల యుక్కెరలఁ గాకిఁ బెంచిన
కారుకూఁతలు గూయఁ గణఁగకున్నె
దున్నపోతుకు నెన్ని వన్నెలు దిద్దిన
బురద గోతులలోనఁ బొరలకున్నె

నీచ మనుజుని బుధులు మన్నించి పేరఁ
బిలిచినను వాని గుణము జూపింప కున్నె
భూరిమయ... 32

కలిగిన మాత్ర మర్థుల కొసంగని వాఁడు
నొరుల కల్మికి దుఃఖ మొందు వాఁడు
సంతత దుర్ణయాచారుఁడై దగు వాఁడు
పరుల బాధింపఁ బాల్పడెడు వాఁడు

తమ్ముల జెరుప యత్నము దలంచెడు వాడు
బుధులలో వైరంబుఁ బూను వాఁడు
పమగురు కాదన్న పనులు జేసెడి వాఁడు
పరధనంబుల కాసపడెడు వాఁడు
సుకవి జనములతోఁ జోరఁ జూచు వాఁడు
దుర్గతిని జెంచు నిహపర దూరుఁడగుచు
భూరిమయ... 33

పరువుపాడై జను పౌరుష మణగారు
కులము గోదావరి కూల జరుగు
మహిమ మర్యాదలు మంటిలో గలియును
చదువులు సంధ్యలు చట్టువారు
ప్రజ్ఞలు బుద్ధులు పరలోక మేగును
గొప్పలు కీర్తులు తుప్పలెక్కు
ధర్మమార్గము నీతి నిర్మూలమైయుండు
సకల ప్రతిష్ఠలు సన్నగిల్లు
వంశమందున నొక పాప వర్తనుండు
బుట్టుటను జేసి బుధుల కీ భూమియందు
భూరిమయ... 34

గడియ లోపల పెక్కు కల్లలాడఁగ వచ్చు
నాడిన మాట లేదనఁగ వచ్చు
అప్పుల నెగదొబ్బ చెప్పుకొమ్మనవచ్చు
జుట్టులఁ జుల్కగాఁ జూడవచ్చు
తనవాడనక బాధలను బెట్టగా వచ్చు
మిత్రఘాతకవృత్తి మెలఁగ వచ్చు
నొరుల కొంపల మాప మూహ సేయఁగవచ్చు
తనయులనైనఁ బోఁదరమ వచ్చుఁ

గాని యమలోక బాధ యొక్కటియుఁ గడుపఁ
గఠినచిత్తుల కది చేతఁగాదు సుమ్ము
భూరిమయ... ౨౫

వ్రాసినవ్రాతదా వ్రాయలేదన వచ్చుఁ
దప్పుఁజేసుక లోన దాఁచ వచ్చు
నీతి దెల్పఁగఁబోయి బూతులాడఁగ వచ్చు
పెద్దలు కాదన్నఁ బెనఁగవచ్చు
నింటికేఁగిన వారి నెదిరికొట్టఁగవచ్చుఁ
గానికూటికి నోడిగట్టవచ్చు
పలుగుకొయ్యలమాట పాటిసేయఁగ వచ్చు
బుధులవాక్యము త్రోసిపుచ్చ వచ్చుఁ
గాని క్రూరులు యమభటఘనగదాభి
హతుల బాల్గాకయుండ శక్యంబె తమకు
భూరిమయ ...... 26

తల్లి బందెలమారి తండ్రి యప్పులముచ్చు
జ్ఞాతి బహుద్వేషి భ్రాత కోపి
మరదలు బహుదండి మామగా రవివేకి
యత్త దుర్గుణ గణాయత్త బావ
మరిఁది తంతరగొట్టుమనిషి కోడలు మంకు
భార్య గయ్యాళి నిర్భాగ్యురాలు
చెల్లెలు గడుదొంగ యల్లుఁడుకూళ పు
త్రుడు దుర్జయుండు కూఁతురు పిసాళి
అందరికి పెద్ద దుర్మార్గుఁడరయ తాను
యట్టి పురుషాధముని జన్మమెంచ కొఱకు
భూరిమయ ...... 27

కన్నగానికి జూదగాఁడు మిత్రుఁడు మద్య
పానవృత్తికిఁకులభ్రష్టు గురువు
పరమలోభికి మలభక్షకుం దధిపతి
గుణహీనునకుఁ బల్లుకొయ్య తండ్రి
ధర్మశూన్యునకుఁ గృతఘ్నుండు చుట్టంబు
ఋుండివానికి దుర్జయుఁడు కొడుకు
కర్మబాహ్యునకు సంకరకులుం డాప్తుండు
దొంగముండకు లంజ తోడునీడ

యగుచు నన్యోన్య సంబంధ మమరియున్న
యట్టి వారలె సిరిగాంచిరీ ధరిత్రి
భూరిమయ ......

తండ్రి దూషించి పెద్దల నుతింపఁగనేల
తమ్ముల ఁజెరిపి సద్ధర్మమేల
తల్లిని దన్ని బాంధవ పూజనం బేల
మిత్రుని విడిచి పై మేళ్ళవేల
గుతుని నిందించి భూసురుల వేఁడఁగ నేల
బిడ్డనమ్మి యొకండ్రఁ బెంచనేల
యాశ్రితు నటు దోలి యర్థి రక్షణమేల
పెనిమిటి దిట్టు దైవనుతియేల

యెఱుఁగనేరని మూఢులకేమి చెప్పఁ
దెలియఁబడవచ్చు యమసభాస్థలము నందు
భూరిమయ ......

39

ఊళ్ళు దోఁచుక రాతిగుళ్ళు గట్టఁగనేల
యిళ్ళు బుచ్చుక తోఁట లేయనేల
ప్రజలఁ బీడించి ధర్మము సేయఁగా నేల
దార్లగొట్టి సువర్ణదాన మేల

10)

మాన్యముల్ కబళించి సుఖము సేయఁగ నేఁ
సాధులఁ జెరిపి పై శాంతు లేల
బుధుల సొమ్ము హరించి భూరి యివ్వఁగనేల
పురములు గూల్చి గోపురము తేల

యిందుకు ఫలంబు దేహాంతమందె తమకు
నెఱుఁక బడుగాక కూళల కేల చెప్ప
భూరిమయ.. 40

బురదగోతుల లోనఁ బొరలాడు దుంతకు
సారచందన గంధ చర్చయేల
పరగళ్ళ వెంబడి తిరుగు గాడిదికి వి
శాల మందిర నివాసంబు లేల
బయల పుల్లెలు నాకి బ్రతికెడు కుక్కకు
సరసాన్న భక్ష్య భక్షణము లేల
యడవుల చెట్టెక్కి యాడు కోతికి రత్న
సౌధాగ్రసీమ సంచార మేల

మూర్జ జనులకు సతత ప్రమోదకరణ
సాధు సజ్జన గోష్ఠి ప్రసంగ మేల
భూరిమయ... 41

పదుగురు మెచ్చి శాబాసు నన్నది మాట
వడి మృగంబుల జిక్కనడిన మీట
వ్యాఘ్రసింహముల నుక్కణగించునది వేఁట
యఖిల ఫలోత్కృష్టమైన తోట
నిండుగా బహుజను లుండునదే పేట
యిల్లాలు గల్గుట యింటి తేట
పరులచే సాధింపఁ బడకయున్నదె కోట
పది మంది నడచు చున్నదియ బాట

విన్న వారికి హృద్యమై యున్న వాట
కన్న వారికిఁ జిత్రమై యున్న నాఁ
భూరిమయ... 42

కలిమెంత గలిగిన దొలఁగ వాపత్తులు
తమ రెన్ని విధములఁ దన్నుకొన్న
తపమెంత గలిగిన తప్పదు కర్మంబు
తోఁచక తమరెంత గుఃఖ పడిన
చదువెంత గలిగిన వదలదు దారిద్ర్య
మూరకె తమ రెన్ని యూళ్ళుఁ జనిన
బలమెంత గలిగిన బాయవు వ్యాధులు
తమరు నెన్నో యుపాయముల నున్న
యనుభవంబులు దప్పించు కొనఁగ శక్తి
గల్గునే స్వామి నీ యనుగ్రహము దక్క
భూరిమయ... 43

కలిమెంత యున్న బీదలఁదెప్పగా వద్దు
విద్య యెంతున్న గద్దింప వలదు
ధనమెంత యున్న మత్తత వహింపఁగ వద్దు
దొరతనం బెంతున్న త్రుళ్ళ వద్దు
వీర్యం బదెంతున్న విఱ్ఱవీఁగఁగ వద్దు
తపమెంత యున్న క్రోధింప వలదు
బలమెంతయున్న దుర్బలు నదెంతన వద్దు
ప్రజ్ఞ లెన్నున్నఁ జెప్పంగ వలదు
సాటిఁజెప్పిన యీమాట పాటి జేసి
యున్న మనుజులు బహుకీర్తి నొంద గలరు
భూరిమయ...

పరవంచనా బుద్ధి పాటిసేయఁగ వద్దు
విబుధులతో గోష్ఠి విడువ వద్దు
ఉపకారి కపకార మూహసేయఁగ వద్దు
అన్యుల నిందోక్తు లాఁడవద్దు
పెద్దలు తగవుజెప్పినఁ ద్రోయగా వద్దు
పరుల బాగుకుఁ జింతపడఁగ వద్దు
పలుగు కొయ్యలను జేపట్టి యుండఁగ వద్దు
శివవిష్ణు దూషణల్ సేయ వద్దు

ఇది యెఱుంగని కూళల కేల చెప్పఁ
తెలియఁబడవచ్చు యమ సభాస్థలము నందు
భూరిమయ...

45

ఆత్మకన్యా విక్రయాసక్తునకు మత
దూషకుండగు కూకుదుండు దలఁప
పదయుగ షాళనాభావభోజికి దురా
చారుడై తగు శిరస్స్నాన రతుఁడు
విప్ర వర్గ క్షేత్ర విత్తహారికి యప
రాధియౌ నగ్రహార ప్రదాత
సతత సంధ్యాకర్మ సంత్యక్తునకు మహా
శఠుఁడునౌ యజ్ఞదీక్షాపరుండు

అహహ యీ కలికాల మహాత్మ్య మరయ
వింతయ్యేదోఁచెఁగద ధరాభ్యంతరమును
భూరిమయ...

46

రణభీరునకు దారుణ చర్యుఁడై తోచు
ప్రబల సంగ్రామ ప్రవర్తకుండు
సస్కృత భాషకి ససహ్యోలాపుఁడై యుండు
ఘనతర సత్యవార్య వ్రతుండు

జడమానసునకుఁ బ్రేలుడి గాయవలెనుండు
సరస తర్కోక్తి ప్రసంగశాలి
పాపకారికి దుష్ట భావనుండై తగు
పుణ్యకార్యారంభ బుద్ధిచరితుఁ
డహహ యీ యుగధర్మంబు లరయఁదరమె
యిట్టి కుమతులె సుజనుల నెన్నుచుంద్రు
భూరిమయ... 47

చందన గంధంబు చర్చసేయుట దొడ్డ
బురద దాల్పదె దున్నపోతు మేన
బంగరు తగటి దుప్పటి గప్పుగొప్పానె
గంగిరెద్దుకు లేదె రంగుదొంత
రమణీయ రత్నహారముఁ దాల్చ మొకనీదె
వేసగానికి లేవె వింతపేర్లు
ఘనతరంబగు సొమ్ము గణియించ ప్రతిభానె
వారకాంతకు లేదె భూరిధనము
వైభవంబున కవి గావు వరుస లరయ
అమితదానయశః ప్రతాపములుగాని
భూరిమయ... 48

కన్నబిడ్డల జంపగడఁగఁ జూచినయది
తల్లి గాదొక విషవల్లిగాని
తలిదండ్రులకు హానిఁగలుగజేసినవాఁడు
కొడుకుగాడొక పెద్దపడుకుగాని
తనయుల నందందఁ దరమికొట్టెడివాఁడు
తాతగాఁడొక యమదూతగాని
తమ్ములఁజెఱుప యత్నమ్ము జేసెడివాఁడు
నన్నగాఁడొక మోట దున్నగాని

తనదు దాయాదులను బ్రోవఁదలఁపఁడేని
నరుఁడు గాఁడతఁడు వానరుఁడుగాని
భూరిమయ... 49

కాయంబు మృదుగతి కంటకి యెఱుఁగునే
పుష్పవాసన చీడపుర్వు గనునె
పాయసరుచి తెడ్డుబద్ద గ్రహించునె
తేనెతీపిని సిద్ది తెలియఁగలదె
సాన చన్దనగంధ సౌరభ్య మెఱుఁగునె
సూత్రంబు మౌక్తిక శుద్ధి గనునె
జలము మహాత్మ్యంబు దెలియనేర్చునె కప్ప
అడవి యోషధిసత్వ మరయఁగలదె

తులువమానిసి పెద్దలఁ గలసియున్న
గాని వారి గుణంబులుఁ గాంచఁగలదె
భూరిమయ... 50

ఎలుకలఁజంపి పిల్లులకుఁ బెట్టించి గు
వ్వల దుసుమాది సాళ్వముల కొసగి
కప్పలబట్టి నీర్కాట్టెల కొప్పించి
లేళ్ళ ఖండించి తోడేళ్ళ కిచ్చి
బలు దుప్పులను ద్రుంచి పులుల ముందటఁబెట్టి
బక్కలసక్కల పాలు చేసి
ఫలవృక్షవనము కట్టెల క్రింద జూరిచ్చి
పొట్టచేతోక్కాసి యాబోతుమేపి

వట్టి తమవంటి ధర్మాత్ము లవనిలోన
గలరెయని మోటుకొయ్యలుఁ బలుకుచుంద్రు
భూరిమయ... 51

గడుపిశాచమురీతి నెడపక భక్షించి
        గ్రామ సూకర మట్లుఁ గడుపు పెంచి
గాడిదె యికిలించు గతిని పళ్ళికిలించి
        గొప్ప యాఁబోతులాగున మదించి
ముదికోఁతి లాగున మొకము బిడాయించి
        వరఁడు పోలికె యిక్కువలు గవించి
దున్న చొప్పున పెద్ద పిన్నల దొలగించి
        తలపుచ్చు శునకంబువలె వరించి

మించి తాఁబెద్దనంచు గర్వించియున్న
హీనునకుఁ గీర్తి గల్గునా యెంచిచూడ
భూరిమయ ...... 52

కౌటిల్య మెక్కువ కార్పణ్య మధికంబు
        మాత్యర మురవు దుర్మదము తరుచు
కోపంబుగాటంబు క్రూరత్వము ఘనంబు
        గర్వంబులావు ముష్కరత దొడ్డ
దారుణత్వము పెల్లు దౌర్జన్య మతిగొప్ప
        జారత్వ మెచ్చు దౌష్ట్యంబు పెక్కు
చాంచల్యగుణము విస్తారంబు చాపల్య
        మతిమాత్ర మన్యాయగతి సమృద్ధి

గలిగి వర్తించు పాపచిత్తులు హసించి
యెగ్గులెన్నుదు రార్యుల సిగ్గుమాని
భూరిమయ ...... 53

సవమల స్తుత్యవంశమునకు దౌర్జన్య
        కారిహీనుని బెద్దగా నమర్చి
సంతత సాధు నిశ్చల పుణ్యవర్తికిఁ
        బలుగు గయ్యాళిని భార్యఁగూర్చి

బహుధర్మ కీర్తితత్పరునకు దుర్జయా
కరు మూర్ఖుఁడనయునిగా నొనర్చి
సరస సౌందర్య లక్షణ కళావతికి ము
ష్కరకుకుష్ఠి భర్తగాఁ గుదిర్చి

అబ్జభవుఁడు తదీయపూజ్యత్వ మెల్లఁ
బనికి రానియ్యఁడది యేమి పాప మొక్కొ
భూరిమయ ...... 54

కొండంత విత్తంబుఁగూడఁ బెట్టిన నేమి
దానహీనుండైన మానవుండు
నిఖిల విద్యాభ్యాస నిపుణుఁడైనను నేమి
యమిత దుర్గర్వాంధుఁడైన మనుజుఁ
డురుతర సంపత్తు లొదవియుండిన నేమి
దీనరక్షా శూన్యుఁడైన జనుఁడు
బహుకాల మాయువు బడసి యుండిన నేమి
యశకీర్తి భాజనుండైన నరుఁడు

యిట్టివారల గొప్పల నెన్నుచున్న
పురుష నవివేక మెంతని పొగడవచ్చు
భూరిమయ ...... 55

చతురంగ బల సమున్నతి నిగ్రాలిననేమి
యాపన్న రక్ష సేయని నికృష్టుఁ
డిద్ధరాతల మంత నేలుచుండిన నేమి
బుధులఁ బోషించని మూర్ఖ చిత్తుఁ
డన్య దేశంబులు నాక్రమించిన నేమి
ప్రజయార్తి వాపి బ్రోవని ఖలుండు
బిరుదు పెక్కెంబులు పెక్కు పూనిన నేమి
శరణాగతులను బ్రోచని దురాత్ముఁ

డిట్టివారల సౌభాగ్య మెంచుకొనకు
వీరిఁ గొనియాడఁ బో డపస్మారి గాని
భూరిమయ... 56

ప్రభునాజ్ఞ కొలఁదియే ప్రజలమర్యాదలు
పతిశిక్ష కొలఁదియే సతిగుణమ్ము
భాగ్యంబు కొలఁదియే బంధు సన్మానంబు
తిండి కొలందియే దేహపుష్టి
మాత తీర్పుకొలంది కూతురు నడవళ్ళు
నేల మంచికొలంది నేలపంట
గురుబోధనా ప్రౌఢికొలఁది శిష్యతతెల్వి
తండ్రి నీతికొలఁది తనయువృత్తి
గాని యెక్కువ తృణమంత గలుగఁబోదు
తోఁచ కూఱకె చింతించి దుఃఖపడిన
భూరిమయ... 57

తిండిపోతుకుఁ గూటి కుండ యందునె భ్రాంతి
దురితాత్మునకు గురుద్రోహ చింత
కామాతురున కన్యకాంతా రతాసక్తి
పలుగు కొయ్యకుఁ గాని పనుల తల్లఁపు
పాపకారికి సజ్జనాపకార విచార
మతిహీనగుణుకి నీచానురక్తి
క్రూర చిత్తునకు సద్గోష్ఠి జన ద్వేష
మతి ధనాకాంక్షి కన్యాయబుద్ధి
బాయవెప్పుడు వారల పాలికర్మ
మెట్టిదియొకాని యెఱుఁగరా దెవరికైన
భూరిమయ... 58

దుర్బుద్ధి బలువైనఁ దొలగును సంపత్తి
కృపణత్వ మొదవినఁ గీర్తి మళ్ళు
నన్యాయ మెచ్చిన నధికార మూడును
మదముదట్టినఁ జను మార్దవంబు
జారత్వ మెచ్చిన సన్నగిలుఁ బ్రతిష్ఠ
కుటిలతఁ మురువైన గొప్ప చెడును
గర్వంబు తరుచైన గౌరవంబుఁ దొలంగు
ద్రవ్యాశ పెల్లైన ధర్మ ముడుగు

యివి యెఱుంగక వర్తించు హీనజనులు
పనికి రాకుండుదురు గడ్డిపరకకైన
భూరిమయ... 59

ప్రభువు దుర్ణయుఁడైన ప్రజలు చేసిన కర్మ
పతి విరక్తుండైన భార్య కర్మ
అర్థాధికుఁడు లోభియైన నర్థుల కర్మ
కరణము చెడుగైన కాపు కర్మ
తండ్రి కుత్సితుఁడైన తనయవర్గము కర్మ
తల్లి నిర్దయయైన పల్లె కర్మ
క్షితి చిక్కఁదేరిక చేని యాతని కర్మ
కుటిలుఁడైన నరుండు కులము కర్మ

గానివారల దుష్కర్మగాదు తలఁప
నెఱుఁగనేరక వారి నెగ్గెన్నరాదు
భూరిమయ... 60

కవిజనంబుల కుపద్రవముఁ దల్పుట ముప్పు
బలవంతుతో వైరపడుట ముప్పు
దేశాధిపతిని నిందించఁబూనుట ముప్పు
గ్రామాధికారితోఁ గక్ష ముప్పు

చెడి చుట్టమింటికిఁ జేరఁబోవుట ముప్పు
　　చెడుగులతోఁ బొందుచేత ముప్పు
భార్యకుఁ జనునిచ్చి పాటిసేయుట ముప్పు
　　పదిమంది కాదిన్న పనులు ముప్పు

మొండికొయ్యల మాట నమ్మికొని బుధులు
పాడు తంటాల పని కడ్డపడుట ముప్పు
భూరిమయ...　　61

పరమ మూర్ఖుండైన సరసాగ్రగణ్యుండు
　　శుద్ధ జడుండైన బుద్ధిశాలి
సంకరకులుఁడైన సంపూజనార్హుండు
　　అవివేకియైన ప్రజ్ఞాన్వితుండు
గడు పందయైన విక్రమశౌర్య ధుర్యుండు
　　మలభక్షకుండైన మాన్యగుణుఁడు
పరుష భాషణుఁడైన బహువాక్య చతురుండు
　　ధర్మశూన్యుండైన తగవు పెద్ద

యనుచు బొగడిక గాంతురీ యవని యెంత
హీనులైనను వ్యవహారమూని యున్న
భూరిమయ...　　62

సాహసౌదార్య పౌరుషశాలి యాతఁడు
　　పావనవంశ సంభవుఁ డతండు
నిఖిల విద్యాభ్యాస నిపుణుఁ డాతఁడు
　　దాన కళాధురంధరు డతండు
అంచిత చతురపాయజ్ఞుఁ డాతఁడు బుద్ధి
　　కుశలుఁ డాతఁడు పూజ్యగుణు డతండు
సదమలకీర్తి విస్తారుఁ డాతఁడు భవ్య
　　సరస సౌందర్య లక్షణు డతండు

ఎవ్వఁ డిద్ధాత్రిఁ బడిపల్లెలేలు చుండు
సతఁడు సర్వజనోత్తముం డనఁగ బరఁగు
భూరిమయ 63

కుక్షింభరుని బుధ రక్షా పరుం డంచు
నతి నికృష్టుని మహాత్యాగి యనుచు
బహుబీజ సంభవుఁ బరమపావనుఁడంచుఁ
జంచలాత్ముని ధైర్యశాలియంచు
దౌర్జన్యకారిని ధార్మికోత్తముడంచుఁ
గఠిన చిత్తుని దయాకరుఁడటంచు
జారకర్ముని పరదార వర్జితుఁడంచు
నుత్తమాధముని శాస్త్రవేత్తయంచు
గవులు కకార్తి చేతను గడుపుకొఱకు
సన్నుతింతురు మదిలో విచారపడక
భూరిమయ... 64

పండితశ్రేణికి బ్రబలమాత్సర్యంబు
ఘన కవీంద్రులకు యాచక గుణంబు
భాగ్యవంతులకు వైభవ మదోద్రేకంబు
సత్కులోద్భవులకు జారవృత్తి
ధరణీసురులకు సత్కర్మానపేక్షత
విద్యాధికులకు దుర్వ్యసనగరిమ
నరనాథులకు నీచపురుషసాంగత్యంబు
తాపసోత్తములకుఁ దామసంబు
నలువ గల్పింపఁడేని తన్మహిమఁబొగడఁ
దరమె యెవ్వరికైన యిద్ధాత్రియందు
భూరిమయ 65

కలిపురుష ప్రతీకాశులై దగుమోటు
పశులగాపరులు భూపాలురైరి
చెడుగు కొంటెలకెల్ల బొడమిన గడుతొత్తు
కొడుకులు దొరలైరి గురుతు దనర
జారచోరులు దురాచారులన్యాయ ప్ర
చారులు ప్రబలులై గేరుచుండ్రి
మాలలు తమ్ముళ్ళు మంగళ్ళు నంబులు
బలువెజ్జులైరి భూతలమునందు

సౌర యీ యుగధర్మంబు లరయమదిక
విస్మయకరంబులై గనుపించుచుండె.
భూరిమయ... 66

పలువురు ఛీ యన్న పనులు పెక్కొనరించి
పలుమరు పరుష భాషలు వచించి
పూఁటపూఁటకు మాంసపుంజముల్ కబళించి
తనవైభవమున మత్తత వహించి
పలుగు కొంటెను బెద్దలఁజేసి మన్నించి
బుధసంగతి కహస్యబుద్ధిగాంచి
అన్యాయమున విత్తమార్జన గావించి
పెల్లుగాఁదిండిచే యొళ్ళుబెంచి

యించుకంతయు సద్వృత్తి [illegible]క్షి
హీనునకుఁబౌరుషము గద్దెయెంచిచూడ.
భూరిమయ... 67

అంగడంగడ బిచ్చమడిగి వేసాల్ వేసి
జాలులు దెచ్చి పైజార్లు బట్టి
బాజార్లు మడిచి సవారీలు మోసి గు
రాల మేపియు గుసిలొళ్ళ ద్రవ్వి

పొగచుట్టలం బీల్చి బోగంపు చానల
యిండ్లు కావలియుండి యెఱుక చెప్పి
పశువుల గాసి తెప్పలు వీసి ముండల
దార్చి లంజలకుఁ బాదంబు లొత్తి
పొట్టఁబడి మీఁద దొరయైనవాఁడు ధర్మ
నీతి మార్గంబు నడుపగా నేరగలడె
భూరిమయ... 68

ప్రజలనందఱ బాధపఱచుటకై పుట్టి
యాచకాళులఁ దిట్టి యవలగొట్టి
సరస మహా కవీశ్వరుల కెగ్గులు గొట్టి
కొంటెల నలుగుర గూడగట్టి
పూర్వప్రతిష్ఠలు భూమిలోనికి మెట్టి
పండితోత్తముల రాకుండఁబట్టి
బీదల మనవి చెల్లిన మార్గమువట్టి
ప్రబల సంపత్తి గర్వమున దొట్టి
నష్టి క్రూర నృపాలుఁడు గట్టిదనము
దిట్టముగ భవ్యకీర్తి చేపట్ట గలఁడె
భూరిమయ... 69

పలుగు గయ్యాళిదెబ్బల గండు పలుగాడి
మూలుగుబోతు బల్ మాయ లేడి
పిసినిగొట్టు పిసాళి పెంకె బొంకుల పుట్ట
చెడుగు నిక్కులయుక్కు చెనఁటిమంకు
టకుబాజు కల్లరి టాటోటు గడుమోట
బంచెల పుట్టిల్లు నంచగత్తె
టంకుల రాట్టంబు రవ్వలమారి తం
టాకోరు రంతులరాపు ముచ్చు

ఇట్టి బేర్జంపుఁ బెండ్లాము నేలుచున్న
నరుని దౌర్భాగ్య దశ యెన్న నౌరులవశమె
భూరిమయ... 70

దానధర్మ దయావిహీన మానసురాలు
సకల మాయా పాప జన్మురాలు
గురుతరానేక దుర్గుణ గణాన్వితురాలు
బహుజనోపద్రవ సహితురాలు
భూతభేతాళ ప్రభూత భీకరురాలు
సతతాన్యనిందా విచారురాలు
భూరి కోపవికార భార దారుణురాలు
పరజన ద్రవ్యాపహరణురాలు

యెన్న నిటువంటి పెండ్లాము నేలుచున్న
పురుషుని యభాగ్య మెంతని బొగడవచ్చు
భూరిమయ.. 71

కులుకు మిటారి పూవిలుతు చేతి కటారి
బంగరు బొమ్మ కప్రంపు దిమ్మ
యన్నుల తలమిన్న చిన్న సంపెఁగ గున్న
గోముల నడుదీవి గుజ్జుమాలి
పన్నెలదొంతి మవ్వంపు పువ్వుల బంతి
రతనాల తేట వరాల మూట
పండు వెన్నెల సౌరు బలుమానికపుతీరు
వలపుల మొక్క మేల్ తలుపుచుక్క

యనఁగ దఁగియున్న చెలి గూడి యలరుచున్న
పురుషుని యదృష్ట మెంతని బొగడవచ్చు
భూరిమయ... 72

గమగమ వలచు చక్కని మల్లెపూచెండు
తమ్మి వాల్గొమ్మ చే నిమ్మపండు
నిగనిగలాడు బల్ సొగసు కల్వ సరంబు
రంగారు బంగారు బొంగరంబు
చకచకలీను మానికపు తీరు సలాక
నీటొప్పు విప్పు పన్నీట వాఁక
మిలమిల మెఱయు క్రొమ్మించు మించుల తీరు
తలతలల్ జూపు ముత్యాల కోవ

యెన్న యిటువంటి లేయన్ను మిన్న దొరకు
మున్ను నిన్ను నుతుల్ గొన్న యన్నరునకు
భూరిమయ... 73

చిరతర సౌభాగ్య గరిమ పార్వతిఁ బోలి
వర భోగముల శచీ తరుణిఁ బోలి
బహుతరోత్కృష్ట సంపద నిందిరను బోలి
చతుర మంజూక్తి భారతిని బోలి
రూప విభ్రమ కళాప్రౌఢిని రతిఁ బోలి
సంతతక్షమను భూ కాంతఁ బోలి
భూరి పాతివ్రత్యమున నరుంధతినిఁ బోలి
ఖ్యాతి సంతానాప్తి నదితిఁ బోలి

చెలఁగుచున్నట్టి యిల్లాలు గలిగెనేని
పురుషమణి పుణ్య మెంతని పొగఁడవచ్చు
భూరిమయ 74

సువతుల ముదిపెంపు సొంపు పాపలకును
సనబోండ్ల చిన్నారి నగవులకును
ముసవల గడితంపు సొగసు చెయ్వులకును
సువిదల గడు వింత యొప్పులకును

చిలుకల కొల్కుల చిన్నె పన్నెలకును
　　నతివల దద్ద యొయ్యారములకు
మెలఁతల నీటాచు మేలుకోపులకును
　　జెలియల బలితంపుఁ జెలువములకు

బలునిరాబారి పెద్దలే వలచి తొల్లిఁ
జిక్కిరని వించు నొరులకుఁ జెప్పనేల
భూరిమను... 75

భామల చెలువంపు మోము దమ్మలకును
　　నబలల తే జెక్కు టద్దములకు
గాంతల సిబ్బెంపుఁ గబ్బిగుబ్బలకును
　　సంగనామణుల సూగారులకును
కలకంఠకంఠుల కమ్మ వా తెఱలకు
　　సుందరాంగుల వాయిఁ జూపులకును
బల్లవపాణుల మెల్లని నడలకు
　　మందయానల ముద్దు మూటలకును

గాంచి పులకించి ధృతి సంచలింపకుండ
నిలువఁగా శక్యమౌనె యానలువకైన
భూరిమయ ...... 78

ఒకమాఱు వాసంతపికవధూకాకలీ
　　ధ్వని సదృక్కంఠ నాదముల మించి
యొకమాఱు నిర్మల ప్రకటశరశ్చంద్ర
　　చంద్రికా రుచిర హాసముల నెఱపి
యొకమాఱు నిశిత దర్పక ధనుర్జ్యా ముక్త
　　శరజాలనిభ కటాక్షముల నించి
యొకమాఱు రత్నకందుక చారుకుచలస
　　ద్కాంతు లొక్కించుక గానుపించి

తరుణు లెంతటి ధీరుల ధైర్యమెల్లఁ
జూరగొందురు కన్నెత్తి జూచిరేని
భూరిమయ ...... 77

ఒకమాఱు కెమ్మోవి యొరపు రాణింపంగ
సూటిమీఱగ జిన్ని పాట పాడి
యొకమాఱు గుబ్బలయుబ్బున సడలిన
పయిట మెల్లనె పొందుపడగఁదిద్ది
యొకమాఱు గడితంపు టొయ్యారములు దోఁప
గిలకిల మనుచు నవ్వులనుఁజొక్కి
యొకమాఱు తేనియ లుట్టి పడ్డటువలె
జిలిబిలి ముద్దుపల్కుల దనర్చి
చెలియ లీ రీతి పురుషుల చిత్తములను
గరఁగఁజేతురు భృత్యులుగాఁగ దమకు
భూరిమయ ...... 78

అన్నదమ్ములు కర్మమని మొత్తుకొందురు
అక్క చెల్లెండ్రు హా యనుచు నుండ్రు
చుట్టాలు పదుగురు చుల్కఁగాఁ జూతురు
తల్లి లోలోపల గ్రుమ్ములుచుండు
జ్ఞాతివారలు చాల చప్పట్లు గొడుదురు
వదినెగారులు దెప్పి గదుముచుండ్రు
ఇరుగు పొరుగుల వార లిండ్లకు రానీరు
పెండ్లిండ్లకైనను బిలువ రెవరు
శ్రీహరీ! దొంగతనమెంత చెడ్డతప్పు
యెంచగా నీడు దానికి నేడి లేదు
భూరిమయ...... 79

తలక్రిందుగాను వేదము జెప్పగా వచ్చు
బహు మంత్ర సిద్ధులుఁ బడయవచ్చు
సకల శాస్త్రములు ప్రసంగింపఁగా వచ్చు
తీర్థయాత్రాసక్తిఁ దిరుగవచ్చు
సతతోపవాస నిష్ఠలు గాంచగా వచ్చు
సర్వ పురాణముల్ చదువ వచ్చు
నృత్త గీతాదులన్నియు నేరఁగావచ్చు
నఖిలగారుడ విద్య లాడవచ్చుఁ

గాని దారిద్ర్యబాధ యొక్కటియుఁగడువ
శక్తిఁ గలుగదు నేలాటి జనునికైన
భూరిమయ... 80

క్షితినాథు చేత తాజీము చెందఁగ వచ్చు
బుధులచే మన్ననఁ బొందవచ్చు
జనులలో బహుయోగ్యు డనిపించుకొనవచ్చు
బుధులలోపలఁ గొప్పఁ బొందవచ్చు
జ్ఞాతులచే మహోత్సవముఁ జెందగవచ్చు
కులములోఁ బెద్దయై మెలఁగ వచ్చు
బరులచేఁ బాదముల్ పట్టించు కొనవచ్చు
వీరులలో ఖ్యాతి వెలయవచ్చు

నవని లోపల యెట్టివాఁడైనఁ గాని
యుంచితంబుగ పది కాసు లబ్బియున్న
భూరిమయ... 81

ఉదయాస్తమయముల నొగి నిద్రగనువాని
బలుమారు కొండెముల్ బలుకువాని
సతతంబు పరుష భాషలు వచించెడివాని
యన్యాయ వర్తనుం డైన వాని

పెద్ద లెవ్వరు పేరఁబిలిచి మాటాడరు
　　భార్య యెప్పుడు తూల బలుకుచుండు
బంధువులు నలుగురు పాటి సేయఁగఁ బోరు
　　తనవార లంత ఛీ యనుచు నుంద్రు
పరమార్థ సాధనోపాయకర్మ మడంగు
　　నిల్లు నొళ్ళును గూడ గుల్ల యగును
అంది పొందిన వార లందఱు తేలిక
　　బట్టి బల్ గెగ్గీలు గొట్టుచుందు

రవనిలోపల జారత్వ మరయ హాని
యెంచిచూచిన బురుషుని కేది లేదు
భూరిమయ... 87

పితృ మాతృలకు మనఃప్రీతిగా మెలగుచు
　　గురువులపై భక్తిఁ గుదురుకొలిపి
పెద్దలఁగని చాల ప్రేమ పూజింపుచు
　　దీనుల బోషించి తెఱ వెఱింగి
బంధు విధేయుఁడై బహు జన మిత్రుఁడై
　　సాధుసజ్జన గోష్ఠి సలుపుచుండి
పరకాంతలను మాతృ భావంబుగా జూచి
　　సంతత ధర్మ ప్రచారుఁడగుచు

మెలఁగు చున్నట్టి వాఁడె పో దలప భవద
ఖండ కారుణ్యమునకుఁ బాత్రుండు సుమ్ము
భూరిమయవాస కోలంక పురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల! 88

# గువ్వలచెన్న శతకము

వేమన చౌడప్ప శతకముల ధోరణిలో రచింపబడిన శతకము లందు గువ్వల చెన్న శతక మొకటి. ఈ శతక కర్తృత్వము వివాదాస్పదముగ నున్నది. క్రీ.శ. 1923 నాటికి తమకు లభించిన ఆధారము - ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటితమైన వ్యాసము - ననుసరించి వంగూరి సుబ్బారావు గారు వజ్రపంజర మరున్నందన - గువ్వల చెన్న శతకములను పట్టాభిరామ కవి కృతములుగ నూహించిరి. పదునేడవ శతాబ్దినాటి అప్పకవి వజ్రపంజర శతక పద్యమును లక్ష్యముగా నుదాహరించినందున పట్టాభిరామకవి అంతకు ముందె అనగా 1600 ప్రాంతమున జీవించియుండునని సుబ్బారావుగారు భావించిరి కాకినాడ గ్రంథాలయము వారు ఈ శతక ప్రతిని సంపూర్ణముగ ప్రకటింప నున్నట్లు సుబ్బారావుగారు అప్పటికే వినియుండిరి. వారు శతక కవుల చరిత్రలో చాటుపద్య మణిమంజరి చాటుపద్య రత్నాకరము లందుదాహృతములైన పదునాలుగు పద్యములను మాత్రమే బరిశీలించిరి.

శతక కర్తృత్వము, కవి కాలము అను అంశములను గూర్చి వంగూరి సుబ్బారావు గారి అభిప్రాయము పునఃపరిశీలనార్హము. గువ్వల చెన్న శతకము పట్టాభిరామ కృతమనుటకు స్పష్టమైన ఆధారములు లేవు. శతక నామము ననుసరించి మాత్రము గువ్వల చెన్నడు ఈ శతకమును రచించినట్లు లేదా అతనిపేర రచింపబడినట్లు భావించవచ్చును. ఆత్మసంబుద్ధిపరముగ వేమన ననుసరించి, ఈ కవి శతకమును రచించియుండును. గువ్వల చెన్నని ప్రసక్తి శతకమునందొకటిరెండు సందర్భములందు ప్రస్తావింపబడినది. శతక పద్యము లందు పాశ్చాత్య సంస్కృతి తత్ప్రభావము తెలుగువారిపై ముద్రవేసిన అంశము బహుళముగ గలదు ఈ ఆదారము ననుసరించి గువ్వల చెన్న శతకము

పదునెన్మిదవ శతాబ్దినాటి దని భావించుట కవకాశము కలదు. ఆత్మసంబుద్ధి పరముగ వ్రాసినచో గువ్వల చెన్నడే ఈ శతకకర్త అనుటకెట్టి సందేహము లేదు. గువ్వల చెన్నని కులమును గూర్చి ఆతనికి సంబంధించిన కథలనుగూర్చి కొందరు విపులముగా వ్రాసిరి. కాని అవి అన్నియు ఊహలపై అక్కడక్కడ ఆ నోట ఈ నోట ప్రచారముననున్న గాధలపై ఆధారపడినవి.

గువ్వల చెన్న శతక పద్యములు నూటికిమించి యున్నవి. వీనిలో కంద పద్యముల సంఖ్యయే అధికము. చాటుపద్య సంకలన గ్రంథములలో కొన్ని వృత్త పద్యములు కూడ ఉదాహృతములు. కందపద్యము లన్నిటియందు గువ్వల చెన్నా అను మకుటమే కలదు. ఒకదానిలో బిజనవేముల చెన్నా అని ఉన్నది. కొన్ని పద్యములకు పాఠాంతరములును కలవు. చౌడప్ప శతక పద్య పాదము లిందు కొన్ని చేరినవి. ఈ రెండును ఆత్మసంబుద్ధిపరమైన కంద పద్యశతక ములు. వీనిలోని సామ్యము ననుసరించి జనుల వ్యవహారమున కొన్ని మార్పులు కూడ కలిగినవి. వీనిని కొంతవరకు పరిష్కరించి వావిళ్ళవారు 111 పద్యము లతో ఈ శతకమును ప్రకటించిరి. గువ్వలచెన్న శతకమున పద్యములు మరి కొన్ని కలవు. కొన్ని పాఠములుకూడ పరిష్కరించదగి యున్నవి.

చౌడప్ప వేమనల ననుకరించి గువ్వల చెన్న శతకకర్తకూడ సమకాలిక వ్యవస్థను సమీక్షించి రాజకీయ, మత, సాంఘిక, ఆచారవ్యవహార, ప్రకీర్ణాంశము లను గూర్చి నయమార్గమునను అధిక్షేపధోరణిలోను తనకు తోచిన రీతిలో విమర్శించెను. కొన్ని పద్యములలో సామాన్య నీతులు, పూర్వ కవుల ధోర ణితో ప్రసిద్ధ నీతిశాస్త్రశ్లోకానుసరణములుగ ఉపదేశాత్మక రీతిలో వచింపబడి నవి. ఇందుసు కొన్ని నిజపరిశీలనకు వచ్చిన అంశములు చేర్చబడినవి. గోంగడి ప్రశస్తిని గోంగూర రుచిని చాటిన పద్యము లీ సందర్భమున ప్రత్యేకముగ గమ నింపదగినవి.

పాశ్చాత్య నాగరికత అప్పుడప్పుడే తెలుగుదేశముపై ముద్రవేసిన కాలమున వెలువడిన శతక మిది. మారిన వ్యవస్థను అస్తవ్యస్తమైన స్థితిగతులను

పాశ్చాత్య నాగరికతా వ్యామోహము నొందిన మనఃప్రవృత్తులను, ఆచార వ్యవహారములను ఈ శతక కర్త నిశితముగ విమర్శించెను. తిలకము జుట్టు త్యజించి తెల్ల లిజారు టోపి ధరించి శ్వేతముఖులుగా రాణించుటకు యత్నించిన ద్విజులను, కుక్కలను పెంచి ప్రక్కలనిడి ముద్దాడి అనుదినము సబ్బునీటిచే కడుగువారిని కవి నానావిధములుగ మందలించెను. పాశ్చాత్య నాగరికత పట్ల తెలుగువారికి కలిగిన వైముఖ్యమును వెల్లడించిన స్థితి యిది.

కులస్త్రీలు నృత్య నాట్య సంగీత విద్యలను కులవిద్యలుగా నభ్యసించుట-వకీళ్ళ దుర్వర్తనము-పాశ్చాత్య నాగరికతా వ్యామోహము కవిత్వము-మున్నగు వానిని వస్తువుగ స్వీకరించుటలో శతకకర్త కొత్తదనమును చూపెను. చౌడప్ప 'పస' గల అంశముల నన్నింటిని ఒకచో చేర్చి చెప్పినట్లు ఈ శతకకర్త వివిధ ధ్వనులను వాని ఆధార స్థానములను ధ్వన్యనుకరణ పదముల కన్వయించి విపులముగ వివరించెను. కసకస-రుసరుస-కరకర-పరపర-గుడగుడ-బుడబుడ-లొడలొడ మున్నగునవి ఇట్టివి. కవిత్వమునకు సంబంధించిన విద్యల పరిస్థితిని సమీక్షించి సరస్వతి చర్యలు కూడ చిత్రవిచిత్రగతిని సాగుచుండునని కొన్ని పద్యములలో చిత్రించెను.

సూక్తిప్రాయములైన నీతులు అధిక్షేప, అర్థాంతరన్యాస, అన్యాపదేశ దృష్టాంతరీతిలో సాగినవి. పందిరి మందిరమగునా? తల పరువు నోరె చెప్పును, చెలమైన మేలు కాదా కులనిధి యంబోధికన్న అన్న పద్యభాగము లిట్టివి. బూతు పదముల నుపయోగించుటలో ఈ కవి చౌడప్ప ననుకరించినట్లు తోచును. అశ్లీలార్థ ద్యోతకములగు ఈ పద్యములందు హాస్య అధిక్షేప చమత్కృతి కనిపించును. ఇటువంటి పద్యములు రెండు మూడు మాత్రమే కలవు.

గువ్వలచెన్న శతకకర్త కందపద్య రచనగూర్చి తనకు గల సామర్థ్యము నెచటను ప్రస్తావించలేదు. అయినను కందపద్యపు నడక, శైలి, రచనా విధానము-సూక్తి విన్యాసము ఈ కవికి గల సామర్థ్యమును నిరూపించుచున్నది.

వెలకాంత లెందరైనను-కలిమిగల లోభికన్నను-మున్నగు పద్యము లీ శక్తిని చాటుచున్నవి. సుపరిచితములైన నూత్నోపమానములు, నిశిత పరిశీలనాత్మక దృష్టితో కూడిన లోకజ్ఞత, మానవ మనస్తత్వ పరిశీలనాత్మక రీతులు భావ వ్యక్తీకరణకు భిగిని చేకూర్చినవి. సామాన్యమైన అంశములను సరసమైన ఉపమానములచే వ్యక్తీకరించుట యందు, గంభీరోదాత్త విశేషముల నలవోకగా సామాన్యరీతిలో వివరించుటయందు కవికి గల నేర్పు ప్రశంసార్హము.

గువ్వలచెన్నని లోకజ్ఞత బహుముఖముగ నున్నది. నీతిశాస్త్ర శ్లోక భావములను నిశితలోక పరిశీలనాత్మక దృష్టిలో రంగరించి వ్యక్తీకరించిన పద్యము లీ శతకమున ఎన్నియో కలవు. మిత్రుని విపత్తునందు—నీచున కధికారంబును—అను పద్యము లిట్టివి.

నీతి అధిక్షేప శతకములలో సాధారణముగ కలియుగధర్మముల ప్రసక్తి వచ్చును. పాశ్చాత్య నాగరికత ముద్రపడిన అనంతరము సాంఘిక వ్యవస్థలో కలిగిన మార్పులను గమనించి గువ్వలచెన్న శతకకర్త వాస్తవిక దృక్పథము వహించెను. వర్ణభేదములు లేక కాలక్రమమున అందరును ఆచారాదులందు ఒకే విధానము ననుసరింతురని పచించిన సందర్భమిట్టివి.

# గువ్వల చెన్న శతకము

శ్రీ పార్థసారథీ! నేఁ
బాపాత్ముఁడ నీదు పాలఁ బడినాడ ననుం
గాపాడు మనుచు నాంతర
కోపాదు లడంచి వేఁడు గువ్వల చెన్నా! 1

నర జన్మ మెత్తి నందున
సరసిజనాభు నెదలోన స్మరియించుచుఁ ద
చ్చరణములు మఱవ కుండిన
గురుఫల మగు జన్మమునకు గువ్వల చెన్నా. 2

ఎంతటి విద్యలఁనేర్చిన
సంతసముగ వస్తు తతులు సంపాదింపన్
చింతించి చూడ నన్నియు
గొంతుకఁ దడుపుకొనుకొఱకె గువ్వల చెన్నా. 3

సారా సారము తెఱుఁగని
బేరజులకు బుద్ధిఁ జెప్పఁ బెద్దల వశమా!
నీరెంత పోసి పెంచినఁ
గూరగునా నేలవేము గువ్వల చెన్నా. 4

అడుగునకు మడుగు లిడుచును
జిడిముడి పాటింతలేక చెప్పిన పనులన్
వడిఁజేసినంత మాత్రన
కొడుకగునా లంజకొడుకు గువ్వల చెన్నా. 5

ఈవియ్యని పద పద్యము
గోవా, బధాబ్రాయు, కొనఁగఁ గుంభిస ముఁదిని,
ఈ విచ్చిన పద పద్యము
గోవా మఱిఁ జదువుకొనఁగ... 6

ఇరుగు పొరుగు వారందఱుఁ
గర మబ్బుర పడుచు నవ్వగా వేషములన్
మఱిమఱి మార్చిన దొరలకు
గురు వగునా బ్రాహ్మణుండు... 7

అనుభవము లేని విభవము
లను భావ్యము కానియాలు నార్యానుమతిన్
గనని స్వభావము ధర్మముఁ
గొనని సిరియు వ్యర్థ మెన్న... 8

పదుగురికి హితవు సంప
త్ప్రదమును శాస్త్రోక్తమైన పద్ధతి నడువన్
జెదరదు సిరియు హరి భక్తియుఁ
గుదురుసు గడ మఱిని నెన్న... 9

వెలకాంత లెంద ఱైనను
సలకాంతను సాటిరారు కులలయ మందున్
బలు విద్య లెన్ని నేర్చిన
గుల విద్యకు సాటి రావు... 10

కలకొలది ధర్మముండినఁ
గలిగిన సిరిగడలకుండఁ గాసారమునన్
గలజలము మడువు లేమిని
గొలగొల గట్టు తెగిపోనె... 11

తెలిసియుఁ దెలియనివానికిఁ
దెలుపం గలఁడే మహోపదేశికుఁడైనన్
బలుకం బారని కాయను
గొలుపంగలఁ దెవఁడుపండ... 12

చెలియలి భాగ్యము రాజ్యం
బులనేలుచు జనుల ద్వేషమునఁ జూచుచుఁ గ
న్నుల మత్తతఁగొన్నాతఁడు
కొలనికిఁ గాపున్నవాఁడు... 13

అపరిమిత వాహనాదిక
మపూర్వముగనున్న యల్పుఁ డధికుం డగునా ?
విపులాంబర వాద్యంబుల
గుపతియగునె గంగిరెద్దు... 14

పందిరి మందిరమగునా ?
వందిజనం బా ప్తమిత్రవర్గంబగునా ?
తుందిలుఁడు సుఖముఁ గనునా ?
గొంది నృపతి మార్గ మగున... 15

మిత్రుని విపత్తునందుఁగ
శత్రమును దరిద్ర దశను భ్రాతలగుణమున్
బాత్రాది విభక్తంబున
గోత్రను గనుగొనఁగవలయు... 16

అంగీలు పచ్చడంబులు
సంగతిఁగొను శాలుజోడు సరిగంచుల మేల్
రంగగు పుప్పటులన్నియు
గొంగళి సరిపోల వన్న... 17

నీచునకు ధనము గల్గిన
వాచాలత గల్గి పరుష వాక్కులఱచుచున్
నీచకృతియగుచు మది సం
కోచము లేకుండఁ దిరుగు... 30

ఆల్పునకు నెన్ని తెల్పినఁ
బొల్పుగ నిల్వవవి పేడబొమ్మకు నెన్నో
శిల్పపుఁబను లొనరించినఁ
గోల్పోక యలారుచున్నె... 31

పిత్రాద్యైశ్వర్యముచేఁ
బుత్రులుఁ బౌత్రులును ధర్మబుద్ధిఁ జరింతుర్
చిత్రగతి నడుమఁ గల్గిన
గోత్రం జిత్రగతిఁ దిరుగు... 32

ధర నాడపడుచు సిరిచే
నిరతంబును బొట్టనించి నీల్గెడు మనుజుం
డొరు లెఱుఁగకుండ జాతో
గురుతుగ నూతఁబడు టొప్పు... 33

గొల్లింటఁ గోమటింటను
దల్లియుఁ దండ్రియు వసింప దాను వకీలై
కళ్ళు మదమెక్కి నతనికి
సుళ్ళైనం గానరావు... 34

కాళ్ళం జేతులఁ జెమ్మట
నీళ్ళవలె స్రవించుచుండ నిరతము మదిలోఁ
సుళ్ళక వకీలు నని తన
గోళ్ళం గొఱుకుకొను దిఁజుడు... 35

సంతతితర మున్ను పుట్టిలు
భువి నెఱసుగ నుండి సమయమును మారంపై
నవ్వుచుందురు రావేడినఁ
గువచనములు పల్కుచుంద్రు... 36

తనవారి కెంత గల్గినఁ
దన భాగ్యమె తనకు నగుచు దగు వాఙులకున్
దన తోకచేత విసునె
గుణియైనన్ ఘోటకంబు... 37

అతిచన విచ్చి మెంగగ
సుతసతులైన నిరసించి చులకన చేతుర్
మత మెఱిగి పరింపందగుఁ
గుతుకముతో మనుజుఁ డెపుడు... 38

చెన్న యను పదము మునుగల
చెన్నపుర మొకటి దీనిచెంతను వెలయున్
సన్నుతులు వెల్పు నుతులును
గొన్నాతని కరుణచేత ... 39

ధర నీపేర పురంబును
గిరిజేశ్వర హావభక్తి కీర్తియు నీయు
ద్వరసుతులుగాంతు విదియొక
గురువరముగ నెంచుకొనుము... 40

తెలుపైన మొగము గలదని
తిలకము బొట్టు ద్యజించి తెల్లయిజారున్
పలటోపి గొనఁగ శ్వేత ము
ఖులలో నొకఁడగునె ద్విజుడు... 41

వెల్లుల్లిఁ బెట్టి పొగచిన
పుల్లని గోంగూర రుచిని బొగడగ వశమా
మొల్లముగ నూనెవేసుక
కొల్లగ భుజియింప వలయు ... 42

నీచున కధికారంబును
బాచసనకు నాగ్రహంబుఁ బండితజనుఖలకిన్
వాచాలత్వము బుధ సం
కోచముఁ గడు బాధకములు... 43

ముద్దున నెఱుఁగని తలిపా
బొద్దుగఁగొను విద్యచే మహోద్యోగము తా
నద్దైనఁ గనులకిఁ గల
గొడ్డువలెఁ జరించు చుండు... 44

బుడుతలు భోగంబులు సిరి
యనవరు కొలంది గన కార్యమువత హితులై
తొందరి కడుఁ జెడుదు రింపైఁ
గుడి మొనములు లేర ముందు... 45

కస కసలు కాయగూరల
బుస బుసలగు పొంపవండు బుసుతేల యనంగన్
రుసరుసలు కోపి యందును
గుసగుసలు రహస్యమందు... 46

కరకర నముయట యందును
బరపర యనగనెప్పుడు పుణుకు ప్రారంభమందున్
జురమర కాయిటి యందును
గొర కొర యగుఁ గోపదృష్టి... 47

కలిమెగల లోభి కన్నను
విలసితమగు పేద మేలు వితరణియైనన్
చలి చెలమ మేలుకాదా
కులనిధి యంభోధి కన్న... 48

విను మన్నీల శిఫారసున
పసునమ్మిన వాని పనులు ధ్వంసించు పకీ
ర్తిన మున్నవాఁడు తిరిపెముఁ
గొనునాతడు చల్లవాఁడు... 49

సజ్జనులు సేయునుపకృతి
సజ్జను లెఱుగుదురు గాక సజ్జన దూష్యుల్
మజ్జనమునైన నెఱుగరు
గుజ్జన నంబలినిగాని... 50

తడ తడ భీతహృదయముల
బెడ బెడయగుఁ బుట్టు బట్టి విడఁగట్టనెడున్
బడ బడ బాముట యందును
గుడగుడ యన్న ముడుకంపు... 51

పొగా లంగరకాలును
మీఁగాళ్ళ నలారఁబంచె మేలిమి కట్టుల్
సాగించు కండువాల్పయి
కోఁగా యిఁకఁ గాన మెన్న... 52

వెలయాంధ్ర పీఠం జనఁ
సలపు లవారిగఁ జనించి తమ మిత్రులతోఁ
గలిసి షితారు నెపంబునఁ
గులుకుచు పోవుదురు ముందు... 53

ధనమే మైత్రినిఁ దెచ్చును
ధనమే వైరమును దెచ్చు ధనమే సకలన్
ఘనతను దెచ్చును నెంతటి
గౌనముల కుప్పలకునైన... 60

జనకుని కులవిద్యలు గల
తనుజుఁడు తనుజుఁడు గాక ధారుణిలోనన్
దనుజుఁడు దనుజుండగుఁ ద
ద్గుణ విద్యలు లేకయున్న... 61

ఆకారకగు చుట్టములకు
మ్రొక్కఁగవలెగాని చూచి మూల్గెడు వారల్
లెక్కిడుట కౌలకె యోర్వని
కుక్కలు మేఁక మెడ చన్ను... 62

నిజ వారకాంత లైనన్
బొజుగులలారఁ గమరంద భుజుల సధములన్
గజిబిజి లేక గ్రహించుచు
గుజగుజ పెట్టక లరింత్రు... 63

ప్లీడరులమని పకిళ్ళీ
వాడుక చెడ స్వేచ్ఛఁ దిరిగి పాడు మొగములన్
గూడనివారిం గూడుచు
గూడెములఁ జరింత్రు ముందు... 64

ఇల్లా లబ్బె నటంచును
దల్లింగని తిట్టకొట్టి తరిమెడి తను భృ
త్తల్లజునకు భువికీర్తియుఁ
గుల్లలు గద దివి సుఖములు... 65

తల పరువునోరె చెప్పును
లలికాయల పండు పరువు రంగే చెప్పున్
కులవాజి జవము నడకయుఁ
గులమును వేషంబు చెప్పు... 66

వేముల దిను నలవాటును
భామల గని పీడుటయు బలితోషమునన్
బాముల మైత్రియు నేర్చినఁ
గోమటితో మైత్రి వలయు... 67

ఇలఁ గోమటి ఁజెలికానిగఁ
వలఁచుచు ఁదద్ధితముగాగ దలనాల్కకొలెన్
మెలగుట నేర్చిన గడుసగు
కులకర్ణిని గూడవలయు ... 68

తన హితవు గోరు సతిగల
వసుకనె గృహాదిపసనంబు తగు పురుషునకున్
దన కడుపు శక్తి కొలదిగ
గొనవలయుఁ బదార్థములను ... 69

తన తల్లియొక్క పరువును
తనదగు నోరె ప్రకటించు తత్త్వంబు వినియే
సునృపులు ఘోషాఁబెట్టిరి
సుజాడు లస్య మగు ననుచు... 70

చుట్టరికము జేసికొనన్
గట్టిడిగా దిరిగి తిరిగి కార్యంబైనన్
మిట్టిపడుచు మాట్లాడడు
నటించు నియోగి వరుడు ... 71

ఎంతధికారం బున్నను
సంతతమా పరుల యెడల సత్కృప జూపుం
డెంతయు నమ్రతఁ జూపును
గొంతైనను మిడిసిపడడు... 72

వేషముల చేత నొకటను
భాషాపతి కులులు మొదలు పదజుల వరకున్
శేషించి యొకడు నుండడు
ఘోషాయును బోవు ముందు ... 73

సధవయు విధవయు నొకటిగ
బుధు లీక్షింపంగ నుంద్రు పొంకము మీఱన్
అధమంపు వేషభాషలఁ
గుధరము లనఁ గదలకుంద్రు ... 74

నీతి యెఱుంగని నీచున
కాతత రాజ్యము లభింప నధికుం డగునా
నాతివలెను నటియించునె
కోఁతికి స్త్రీ వేషమిడిన ... 75

తక్కువ తరగతిగల నరు
డెక్కువ యగువానిఁ గాంచి యేడ్చుచు నుండున్
జక్కఁగ గరి వీధిఁ జన
గుక్కలు గని మొఱుగకున్నె ... 76

పరువున కొకటగు బంధూ
త్కరమున ధనవంతు నధికుగా నధనికునిన్
గర మల్పునిగాఁ జూతురు
గురి నెన్న ధనంబు తిరమె 77

తొత్తునకే శిపమెత్తగ
నత్తఱి బ్రహ్మోక్రపతి ననెడి నార్యోక్తి పలెన్
తొత్తు కొడుకైన రాజును
క్రొత్తగ సేవింపఁదలయు ... 78

రంగా బుంగా కొట్టిన
పొంగిన మిరియాల నేతి మొదటి పిడుచతో
మ్రింగిన నాకలి నడచుట
కుంగల నజ్జును హరించు... 79

సంగీతము నాట్యము గణి
కాంగనలవి గాని యేమి కులాంగనలవియా ?
పొంగుచు వాద్యము లచ్చట
కుం గొని పని పొదఁగలరె... 80

జాలివిడి బెలికానిని
మాలనిగా నెన్నవలయు మఱియును బనికిన్
మాలినదై చెట్టెక్కెడి
గోలాంగూలం మనసంపను... 81

ముట్టించు మానమునకొర
కట్టిడిచేయఁబడె దానికట్టు బెలినవే
రట్టొనరించుచు గర్వపు
గుట్టుం బెలియుటకు గాదె... 82

అలికి బుసమిచ్చునకోఁ
పెలిక పుణ్యమునపడై నఁ బెలిరచేయున్
లాలించిన కొలఁదిగ నదు
పాంతఁగొను నధిక కలుజ... 83

అవసరవిధిఁ బరువెఱుఁగని
నివసనమున కరుగ నగు ననేకాపత్తుల్
భువి విత్తముఁగొని పలుకని
కువాక్కులు పకీళ్ళసాక్షి... 84

ధనపద్గర్వులు కొందఱు
ఘనమనుచుం బం క్తిభేదకలితమ్ముగ భో
జనముం గావింతు రటుల
గొనప టఘు మందురు బుధాళి... 85

చెడుబుద్ధి పుట్టినప్పుడు
నడిచేయక తనదు హృదయసాక్షి యెఱఁగి సీ
వృదంగమిది తగదనఘు జన
ముడుపలెఁ గృపజెప్పుచుండు... 86

మేన యొకటి కలదని కడు
వేడుకలం బడుచు విఱ్ఱవీగుచు నీమం
దాతపుఁ బరులెవ్వరు రాఁ
గూడపడుచుఁ బల్కుచుండు... 87

బోధిస్మయమంచు త్యాగికి
శోభిత ధీరునకు యుద్ధకోలత్వమ్మున్
వైభవము పతికిఁ బ్రాణ
షోభంబుగఁ దోఁచుచుండు... 88

సిరిగలుగ సుఖము కలుగును
సిరిసంపదలున్న సుఖము చింత్యము భువిలోఁ
దరువు చిగిర్చిన గోమగు
గనుతఁగొనదె తావులున్న... 89

తక్కువవానిని రమ్మని
యెక్కువవానిఁగ నొనర్ప నెంచినఁ గావ
మ్మక్కఁగ నందల ముంచినఁ
గుక్కకున కుఱుకక్కున్నె... 90

తబ్బిబ్బుగాడు క్షుద్రుఁడు
సబ్బండుగ నిష్ఠనున్న సబ్బునఁ గడుగఁ
బొబ్బలిడ నల్లశ్వానము
గొబ్బున తెల్లనిది యగునె... 91

జారిణి తనపగు పనులె
వ్యారలుఁ ఆదరను బుద్ధి వర్తించు నిలన్
క్షీరముఁ దాగు బిడాలము
కోరికలోఁ దలచునట్లు... 92

వాకొనెద గూనమును గల
చాకలి యధికారియైన జనముల సుఖముల్
చేకొనిన కొఱవిచేఁ దలఁ
గోకికొనిన యట్టులుండు... 93

పక్కల నిడి యుద్ధాడుచుఁ
జక్కఁగఁ గడుగుచును దినము సబ్బు జలముచే
నక్కఱదని యస్పృశ్యపుఁ
గుక్కలఁ బెంచుదురు ద్విజులు... 94

కాంచనచేలుని విడిచి ప్ర
పంచమున స్వేచ్ఛపాలయ్యెఁ గడున్
జంచల యగు సిరి పోకకుఁ
గుంచితమతి యగుట తగదు... 95

చింతలఁ జిక్కుచు నున్నను
స్వాంతము నెప్పుడైన హరుని యందుంచఁ దగున్
అంతటనాఁచున్న సరసి
గొంతటి తేపై నఘంగి... 96

వెలియాంధ్రపలెయ బనిపా
టలు విడి సంగీతము నటనము నభినయమున్
గలవిద్యలుగా గైకొని
కులసతులు చరింప్ర[illegible] సుందదు... 97

లోభికి ప్రాయంబు సోమరి
యౌ భామకుఁ బనియుఁ నిర్ధనాత్మునకు సభ
త్యాభివృద్ధియును బహు
గోభర్తకు నఘము లురువు... 98

సరియైన వారితోడను
సరుగఁగవలె నొక్కఁపనిరి నటుకాకున్నన్
విరసపుఁ బల్కులు పల్కును
నంతి విడిపోవున్ననగఁ గలరు... 99

తమ్ము మనసు చదివించిన
మున్నిటి విలేఖనమున మాన్యజనులకున్
సున్నిడి యరిచే విత్తముఁ
గొన్న పకీల్చల్లవాడు... 100

వెలయాలు లజ్జచేఁ జెడు
నిలఁబాలుడు చెడు మరాళ నెప సంతుష్టిన్
విలసిల్లి భూధవుఁడు చెడుఁ
గులసతి చెడు లజ్జ లేమి... 101

భువి నొకడు చెడును మఱియొకఁ
డవిరళముగ వృద్ధినొందు నది విధి వశమౌ
రవి యుదయించును నొక దెసఁ
గువలయపతి క్రుంకు నొకెడ... 102

ఎవ్వరి కెవ్వఁడి చెప్పిన
నెవ్వడు వినరెయ్యెడియును నెట్టెట్టినదుల్
ముప్పుముగఁ జూచుచుందుము
గుప్పలనఁ జరిత్రు ముందు... 103

ఎప్పటికైనను మృత్యువు
తప్పదని యెఱింగియుండి తగిన చికిత్సం
దప్పింప నెఱుఁగ కత్తటి
గుప్పింప నేద్బ్రుద వదేల... 104

జనయును మృత్యువు మొదలుగ
మరలఁగ రాకుండునట్టి మార్గంబేదో
గురుతెఱుఁగఁ జేయుముని శ్రీ
గురుగురుని భజింపవలయు... 105

పరమార్థము నొక్కటె తెలిగి
నరుడు చరింపంగవలయు నలుపురితోఁ దా
మరుఁదనగఁ దిరిగినను దన
గురి యొక్కటి విడువకుండ... 106

చతురాస్యుని సృష్టియు భువి
కృతిపర్యసి భంగిగాన నేరగతి సద్
స్వరి చక్రంబై యుండును
గుతుకముతోఁ జూచుచుండు.... 107

గుడి కూలును నుయి పూడును
వడి నీళ్ళం జెరువు దెగును వనమును ఖిలమౌ
చెడనిది పద్యము సుమ్మీ
కుడి యెడమలు చూడకన్న... 114

ఇప్పద్యము లన్నిటిలోఁ
జెప్పిన నీతులను మదిఁ జేర్చి తెలిసినన్
దప్పర మనుగడలోఁ గడు
గొప్పగ నీతిపరుడగును గుప్పించున్నా ! 115

